



# సాధనాపరమైనవి

*ప్రశ్న :- నేను వివాహం చేసుకోకుండా అజన్మ బ్రహ్మచారిగా వుండిపోవాలని ఉంది. ఒకవేళ వివాహం చేసుకున్నా నా మనస్తత్వానికి సరిపడే అమ్మాయి దొరుకుతుందా? అసలు నేను వివాహము చేసుకొనటము నా సాధనకు మంచిదో కాదో ధ్యానంలో సాయిబాబాను అడిగి చెప్ప ప్రార్థన.*

*- యన్. ఆర్. రాజు, మద్రాసు.*

**జవాబు :-** ప్రతి విషయాన్ని బాబాను అడుగరాదు. శ్రీ రమణ మహర్షిలా జన్మత: జ్ఞానం గలవారు తప్ప, తక్కిన అందరూ వివాహం చేసుకోవడం శ్రేయస్కరం. కాని ఎప్పుడు ఏ షరతులమీద చేసుకోవాలన్నది నీవు, నీ తల్లితండ్రులు కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఆలోచించి నిర్ణయించుకోవాలి. ఈ విషయమై బాబాను ప్రార్థించి, మన తెలివి మేరకు ఆలోచించి నిర్ణయించడమే మన కర్తవ్యం. అవి ఎవరి నిర్ణయం వారే చేసుకోవాలి. మన సాధనకు ఏది శ్రేయస్కరమో బాబాకు తెలుసు.



ప్ర :- ఆడవాళ్ళకు వైరాగ్యం పనికిరాదని ఎందుకు అంటారు ?

ఎస్. రాజమ్మ, పుల్లంపేట

జ :- వాస్తవానికి ఎక్కువమంది స్త్రీలకు, పురుషులకు జన్మతః తీవ్రవైరాగ్య సంస్కారముండదు. అందుకని శాస్త్రంలో పురుషులకు కూడా ''ఆశ్రమాదాశ్రమంగచ్ఛేత్''ఒక ఆశ్రమము నుండి, తరువాత ఆశ్రమమునకు, క్రమముగా వెళ్ళవలసినది అని శాస్త్రం. ఎక్కడో అరుదుగా శ్రీ రమణమహర్షి వంటివారు, ఏ బాహ్యకారణం లేకుండానే, యవ్వనం వికసించేలోపున ఆత్మజ్ఞానము పొంది విరాగులవుతారు. ఇటువంటి ఉత్తమాధికారులను, ఏ శాస్త్రం అడ్డుకోదు, అడుకోలేదు. గురుసిద్ధారూఢులు (హుబ్లి) ఈ కోవకే చెందుతారు. శాస్త్రాలన్నీ సామాన్యాధికారులకోసం. ఆత్మజ్ఞానం లేకున్నా, సామాన్యులకలవిగాని వైరాగ్యాన్నందినవారికి పూర్ణుడైన గురువు తారసిల్లి, సన్యాసార్హతను గుర్తించి విధిస్తాడు. రామకృష్ణుడు వివేకానందునికి ఇలాగే చేసారు. ఇలా జరుగనప్పుడు, అట్టి విరాగి శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురువును ఆశ్రయించి, వారు అనుమతిస్తే యావజ్జీవితము బ్రహ్మచారిగా నిలచిపోవచ్చు. అయితే అట్టివారు గురువుచెంతనే విధేయులై వుండాలి. ఇంతటి ఉత్తమాధికారులైన స్త్రీలు కూడా, విరక్తులు కావచ్చునని, బృహదారణ్యకోపనిషత్తులోని సూచన. సామాన్యులైన పురుషుల విషయంలో కూడా బాగా పరీక్షించాకనే సన్యాసదీక్ష నివ్వాలని సాంప్రదాయం.

అయితే స్త్రీలకు ఋతుధర్మమున్నది. బిడ్డలను కని, పెంచడం ప్రకృతి ఆమెకు విధించిన శారీరక ధర్మం. నరజాతిలోనే గాక, జంతు జాతులలో కూడా ఈ ధర్మం కనబడుతుంది. దీనిని నిర్వర్తించడానికి తగిన స్వభావాన్ని. అధికంగా స్త్రీలకు ప్రకృతి యిస్తుందని, కనుకనే వారు ఎంతో ప్రేమ ఓరిమిలతో తమ ధర్మాన్ని నిర్వర్తించగలగడమేగాక, బిడ్డలు కలగనప్పుడు బాధపడ్డం కూడా, సహజంగా కన్పిస్తుంది. ఆధునిక, సాంఘిక పరిస్థితుల వత్తిడివలన స్వతంత్రంగా ఉద్యోగం చేస్తూ వంటరిజీవితం గడిపే స్త్రీలలో ఎక్కువమంది అనతికాలంలో తమకు తోడు, అండ లేని బాధకు గురి అవడం మనం చూస్తుంటాం. వీరిలోని ఈ నైజం ప్రత్యక్షంగానో పరోక్షంగానూ పురుషుల అండనుకోరేలా చేస్తుంది.



ఈ ప్రకృతి సూత్రాన్నెరిగిన సమాజం దృష్టిలో అండలేని స్త్రీ ఎన్నో యిబ్బందులకు గురి అవుతుంది - ఈ కారణంగా తమ స్వభావాన్ని వ్యతిరేకించి కృత్రిమంగా వైరాగ్యాన్ని అవలంభించవద్దని శాస్త్రం హెచ్చరిస్తుంది. సహజ గుణాలకు అనుగుణమైన కర్మలనే సరియైన అవగాహనతో నిర్వహించడం ద్వారా జీవులు భద్రంగా పరమార్థాన్ని పొందాలని భగవద్గీతకూడా స్థూలంగా చెబుతుంది. కనుక సామాన్య స్త్రీ యథాశక్తి ప్రాతివ్రత్యాన్ని, పురుషులు ఏకపత్నీ వ్రతాన్ని అనుష్ఠించడం ఉత్తమమని శాస్త్రాలు, సాంప్రదాయాలు సూచిస్తున్నాయి. అట్టి స్త్రీ వైధవ్యాన్ని పొందితే, బిడ్డలు, తోబుట్టువులు లేక తల్లితండ్రులతో కలసి నివసిస్తూ భగవంతునే భర్తగా ధ్యానిస్తూ ఇంద్రియ మనోజయాన్ని సాధించి జీవించాలని శాస్త్రం. అప్పుడు వారికి విధించిన జీవిత విధానం సన్యాసి జీవిత విధానమును పోలియుండడము గమనార్హం. కాకుంటే సన్యాసులు శరీరంలో శక్తి యున్నంతవరకు ఏకాంతంగా స్మశానము, చెట్లు మొదలు, పాడుబడ్డ ఆలయాలను ఆశ్రయించుకొని దేశాటనం, భిక్షాటనలతో జీవించాలి. పై కారణాలుగా ఇది స్త్రీలకు కష్టతరము. అయినా విశేషార్హత గల స్త్రీలు అవధూత చివటం అమ్మ, అవధూత మాలపిచ్చెమ్మ వలె ఏకాకులై జీవించారు. అయితే అంతటి యోగస్థితి కలిగాకనే వారలా చేశారన్నది గమనార్హం. తక్కినవారు సాహసించి, స్వతంత్రించి ప్రమాదాలకు గురి గాకూడదని మాత్రమే శాస్త్రం.

ప్ర :- ***మావూరిలో ఒకరి ఒంటి మీదకు సాయిబాబా వస్తారట? ప్రశ్నలు చెబుతారు. వేరొకచోట మరొకరికి వెంకటేశ్వరస్వామి వస్తారట? వీటిని గూర్చి మీ అభిప్రాయం?***

**- ఏ.యస్. నారాయణ, నెల్లూరు.**

జ:- దైవం సర్వగతుడు. అతడెలా ఎక్కడికొస్తాడని? విశ్వమంతా తన రూపముగా కలిగియున్న, ఆయన ఒక పరిమిత దేహంలోకెలావస్తాడు- సాయి అయినా వెంకటేశ్వరుడైనా? శ్రీ సాయి సశరీరులుగా శిరిడీలో వున్నప్పుడే, ''సాయి అంటే యీ 5 1/2 అడుగుల శరీరంకాదు'' అనేవారాయన. భక్తుల అనుభవాలు అలానే వున్నాయి. ఆయన అనుగ్రహించదలచిన భక్తులకు తామే స్వయంగా దర్శన, నిదర్శనాలు ప్రసాదిస్తున్న సాయికి వారి భక్తులకూ నడుమ యిలాంటి మధ్యవర్తులు ఆయనకవసరం లేదు. వెంకటేశ్వరుడు గూడ అంతే.



ఈ కాలంలో ప్రబలిన అజ్ఞానాన్ని మౌఢ్యాన్ని, ఆధారంగా తీసుకొని కొంత వరకు తాము దాని వలయంలో చిక్కినవారే యిలా వ్యవహరించేది. వీటిని నమ్మవద్దు. కాగితం, కలం తీసుకొని కొన్ని రోజులు వరుసగా యిలాటివారి దగ్గరకెందరొచ్చారో, వారి సమస్యలు ఏమిటో యీ "దివ్య వాహనాలు" ఏమి చెప్పారో వ్రాసి పెట్టుకొని, వారు చెప్పేవాటిలో ఎంత నిజమవుతున్నాయో ఓర్పుగా పరీక్షించండి మీకే తెలుస్తుంది.

*ప్రశ్న :- కొన్ని సమయాలలో మనస్సు ఎట్టి వికారము చెందకుండా వుంటుంది? ఒక్కొక్కప్పుడు పరిస్థితుల ప్రభావానికి లొంగి తప్పుభావం కలిగి, తరువాత ఆలోచిస్తే తొలగిపోతుంది. అలాగాక స్థిమితంగా మనస్సు సరియైన స్థితిలో వుండాలంటే ఏమి చెయ్యాలి?*

- ఎమ్. సతీష్, ఒంగోలు.

జ : - యుక్తవయస్సు వచ్చాక ప్రకృతి సిద్ధముగా శారీరక ధర్మాన్ని అనుసరించి మనస్సు కొన్ని భావాలను, కోరికలను పొందడం సహజమే. కాని అట్టివి ప్రకృతిసిద్ధముగాక, కృత్రిమ నాగరికతలోని అంశాలైన అశ్లీల సాహిత్యము, చలనచిత్రాల ప్రభావంవల్లకాని, ఫ్యాషన్ ప్రభావంవల్లకాని అటువంటి భావాలు, కోరికలు తీవ్రతరమైతే అవి దోషాలు అనబడతాయి. దేహారోగ్యానికి అవసరమైన ఆహారాన్ని కోరడంలో తప్పులేదు. తిండిపోతుతనం శరీరానికి అనారోగ్యకరమేగాక, ఒకవిధమైన మానసిక జాడ్యం అని చెప్పాలి. వాని ప్రభావముచేత మనిషి యొక్క చేతలు హద్దుమీరి ధర్మాన్ని, మానవతను ఉల్లంఘించే అవకాశమున్నది. అన్ని కోరికల విషయము అలాంటిదే! తన కోర్కెలను తీర్చుకోవడంతోపాటు, అందులోని బాధ్యతను గూడా భరించగల సంసిద్ధత కల్గియుండుటయే మానవత్వము, సంస్కారము. మితిమీరిన వాంఛలను హృదయంలో వహించి బాహ్యంగా సమాజానికి వెరచి శారీరక నిగ్రహాన్ని పాటిస్తే అటు శరీరము ఇటు మనస్సు కూడా క్రమంగా అవాంఛనీయమైన పరిణామాలకు దారితీయవచ్చు.

చక్కటి యోచనతో మనస్సును దుష్ప్రభావాలనుండి తొలగించుకోవచ్చు. విపరీతమైన వాంఛలకు గురిఅయినవాడు సాటి మనుషులను తన కోర్కెలను నెరవేర్చుకొనేందుకు అనువైన పనిముట్లుగానే చూడగలడు. అతని చర్యలు సాటివారి మానవత్వాన్ని దెబ్బతీసి వారిలో హృదయవేదనను మానవజాతిపై



జుగుప్స, అవిశ్వాసములను కలిగించగలవు. లేదా వారు కూడా తిరిగి సాటివారిపట్ల అలానే ప్రవర్తించటం నేర్చుకుంటారు.

అంతేకాదు మనిషికి సాటివారిపై ఎట్లాంటి భావముంటుందో అట్టి భావాన్నే గుప్తంగా తనపట్లకూడా కలిగివుంటాడు కనుక దేహమనస్సుల స్వస్థతనుకూడా పట్టించుకోకుండా వాటిని విలాస వస్తువులుగా మాత్రమే వాడుకొని దెబ్బతినే ప్రమాదము వున్నది. సాటివారిని ప్రేమించలేనివాడు తనను తానుకూడా ప్రేమించుకోలేడు. దీని విపర్యయము కూడా అంతే వాస్తవము. బాధ్యతాయుతమైన మానవత్వము; తనపట్ల తనకుగాని, యితరులపట్లగాని, తనకుగల ప్రేమకు గీటురాళ్ళు. కనుక సరియైన యోచనతో హృదయాన్ని అనుక్షణము పరిశుద్ధము చేసుకుంటూ ఉండటము అవసరము. అభ్యాసముతో యిది సహజస్థితిగా మారుతుంది.

సరియైన యోచనలో ముఖ్య అంశము : జీవిత లక్ష్యాన్ని అవగాహన చేసికొనడము శరీరము, వాక్కు, క్రియ, మనస్సులయొక్క సర్వసామర్థ్యాలను వికసింపచేసికోగల్గడమే. జీవిత లక్ష్యము తమకు తెలిసినా తెలియకున్నా ప్రతివారు జీవించాలనుకొనేది ఇందుకే. దీనికి ఒక్కటే ఋజువు. ఇలా మనలోని అంశాలను పటిష్టం చేసే ఆటలు, వినోద కాలక్షేపాలు వేరొక లౌకిక ప్రయోజనాలను; మనకు సంపాదించలేకపోయినా, అంత ఆసక్తికరంగా వుంటాయి. అందరకు ఇలాంటి వికాసాన్ని, పాటవాన్ని ప్రసాదించలేని విద్య, వృత్తి మొదలైన వాటిని మనం జీవికకోసం అనుసరించినా నిజానికి వాటిపట్ల ప్రతివారిలోను విముఖతే వుంటుంది. అలాకాక కొందరిలో లౌకిక ప్రయోజనాలే జీవిత లక్ష్యమన్న భ్రమ లోతుగానాటుకొని వుండవచ్చు కాని వారి ఆచరణ సుఖ శ్రేయస్సులనేగాక తమవారియొక్క, తమ యొక్క సహజ సామర్థ్యాలను వికసింపజేసికోలేనివిగా ఉండటమే గుర్తు. వారిలోని లోపానికి సామాన్యంగా అసహ్యాకరముగా తోచే వస్తువుల పట్ల కొంతమందికి అమితమైన ప్రీతి కలిగివుండటంలాగనే. ఇదికూడ అనారోగ్యస్థితికి చిహ్నం.

శరీరానికి చక్కటి వ్యాయామం మనస్సుకు చక్కటి యోచనను కల్గించే గ్రంధ పఠనము, యోచన, చర్చ యిలా సంపాదించ బడిన చక్కటి యోచన

విధానాన్ని సాటివారితో చక్కగా పంచుకోగల వాక్పటిమ మనలోని పైమూడు అంశాలను తనలో యిముడ్చుకొన్న "నేను" అనబడు ఆత్మచైతన్యము యొక్క తత్వాన్నివివేకంతో పరిశోధించగల జిజ్ఞాస-. యివి మన కర్తవ్యాలు. వీటిని పొందటానికి యత్నించడంలో అవసరమైన స్థాయిల బలాన్ని మనం ప్రకృతినుండి తిండి, నీరు, గాలి, వెలుగు, ఇంద్రియానుభవాల ద్వారా పొందుతూనే వుంటాము. కాని యిన్ని రీతుల నిర్దుష్టంగా యత్నించాలని మనలో చాలామందికి తెలియదు. అట్టివారిలో జీవించడానికి అవసర మైనంతకంటె అదనముగా మనస్సు, వాక్కు, ఆత్మల వికాసానికి కృషిచేయడంలో వినియోగపడవలసిన శక్తి మనలో యిమడక, విపరీతమైన మనోవికారాల రూపంలో, విశృంఖలమైన ప్రవర్తనలో ఖర్చు అవ్వాలని యత్నిస్తుంది. అందుకే పరివర్తన చెందని మానవాళి తరచు వినాశాత్మకమైన కార్యకలాపాలకు యిట్టే సంసిద్ధం కావడం చూస్తాము-కుల-మత-జాతి-ప్రాంతీయ-రాజకీయ-కలహాలలో. కనుక సరియైన యోచనను ప్రజల కందించడానికి మన సాయిబాబా పత్రిక, ప్రచురణలు ఎంతగానో కృషి చేస్తున్నాయి.

ప్ర :- ***ఎన్ని పుస్తకాలు చదివినా ధ్యానం కుదరడం లేదు. రాకూడదనుకున్న విషయాలే మనస్సులో బొమ్మలులా వస్తాయి. ధ్యానం కుదరలేదని బాధపడడం నిత్యకృత్యమై పోయింది. ఎలా చేయాలి?***

***- చి॥ ప్రమీల, రాయచోటి.***

జ:- తిన్నగా ధ్యానాన్ని అభ్యసించటానికి దాదాపు ఎవరూ తగరు. అందుకే అది సాధ్యంగాదు. చక్కని యోచనపద్ధతితో ఏయే విషయాలు మనకు అప్రయోజనాలో అర్థం చేసుకొని మననం చేస్తే వాటిపట్ల మన ఆసక్తి నశిస్తుంది. అవి యిక ఆలోచనల్లోకి రావు. అంతేగాదు. రోజంతా మనస్సుకు క్షణం తీరిక యివ్వకుండా అటు పాఠ్యాంశాలను చదవడంలోనో లేక చక్కని యోచనను తెల్పే గ్రంథాలనో చదువుతూ ఆ ప్రకారం ప్రత్యక్షంగా మనస్సును భ్రమింపచేసే విషయాలను గురించి విడమరచి ఆలోచిస్తే వాటిపట్ల మనవ్యామోహం నశిస్తుంది. దీనికితోడు వాంఛనీయమైన విషయాలను, భక్తిని ప్రేరేపించే వాటిని గురించి చదవడం, వినడంగూడ చేయాలి. క్రమంగా లౌకిక కర్తవ్యము,



భక్తిపూర్వకమైన భగవచ్చింతన (లేక సద్గురు చింతన) తప్ప అన్యానికి మన మనస్సులోనూ, జీవితంలోను తావు లేకుండా చూచుకోవాలి. పనికిమాలిన కబుర్లు, పత్రికలు, కథలు లాంటివి దగ్గర చేరనివ్వగూడదు.

'ఫలాని విషయాలు గుర్తురాకూడదు', 'అవి తప్పు' అని దేనిని అనకూడదు. అలా అనకూడదంటే వాటిగురించి చక్కగా ఆలోచించి వాటిలో సారంలేదనే యత్నం చేయక తప్పుకుంటున్నామన్నమాట. రోగాన్ని మాన్పుకొనేబదులు కప్పిపుచ్చుకొని ముదరబెట్టుకుంటున్నా మన్నమాట.

బుద్ధుడు, వివేకానంద, రామకృష్ణ, సాయి, రమణమహర్షి వేమనవంటి వారి రచనలను చరిత్రలను చదవాలి. అవి కొన్ని సార్లు అయ్యాక భగవద్గీత అర్థంతో రోజూ కొన్ని శ్లోకాలు చదువుతూ వాటిలో మన కెక్కువ ఉపయోగమనుకొన్నవి కొన్ని ఎన్నుకొని వాటిని మరలా చదువుతుండాలి.

ఇదిగాక, ఎక్కువ మందికి కొంత వ్యాయామం అవసరం. ఆసనాలు, సూర్యనమస్కారాలు, ఆటలు గూడ చాలా మంచిని చేస్తాయి. అవికాగానే సాయి వంటి మహాత్ముల గురించి ఆలోచిస్తూ చదువుతూ గడపాలి. వారి గుణాలను గుర్తుతెచ్చుకొంటూ వారి నామస్మరణ చేయాలి. అసూయాది భావాల గురించి సాయి ఎలా ఆలోచనతో పొగొట్టుకోవాలో తెల్పిన రీతిన యోచించడం నేర్చుకోవాలి. అలానే పైన ప్రస్తావించిన మహాత్ముల వాక్యాలను స్మరించాలి. ఇంతవరకూ చెప్పినవి శ్రద్ధగాచేస్తూ గడుపు. ధ్యానం సంగతి వేరుగా యిప్పుడే పెట్టుకోవద్దు. పైరీతిన **హృదయము, మనస్సు సంస్కరించబడగానే కుదిరే స్థిరతే ధ్యానం.** అది చివరికి కుదురుతుంది.

పాఠ్యాంశాలు గాని, పై జెప్పినవి గాని గుర్తుంచుకోవద్దు. అర్థం చేసుకోవాలి. అర్థమవగానే తిరిగి సాటివారితో చెబుతుండాలి. గుర్తుంచుకోదలచినది నిలవదు. అర్థమైంది పోదు.

***ప్ర:- భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగము, ధ్యానము వీటికిగల సంబంధమేమిటి?***

***-జి. నారాయణమూర్తి, రాజమండ్రి.***

**జ:-** అధ్యాత్మ జీవితమనే కారుకు భక్తే పెట్రోలు; జ్ఞానమే స్టీరింగ్, వైరాగ్యమే బ్రేకు; యోగము-యింజను. ధ్యానం ఆ కారు కదలడం; సద్గురువు



మార్గం; పరమాత్మ లక్ష్యం; సాత్వికమైన బుద్ధియే డ్రైవింగ్ నేర్చిన డ్రైవరు. వీటిలో ఏది లోపించినా ఆధ్యాత్మిక జీవితం కుంటుపడుతుంది.

ప్ర:- ***స్త్రీలు గాయత్రిని జపించవచ్చా?***

***- శ్రీమతి సి. పద్మావతి, తిరుపతి.***

జ:- అసలీ రోజులలో 99% మంది చేసేది సరియైన గాయత్రీ అనుష్టానమేగాదు. కేవలం గాయత్రీ నామజపం. దైవమొక్కడే నన్నాక ఏ దివ్యనామమైనా ఒక్కటే. ఆ వ్యక్తిలోని దైవ సంపద. లేక సత్వగుణాలపై దాని సఫలత ఆధారపడుతుంది. దీని వివరం 'శ్రీగురుచరిత్ర'లో శ్రీగురుడు-సాక్షాత్తూ దత్తస్వామి-చెప్పినదే ప్రమాణం. దానికితోడు నేను దర్శించిన ఒక్కగానొక్క గాయత్రీ మంత్రసిద్ధుడు చెప్పిన వివరం యిటీవల ప్రచురించిన "నేను దర్శించిన మహాత్ములు-1" (శ్రీ పాకలపాటి గురువుగారు) అన్న చిన్న గ్రంథంలో చూడండి-యింక సందేహముండదు.

ప్ర:- ***నేనెన్ని పారాయణలు, పూజలుచేసినా సాయి నాకు స్వప్నదర్శనమైనా యివ్వలేదు, విశ్వాసం లేనివారికి గూడ అనుభవమిస్తున్న ఆయన నాకెందుకివ్వడంలేదు?***

***- సి. యస్. ఆర్. సాయినాథ్, రాజమండ్రి.***

జ:- ***చి॥ సాయికి ఆశీస్సులు,***

కేవలం లౌకిక దృష్టితో పారాయణ చేసేవారిని సన్మార్గంలోకి లాగాలి గనుక వారికి త్వరగా నిదర్శనము, దర్శనమూ యిస్తారు సాయి. కొత్తవారు యింటికొస్తే మర్యాద చేయమా? పరమార్థం కోసం పారాయణ చేసేవారు ఆయనకు తమ కుటుంబంలోని వారివంటివారు. ఎప్పుడూ యింట్లోని వారికి మర్యాదలెందుకు చేస్తారు? వారి ప్రధాన కర్తవ్యం నిష్ఠ-సబూరీ అనే దక్షిణ సమర్పించుకొనడమే. 'సాయి ప్రబోధామృతము' శ్రద్ధగా విరామ సమయంలో చదివి దీక్షతో విడవకుండా పారాయణచేయి. కన్పించిన **సాధువుకల్లా మొక్కి వారివెంట పడకుండడం అవసరం.** కన్పించినవాడిని వివాహమాడక తపస్సు చేసింది గనుకనే పార్వతీదేవి సాక్షాత్తూ పరమేశ్వరుణ్ణే పరిణయమాడింది.

మన మనస్సూఅలానే చేయాలి. అందుకు తపస్సు చేయాలి. అపుడు కేవలం మర్యాద గాక శాశ్వత సన్నిధి లభిస్తుంది. శ్రీ సాయిబాబా జీవితచరిత్ర, శ్రీగురుచరిత్ర విడవకుండా పారాయణ చేస్తూండు!

ప్ర:- **పారాయణ, సప్తాహము, చాతుర్మాస్యము, అనుష్ఠానం అంటే ఏమి?**

- కె. యస్. రావు (నెల్లూరు)

జ:- పారాయణంటే భగవంతుని లీలలు, అవతార విశేషాలు చదువుకొంటూ, వింటూ అందులో పరాయణత చెందడమే. క్రమంగా మన తలంపులు, ఆచరణ, ఆశయాలు అన్నీ ఆయన పరంగా మారడమే-సంసారుల జీవితాలు తమ కుటుంబ శ్రేయస్సే లక్ష్యంగా కల్గినట్లు. ఏమి చేస్తున్నా, ఎక్కడున్నా మరపురానట్లు; మానవులందరు తాము తమ శరీరాలు, పేర్లు అన్న భావంతో తాదాత్మ్యం చెందినట్లు- భగవంతుని ప్రీతిని, స్మరణనూ పెంచేవిగా మారేలాగున చదవడము, మననం చేయడము- యివే పారాయణ. ప్రేయసికి ప్రియమైనవన్నీ ప్రియునికి ప్రీతికరములై, మిగిలినవన్నీ అయిష్టమైనట్లు క్రమంగా మన సద్గురువుకు ప్రీతికరమైన మాటలు, పనులు, నడవడులే మనకు ప్రీతికరములవడం పరాయణత. అది కల్గేలా సద్గ్రంథాలను చదవడం పారాయణ.

ఇలా ఒక స్థాయిదాకా ప్రీతి కల్గాక, కనీసం 7రోజులు ఆ భగవంతుణ్ణి లేక సద్గురువునూ, ఆయన లీలలనూ స్మరించడంలో గడపదలచి అందుకోసం ఆయనలోని దివ్యలక్షణాలను లీలలను స్ఫురింపచేసే నామాలతో గానం చేయడం, సాటివారు చేస్తుంటే వినడం-యిదే సప్తాహమంటే. ఇలానే 7రోజులలో ఒక్క పారాయణ చేసి దాని సహాయంతో నియమంగా అన్ని రోజులూ ఆయన స్మరణను నిల్పుకొనడం ఒకరకమైన సప్తాహ పారాయణ. 7రోజులలో యింతటి శ్రద్ధతో ఎన్ని సార్లు వీలవుతే అన్ని సార్లు చరిత్ర పారాయణము చేయడము, పూజ,స్తోత్రాలతో గడపడం-ఉత్తమమైన సప్తాహ పారాయణ. ('అహస్సు అంటే రోజు; సప్త + అహస్సు = సప్తాహము, 7రోజుల కాలము అని అర్థం).

సన్యాసులు ఆరోగ్యము, వయస్సు వున్నంతకాలం 3లేక 5రాత్రులకు మించి ఏవూళ్ళోనూ వుండకుండా భిక్షాటనంతో జీవిస్తూ సంచరిస్తూవుండాలి.



వర్షాకాలంలో మాత్రం ఒక పుణ్యక్షేత్రంలోనో, మఠంలోనో, ఆలయంలోనో వుండి ప్రత్యేకమైన వ్రతాచరణలో గడుపుతూ ప్రజలకు ధర్మబోధ చేయడం చాతుర్మాస్యవ్రతం. అనుష్టానము అన్నమాటకు అన్ని అంగాలతోగూడిన యోగసాధన, యిష్టదేవతార్చన, మంత్ర జపాలు చేయడం. అది సదాచారంతో సహా చేస్తేనే అనుష్టానమవుతుంది.

ప్ర:- *నేను పనులు చేసుకుంటూ సాయి నామస్మరణ, పాటలు పాడు కుంటుంటే నా ప్రక్కవారు అలా చేయకూడదని, ఒక చోట కూర్చుని మాత్రమే శ్రద్ధగా చేయాలంటున్నారు నిజమేనా?*

*-శ్యామలమ్మ, గూడూరు.*

జ:- సద్గురువును నిరంతరము మనమేమిచేస్తున్నా గుర్తుంచు కొనడమే కర్తవ్యమని శాస్త్రాలు, మహాత్ములు ఏకగ్రీవంగా చెప్పారు. ఆయనను తలచుకోకుండా యాంత్రికంగా నామం చేయడం, ఆయన గురించి పాడుకొనడం వలన పెద్ద ప్రయోజనముండదు. అపచారమేమీకాదు. మనింట్లో ఆయనెప్పుడూ ఉంటారు. ఎన్ని పనులు చేసుకొంటున్నా భర్త, బిడ్డలు ఎప్పుడూ గుర్తున్నట్లే. వారి కోసమే అన్నీ చేస్తున్నామన్న భావమున్నట్లే బాబా మన యింట పెద్దగా వున్నారని గుర్తుంటే చాలు, ఏమి చేసుకున్నా సాధనే అవుతుంది. ఆయనను సేవించుకునే పద్ధతి మార్చుచేసుకో వలసివచ్చినపుడు ఆ సంగతి స్వప్నదర్శన మిచ్చి ఆయనే చెప్పగలరు. వారి సాంప్రదాయంలో వారికి మించిన ప్రమాణమే లేదు. ఆ విషయంలో ఎవరు చెప్పినా వినవద్దు, పట్టించుకోవద్దు.

ప్ర:- *తక్కిన గుణాలను, తొలగించుకొని లౌకిక జీవితంలో సాత్విక భావాల నలవర్చుకోవడమెలా?*

-ఎస్. శ్రీనివాసులు.

జ:- శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర, శ్రీ గురుచరిత్ర, అక్కల్‌కోటస్వామి చరిత్ర అలానే మన పత్రికలో మహనీయుల చరిత్రలు మళ్ళీ మళ్ళీ చదివి మననం చేస్తుంటే యిప్పటి మన భేద దృష్టి సరియైనది కాదని, మన అజ్ఞానం



వలన వాస్తవమన్పించేదేనని ధృఢమైన భావం కలుగుతుంది. అజ్ఞానం వలన మనం రాగ, ద్వేష, అసూయలు కలిగి, ఆశావ్యామోహాల వలనగూడా అకృత్యాలు చేస్తామని, ఆ కర్మఫలం తప్పక అనుభవించవలసి వుంటుందని ధృఢంగా గుర్తుపెట్టుకోవాలి. అయినా నిత్యజీవితంలో యితరులు మనకు ద్వేషము, అసూయలతో కష్టం కలిగిస్తుంటే మామూలుగా యీ భావం నిలుపుకోపటం మొదట్లో కష్టంగానే వుంటుంది. కాని బాగా ఆలోచిస్తే గత జన్మలలో మనం వారిపట్ల అపచారం చేయటం వల్లనే వారికీ జన్మలో మనను కష్టపెట్టేబుద్ధి, అవకాశమూ, మనము తప్పుకోలేని స్థితి కల్గుతుందని తెలుస్తుంది. అట్టి ఋణానుబంధం లేనప్పుడు వారేమి చేసినా మనకేమీ చెడు జరుగదు. మనచెడ్డకర్మ కొంత మనమనుభవించనక్కర లేకుండానే ఆవిధంగా తీరిపోతుంది. మనం తప్పుకునే అవకాశముంటే తప్పుకోవచ్చు. బెదిరించడం తప్పనిసరియైతే బెదిరించనూవచ్చు. కాని ఎదుటి వ్యక్తిని ద్వేషించకుండా అతనిలోని దుర్బుద్ధిని మాత్రం నిగ్రహిస్తున్నామన్న అవగాహనతో చదరంగమాడినట్లు వ్యవహరించవచ్చు. సాధ్యమైనంతవరకూ అందరిలోవున్న సాయిని స్మరించి తొలగి వుండడం మంచిది. మన చెడ్డ కర్మ, ఋణానుబంధము తీరిపోతున్నాయని గుర్తుంచుకోగలిగితే చాలు. శ్రీ సాయి ప్రబోధామృతం చదివి మననం చేస్తుంటే యీ భావం స్థిరపడుతుంది.

ప్ర:- ***(1) నాకు గురుచరిత్ర చదువుతూంటే ఒక సందేహము వచ్చినది. శ్రీగురుడు, "పతివ్రత భర్తను నీడవలె వెంట నుండి ఏవిధంగా సేవ చేస్తుందో అదేవిధంగా శిష్యుడు గురువును సేవించి ముక్తిపొందాలి" అని చెప్పారు.***

***యదు మహారాజుకు అడవిలో కన్పించిన అవధూత, భ్రమరకీట న్యాయము గురించి చెబుతూ, సదా నేను గురువునే ధ్యానించి నేనే గురువంతటి వాడయ్యాను' ' అన్నాడు. ఇవి రెండూ నాకు పరస్పర విరుద్ధముగా తోస్తున్నాయి. శ్రీగురుని మాట ప్రకారమైతే సదా గురుసన్నిధిలోనే వుండాలి. కాని ఈ అవధూత ప్రకారమైతే గురువును తలుచుకుంటే చాలు కదా! ఈ సందేహము తీర్చండి.***

***(2) మాష్టారూ! ఈ మధ్య నా మనస్సు ఎప్పుడూ మిమ్ములనే తల్చుకుంటూ మీ సన్నిధిలోనే తిరుగుతూంటుంది. మిమ్మల్నే నాగురువుగా భావించు***



**కుంటున్నాను. కాబట్టి మీరు నాకు మీ సేవ చేసుకొనే అదృష్టము కల్పించండి.**

***- ఒక పాఠకుడు, గుంటూరు.***

**గురుచరిత్ర గురించిన సందేహము:** పూర్వపుణ్యము, ప్రారబ్ధము గురువుకు భౌతికంగా దగ్గరగా వుంచితే పతివ్రత భర్తను సేవించినట్లు గురువును సేవించడము, ప్రారబ్ధరూపమైన గురుకృప భౌతికంగా మన శ్రేయస్సును కోరి దూరంగా వుంచితే అపుడు భ్రమరకీటక న్యాయము కర్తవ్యాలు.

(2) జీవితములో తృప్తికరమైన మార్గాన్ని తెల్పిన వారిపై అత్యంత శ్రద్ధ కలగటం సహజమే. అది మంచిదే కాని దేహ ప్రారబ్ధముచేత ఏక్షణములో ఎక్కడుండాలో ఏం చేయాలోనన్నది అటుమానవుల పూర్వ ఋణాను బంధము, ఇటు శ్రీసాయి మనకు నిశ్చయించినది నిర్ణయిస్తాయి. అదే శ్రేయస్కరము. మన యిష్టాయిష్టాలను వారికి సమర్పించడమే దక్షిణ, సేవ. కారణం వారి నిర్ణయము అత్యంత శ్రేయస్కరము. మనకు తెలియకనే మనకంటూ కొన్ని ఇష్టాయిష్టాలేర్పడుతాయి. ఆయన తత్వాన్ని నిర్ణయాన్ని అర్థము చేసుకొని ప్రీతితో హృదయపూర్వకముగా స్వీకరించి ఏక్షణానికి ఎక్కడవుంటే అక్కడ మనకు విధించబడిన ధర్మాన్ని ఆయన ప్రేమపూర్వకమైన ఆజ్ఞగా స్వీకరించి నిర్వర్తించడమే భక్తి. కనుక నీవలా చేయడమే నా అభిమతము.

అయితే నన్ను గురువుగా నీవు తలుస్తుంటే ఒకటి గుర్తుంచుకోవాలి. నా అంతర్యం ఆయనపడం వల్లనే—పొట్లంలో మిఠాయి చుట్టినట్లు – ఈ దేహానికి, జీవితానికి ఏదైనా విలువ అబ్బుతుంది. కనుక నన్ను - అంటే నా దేహాన్ని ధ్యానించడముకంటే సాయిని ధ్యానిస్తేనే నాకు ఎక్కువ ప్రీతి. ఆయన బోధ అందజేయడము, ఆచరించి ఆయనను చేరడమే అందరి ధ్యేయమని గదా నేనూ విశ్వసించి చెప్పేది.

నిజానికి శ్రీ సాయివలె సాధన చివరి దశలో తప్ప గురువుకు భౌతికముగా అప్పుడప్పుడు తప్ప ఎక్కువ చేరువగా ఉండకూడదనీ; ఉంటే ఆ దేహమే



వారన్న భ్రమ పెరిగి మానవత్వ సంబంధమైన భావాలు, అభిప్రాయాలు కలిగి భక్తిశ్రద్ధలు-అర్జునాదులకులాగ-తగ్గే అవకాశ మెక్కువవుతుంది. అందుకే నేనింతవరకు శ్రీ సాయి భౌతిక దర్శనము కోరలేదు. ఆయన తన గురువునంటిపెట్టుకున్నట్లు, సేవించినట్లు సేవించగలిగేదాక భౌతిక దర్శనము వద్దని, వారి కృప, సూక్ష్మమైన సాన్నిధ్యము చాలునని అవి నన్ను వారి మార్గాన నడిపించాలని నేను ప్రార్థిస్తుంటాను. లేకుంటే 60 సం॥లు శ్రీ సాయీశుని సాన్నిధ్యంలో వున్న అందరిలో శిష్యుడనదగిన వారొక్కరు గూడా కన్పించలేదని సాయి ఎందుకంటారు? ఈమానవత్వ భావము కలుగుతుందనే ప్రమాదాన్ని సూచిస్తూనే ఒక శ్లోకములో అగ్ని, స్త్రీ, గురువులకు తగు మాత్రము దూరములో వుండాలని హెచ్చరించారు. గురుబోధను శాయశక్తులా ఆచరించి సంతోషముగా ప్రారబ్ధమనుభవించి ప్రత్యక్ష సాన్నిధ్యానికి అర్హత సాధించడమే జీవిత పరమావధి. అట్టి విశ్వాసము గల వాడికి ప్రారబ్ధము తలంటులా మాలిన్యాన్ని తొలగించి శుభ్రత నిస్తుంది.

ప్ర:- **మహాత్ములు పిచ్చివారుగాను, దిగంబరులుగానూ వుంటారని వ్రాస్తున్నారు. మామూలుగా పిచ్చివాండ్లు, వెఱ్ఱివాండ్లు వున్నారుగదా. మరి మహాత్ములను గుర్తించడమెలాగో చెప్పండి? మనకు ఇపుడు దగ్గరలో సశరీరులుగా వున్న మహాత్ములెవరో తెలపండి?**

**- బి.వి.యస్. రావు, ఏలూరు.**

జ:- పూర్వజన్మ సుకృతమో లేక సద్గురు కటాక్షమో వుంటే గాని మహాత్ములను దర్శించడం, గుర్తించడం ఎవ్వరికీ సాధ్యపడదు. తెలిసో తెలియకనో గత జన్మలో మహాత్ములకు మన సేవ చెందియుంటేనే ఈ జన్మలో మనకు వారు తారసిల్లుతారని పెద్దలంటారు. అయితే తీవ్రంగా ఈ జన్మలో చేసుకున్న బుద్ధిపూర్వకమయిన సుకృతంగూడ మనలను వారిచెంత చేర్చగలదని ఎందరి అనుభవాలో నిరూపిస్తున్నాయి. ఇట్టి సుకృతాలలో అన్నిటికంటే బలీయమైనది. సకల సాధుస్వరూపి సాయి అని తెల్పే "**శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర**"ను అట్టి సంకల్పంతో ప్రార్థనా పూర్వకంగా



పారాయణ చెయ్యడం. మరల అంతటి బలీయమైనవే **"శ్రీగురుచరిత్ర" పారాయణ, "గురుగీత" పారాయణ,** తగిన నిదర్శనా లెన్నింటినో మేము ప్రచురించిన "శ్రీ సాయిలీలామృతము," "శ్రీ అక్కల్‌కోట స్వామి చరిత్ర," "శ్రీ పాకలపాటి గురువుగారి చరిత్ర," సద్గురుజ్యోతి," "శ్రీగురుచరిత్ర" లలో చూడవచ్చు. ఆగష్టు ఆఖరుకు వెలువడనున్న "శ్రీ అవధూతలీల" లో కూడ చూడవచ్చు. అందుకే యిలా శ్రీ దత్తావతారులైన మహనీయుల చరిత్రలను పారాయణ చేసే మా సత్సంగ సభ్యులెందరికో మహనీయుల దర్శన ఆశీస్సులు లభించాయి. ఇలానే ముస్లింలైన సిద్ధపురుషులను గుర్తించాలంటే ఖురాన్‌లోని ఒక ప్రత్యేకమైన అధ్యాయాన్ని వారి వెనుక దిక్కుగా నిలబడి మనసులో పఠిస్తే ముస్లిం సిద్ధపురుషుడు తప్పక వెనుదిరిగి పలుకరిస్తారు. సామాన్యంగా వారుమనను తిట్టడమో , కొట్టడమో జరుగుతుంది. కారణం ఆ ప్రార్థన ఆ మహాత్ములను బలవంతంగా బహిర్ముఖులను చేస్తుంది. అందుకే అలా చేయడం ప్రమాదం. అలాంటి విషయాలు తెలిసినవారు విధిస్తే తప్ప అలా చేయకూడదు. శ్రీ దత్తావతారులైన మహాత్ముల చరిత్రల పారాయణవలన ఎటువంటి ప్రమాదం లేకుండా మహాత్ములు మనపట్ల ప్రసన్నులవుతారు. ఇది నారెండు దశాబ్దాల అనుభవం. మనమలా పారాయణలు చేస్తే మహాత్ములెలా పలుకుతారన్నది పై చెప్పిన గ్రంథాలలో చూడవచ్చు.

ప్ర:- ***షోడశోపచార పూజ స్త్రీలు యింట్లో ఎలా చేయాలి? సాయంత్రం గూడ బాబా ముందు దీపం పెట్టాలా?***

**- ఎస్. సి. లక్ష్మీదేవి, బెంగుళూరు.**

జ:- శ్రీ సాయి గానీ మరే దైవరూపంగానీ ఎప్పుడూ సర్వగతుడు, విశ్వరూపుడు గూడా. అయినా వివేకులూ, భక్తులు అయిన వారు ఈ సత్యాన్ని హృదయ పూర్వకంగా విరామ సమయమంతా గుర్తుంచుకోవాలి. అదే అనన్య భక్తి, సాధన. దానికి చక్కటి ఆరంభం నిద్ర లేవగానే చేసే ప్రాతఃస్మరణ. అలా మనస్సును స్మరణలో నిలిపి నిత్యకృత్యంగావించుకొని షోడశోపచారపూజ కుపక్రమించాలి. అయితే ద్విజులైనవారికి గాయత్రీజపం ప్రధానమని, తక్కిన



అనుష్టానాలకు ఆలంబనమనీ ఎలా చెప్పారో అలానే గృహిణికి మొదట పతిపూజ ప్రధానం. ప్రత్యక్ష దైవస్వరూపుడైన భర్తకు పాదాభివందనం చేసి ఆయనే ప్రత్యక్ష దైవమన్న గుర్తింపుతో సేవచేసి తర్వాత ఇతర దైవ రూపాలను పూజించనారంభించాలి.

**రెండవ విషయం :-** స్త్రీలు వేదార్హులుగారని, కనుక పురుషసుక్త విధానంతో పూజించరాదన్నది సాంప్రదాయకుల అభిప్రాయం. మహాభారతాది పురాణాలలో కలి ప్రభావాన్ని వర్ణించిన విధంగానే ఈ రోజులలో నిజానికి వేదార్హులు ద్విజులలో గూడ లేరనే చెప్పాలి. ఉన్నవారిని వ్రేళ్ళమీద లెక్కించవచ్చు. కనుక భక్తి శ్రద్ధలతో, అర్థచింతనతో చదవడమే! నిత్య జీవితంలో అసూయా ద్వేషాదులను యత్నంతో నిర్మూలించుకొని, సద్వర్తనానికి అంటిపెట్టుకొనే ఎవరైనా అర్హులేనని నా అభిప్రాయమేగాక, ఇంకెందరి అభిప్రాయమో కూడా. అయితే అట్టివారికి గూడ పురుషసూక్తంవంటి వేద మంత్రాలు అత్యావశ్యకము కూడ కాదు. పూజలోని భావ తీవ్రత ప్రధానం ఆభావాన్ననుసరించి సాయి చరిత్రలోని సంఘటనలను, సూక్తులను అనుసరించి మన నిత్య జీవితంలో హృదయగత భావాలను సంస్కరించుకో గల్గడమే ముఖ్యం. అదే నిజమైన శ్రద్ధ. కనుక యీ విషయం భావాన్ని బట్టి చేసుకోవచ్చు.

తరువాత ఏ రూపాన్నయినా మనం పూజించనారంభించినప్పుడుదానిలో క్రమంగా నూత్నమైన శక్తి జాగృతమవుతుంది. మనం పూజించినకొద్దీ అది మరింత చైతన్యమవుతుంది. అంతేగాక మన పూజా సమయాలలో దానికై అదే తీవ్రంగా పనిచేస్తుంది. ప్రీతితో మనమిచ్చే పూజ నివేదనలను స్వీకరిస్తుంది. కనుకనే సాయి అలాంటి మూర్తుల పూజను నిలిపివేసినవారు తమనే విస్మరించినట్లుచెప్పి మందలించేవారు.

**పై రెండంశాలు :-** స్త్రీలు పతిసేవానంతరము పూజ చేసుకోవడము, భావంతో పురుషసూక్తాదులు చేసుకోవడము లేకపోతే మానడము ఈ విషయంలో తప్ప స్త్రీ పురుషులకు పూజావిధానంలో తేడా ఏమీ లేదు. అలానే



స్త్రీలకు ప్రణవార్హతలేదు గనుక 'ఓమ్' వదలి తక్కిన 'శ్రీ'వంటి వాటితో నామావళిని కొందరు చదవమంటారు. గత్యంతరము లేకుంటేదప్ప బహిష్టులైనప్పటికీ గూడ పూజించక కేవల నామస్మరణలో వుండటం మంచిది. ఏ పండైనా నివేదనయత్నం యింట్లోవారితోచేయిస్తేమంచిది.

సాయంత్రం దీపం, నైవేద్యం బాబాకు అర్పించడం మంచిది. ఈ విషయం **'సాయినాథ పూజ'** ఉపోద్ఘాతం చదివి అన్వయించుకుంటే తెలుస్తుంది.

ప్ర:- ***శరీర, లోక, ఆత్మ, గురు ధర్మాలను నాల్గింటినీ గుర్తించి నడచిననేగాని, ఆత్మ దర్శనం జరుగదని ఒకరు చెప్పారు. గురు ధర్మ మంటే ఏది? భౌతికమైన గురువా లేక తనయందున్న ప్రజ్ఞానమా? భౌతికమైన గురువని చెబితే తొలిలో ఎవరికెవరు గురువు?***

**-ఎస్. ఎస్. కె. నందనవనం**

జ:- మీరడిగిన ప్రశ్నకు నిజమైన సమాధానం ఒక చిన్న జవాబులో వ్రాయ వీలయ్యేదిగాదు. ధర్మము, గురువు అన్న వాటితత్వం మనం మామూలుగా అనుకొన్నదానినుంచి ఎంతో భిన్నంగావుంటుంది. **ఉదా॥ ఒక నామమో, మంత్రమో చెవిలో చెప్పినావారినెల్లా గురువనడం యీగుడ్డి ప్రపంచంలో పరిపాటియైంది. తాను సంపూర్ణ జ్ఞానంపొంది యింకొకరికి తమ సన్నిధిచేతనే ధ్యానస్థితి నివ్వగలవారికే ఆ పేరు సార్థకం.** తాను త్రిమూర్త్యాత్మకుడనని, పరబ్రహ్మమని, తానే విశ్వమని నిరూపించగలవారికే గురువన్న పేరు చెల్లుతుంది. చివరకు కృష్ణుడు, శిరిడీ సాయివలె భక్తునిలోగూడ తననే చూచుకొనడం వలన ఎవర్నీ శిష్యులుగాను, తనకుతాను గురువుగాను తలచనివాడికే అది వర్తిస్తుంది. ఈ విషయం మీకు నిజంగా నిస్సంశయంగా, కూలంకషముగా అవగతమవ్వాలంటే **శ్రీ సాయిలీలామృతం, శ్రీ సాయి ప్రబోధామృతము 'శ్రీసాయినాథ పూజ'** జాగ్రత్తగా పరిశీలించాలి. ధర్మ మిన్నిగా వుండదు. సాత్వికుడైతే క్రమంగా అన్ని స్థాయిలలోనూ ధర్మం సహజ మవుతుంది. సాత్వికుడెలా అవ్వాలన్నదానిని-కృష్ణ జన్మాష్టమి సంచిక 'సాయిబాబా'లో చర్చించినట్లు - విశ్వరూపుడైన గురువును శరణు పొందాకనే సాధ్యమవుతుందని తెలియగలదు. గురువంటే సాయివంటి వారికి మాత్రమే



తెలిస్తే విశ్వమే తానైన గురువు విషయంలో 'తొలిలో ఎవరికెవరు గురువు'? అన్న మీ ప్రశ్నకు తావు లేదు. ఇందరు గురువులుంటేగదా? గురువంటే ఏమిటో, ధర్మమంటే ఏమిటన్న విషయాలను పైగ్రంథాలలోనూ, 'సాయిబాబా' పత్రికలోని వ్యాసాలను చూస్తేగాని తెలిసే అవకాశం లేదని మనవి. మీరు వాటిని చూచియుంటే యీ ప్రశ్నలు రావే! అవి బాగా తరచి అప్పటికీ మీకు సందేహముంటే మిగిలిన ప్రశ్నలను మరలా అడగండి.

తనయందున్న ప్రజ్ఞే గురువంటే అన్నదానికి అర్థాలు అసలు దాదాపు లక్షకొక్కరుండరన్నా ఆశ్చర్యంలేదు. నిజమైన గురువును బాహ్యంగా చిరకాలం సేవించి, వారి తత్వాన్ని గుర్తించి ధ్యానిస్తుంటే పరిపక్వదశలోగాని ప్రజ్ఞానమనే మాటకర్థమే అవగతం కాదు. ఉపనిషత్తులలోని యిలాటి పదాలన్నీ మొదట కర్మకాండను, ఉపాసనను అర్థం చేసుకొని ఆచరించి, చిత్తశుద్ధి గడించి గురుసేవలో గురువును మెప్పించినవారికి మాత్రమే ఉపదేశించబడినవి. అట్టి ఉత్తమాధికారులకు అనుభవరీత్యా 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్నమాటలు అర్థమవుతాయి. కనుక విశ్వమెల్లా తన రూపమేనని నిరూపించిన సద్గురువును బాహ్యాంతరాలలో నిరంతరం సేవించడమే గురు ధర్మం.

ప్ర:- ***ముందుగానే మరొకరినుండి ఉపదేశమును పొందిన సాధకులు శ్రీ శిరిడీ సాయిబాబావారియందు కలిగియుండవలసిన భావమేమి? శిరిడీ వెళ్ళినపుడు అచట సాధన చేసుకోవచ్చునా?***

**-ఒక జిజ్ఞాసువు**

జ:- విశ్వమంతా సకల సత్పురుషులు, దేవతలు జీవులు తామేనని అనుభవమిచ్చిన సాయిబాబా పరమ గురువు. ఇతర మహాత్ముల ప్రశంసలు గూడ దీనినే ఋజువు చేస్తాయి. అటువంటి గురువు ఏ యితర గురువుల నుండి భిన్నులుగారు. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లు "నేను వాటియందు లేను, అవి నాయందున్నవి" అన్నమాట సాయి యితర ఉపదేశ గురువులపట్ల వర్తిస్తుందని ఆ భక్తుల అనుభవాలు నిరూపిస్తాయి.



శ్రీ సాయివంటి సద్గురుని సన్నిధి చేరడానికి అంతకుముందు మనముపదేశం తీసుకున్న అనుష్టానమే చేర్చినదని మనం దానిని కృతజ్ఞతతో గుర్తించాలి. సాయి పరమ గురువని, ఉపదేశ గురువు బోధక గురువని తలచాలి. దీని వివరం స్కాంధ పురాణంలోని "శ్రీ గురుగీత"లో చూడవచ్చు.

శ్రీ సాయిని పరమ గురువుగా వారి చరిత్ర పారాయణచేస్తూ, వారి అనుజ్ఞగా మన పూర్వ గురువుపదేశించిన సాధన చేస్తూపోవాలి. అపుడు కర్తవ్యాన్ని సాయియే మనకు తెల్పుతారు. ఎవరినీ అడగనక్కరలేదు. అడిగినకొద్దీ తికమక ఎక్కువవుతుంది, పలుమందిని అడిగితే నాల్గు రకాలుగా చెబుతారు. చాలా Confusion కలిగి ఏది చేయలేని, విడువలేని దుస్థితి కల్గుతుంది. శ్రీ సాయి చరిత్ర పారాయణ, నామస్మరణవలన మన హృదయస్థుడైన ఆ విశ్వగురుడే మన పూర్వ జన్మ సంస్కారాన్ననుసరించి మనకు తగిన దానిని స్వప్నాదులలో తెలుపుతారు. అది నిస్సందేహమైన పద్ధతి.

శిరిడీ వెళ్ళినా పరమ గురువుగా సేవించి వారి సాన్నిధ్యంలో వారి చరిత్ర పారాయణ విరామ సమయంలో చేస్తూ ముఖ్య స్థలాలలో కూర్చుని మనకుపదేశించబడిన సాధన చేస్తుండాలి.

**ప్ర:- పురాణ పురుషులు, మన పూర్వీకులు, సాయివంటి మహనీయులూ *"ఆటోరైటింగ్"ద్వారా సమాధానాలిస్తారన్నది ఎంత వరకు నిజం?***

**-ఎ.ఎస్.ఎస్., సూళ్ళూరు పేట.**

జ:- మనిషి గుప్తమైన విషయాలను - భవిష్యత్తు, నిక్షేపాలు, శాంతులు, గతజన్మలు మొ॥నవి గురించి తెలుసుకొనే యత్నాలే యీ ఆటోరైటింగ్, శకునము, ప్రశ్న, జోతిష్యము మొ॥న ప్రక్రియలు. కానీ యివన్నీ భగవంతునికి మాత్రమే తెలుస్తాయని, ఏమీ జేసి మానవుడు వీటిని తెలుసుకోలేడని, **అలాగాక సర్వస్య భగవంతుని శరణు పొందినవారిని అవసరమైన విధంగా నడిపిస్తాడని భక్తునికి తెలియడమవసరమని, ఆయన తలచిన వాటిని ఆయనయే ఏదోఒకరీతిన తెల్పగలడని సర్వమత గ్రంథాలూ చెప్పాయి.** కనుక అలా శరణు

పొందక వక్రమార్గాలలో యిలా తెలుసుకోవచ్చని నమ్మడం ఒకవంక దైవం యొక్క ప్రేమతత్వాన్ని విశ్వసించలేకపోవడము, మరొకవంక అహంకారమునకు చిహ్నమున్నూ. సర్వానికీ అధిపతి మన మడుగకనే గాలి, వెలుతురూ, నీరు మొ॥వి ప్రసాదించిన పరమాత్మయొక్క యీ రహస్యాలు భక్తి కన్యమైనరీతుల తెలియజూడడం ఆయన జేబుకొట్టి చూడడమే అవుతుంది. మనను ప్రేమించిన వ్యక్తిని మనం ప్రేమించి విశ్వసించలేక, రహస్యంగా అతని డైరీలు తిరుగవేసి, గోడచాటున నక్కి అతని మాటలు విని, అతని రహస్యాలు కనుగొని లోకానికివెల్లడి చేయడమంతటి తుచ్ఛమైనపని. కనుక సర్వమత గ్రంథాలు వీటిని హీనంగా ప్రకటించాయి. అందుకనే ఇలా తెలుసుకొనే మానవుల ప్రయత్నాలను భగవంతుడు, ప్రకృతి వమ్ముచేసి చెలగాటమాడుతారు. ఇటువంటి రీతుల గుప్తమైన విషయాలను చెప్పేవారిని నిర్మొహమాటంగా పరిశీలిస్తే వారు చెప్పే భవిష్యత్తు మొ॥న విషయాలు కొన్నిరైటైనా కొన్ని తప్పుతాయి. వాటికేదో విధంగా సమాధానాలు చెప్పుకొని వారు తమను, సాటివారిని భ్రాంతిలో కొనసాగించుకుంటారు. కొన్ని వీరు చెప్పేవి వాస్తవాలైనా కొన్ని లౌకిక విషయాలలో తప్పిపోవడంవలన వారు చెప్పిన ప్రతి విషయమూ వాస్తవమనిబుజువయ్యే దాకా సందేహాస్పదంగా వుంటుంది. కనుక ఏమీ తెలియనట్లేగదా! కానీ మానవులకు ఆశ ఎక్కువ. అందుకే కొంచెమాలోచిస్తే యివి అవిశ్వాసనీయమని తెలిసినా - జూదరి తన వ్యసనాన్నిలాగా - విడువలేరు. ఈ ఆటోరైటింగ్, అంతర్వాణి మొ॥న విధానాలు పూర్వజన్మ మొ॥న విషయాలు వీరు చెప్పినపుడు మనకవి సరియైనవో కాదో తెలియదుగనుక మనకేమీ తెలియదన్న విశ్వాసంవలన, వారికేమో తెలిసే చెబుతున్నారని భ్రమిస్తాము. **అంటే ఇటువంటి వక్రమార్గాలక్కరలేకుండా కర్తవ్యాన్ని దైవము లేక సాయివంటి మహనీయులు స్వచ్ఛము, దివ్యము అయిన మార్గంలో భక్తులకు తగిన విషయాలను తెల్పుతున్నారని "ద్వారకామాయి అనుభవ మంటపము"లోని అనుభవాలు ఋజువు చేస్తున్నాయి. ఎన్నో కష్టాలనుభవించిన పాండవులు, రాముడు మొ॥న వారెవ్వరినీ యిటువంటి తుచ్ఛ మార్గాలవలంభించమని అటు శ్రీకృష్ణుడు, వేదవ్యాసుడు, వశిష్ఠ విశ్వామిత్రాదులు ఆదేశింపకపోవడమే గమన్హారం.** జూదంవలెనే యీరీతులు గూడ వ్యసనాలే.



ప్ర:- *గురువును సంపూర్ణంగా శరణుపొందితే చాలునంటారు. సాయి . అలా ఒకసారి ఒకర్ని గురువుగా నమ్మాక వారిపట్ల మన విశ్వాసం సడలితే ఏంచేయాలి*

**— దామోదర్, వరంగల్.**

జ:- నిజమైన విశ్వాసం రెండు రకాలు. శ్రీ సాయిలాగా మనకు అనుక్షణమూ తమ సర్వజ్ఞత, సర్వవ్యాపకత్వాలను నిరూపించే సద్గురువుపట్ల మన విశ్వాసం త్వరగా సడలదు. అందుకే రమణ మహర్షి అటువంటి గురువు నాశ్రయించిన భక్తుని పులినోట చిక్కిన వేటతో పోలుస్తారు. అంతటి గురువు ప్రత్యక్షంగా దొరకడం కష్టము. వారి నిర్దుష్టమైన జీవిత విధానం సంశయాలకు తావివ్వదు. అయినప్పటికీ అజ్ఞానంతో అడిగినదల్లా వారు నెరవేర్చలేదని భక్తులు వారికీ దూరమవడం చూస్తూ వుంటాము. అటువంటప్పుడు మనం వారిపట్ల విశ్వాసాన్ని వహించేబదులు ఆశను వహించామని అర్థము. మనపూర్వ జన్మలోని ధర్మాధర్మాలతో సంబంధంలేకుండా మనం కోరినదెల్లా ఆయన నెరవేర్చాలంటే ఆయన సర్వజీవులపట్ల సమభావంలేని పక్షపాతి, అధర్మాత్ముడు గావాలి! సర్వజీవులపట్ల సమమైన ప్రేమ కలిగి యుండటమే ధర్మానికి జీవకళ్ళు. ధర్మమే వారి జ్ఞానానికి నిదర్శనం. ధర్మనిర్ణేత కొన్ని హద్దులకు కట్టుబడే జీవులపట్ల దయ జూపడం న్యాయం.

నిజమైన భక్తి లేకవిశ్వాసము సరైన అవగాహనమీద ఆధార పడుతుంది. పసిపిల్లలు తల్లిదండ్రులు తాము కోరినవిస్తారని మాత్రమే ప్రేమిస్తారు. ఇది స్వార్థమేగాని ప్రేమగాదు. ఆలోచన పెరిగినకొద్దీ తల్లిదండ్రులు తమ శ్రేయస్సుకోసం శ్రమపడటాన్ని అర్థం చేసుకొని వారిచ్చే క్రమశిక్షణ తాత్కాలికంగా బాధగావున్నా సంతోషంగా స్వీకరిస్తారు. ఇది ఓరిమి, విశ్వాసాలతో కూడిన ప్రేమ. అలాటి అవగాహన ఓరిమితో కూడిన ప్రేమనే విశ్వాసము లేక భక్తి అంటారు. అదే వైద్యుడిచ్చే చేదుమందుయొక్క గుణం. పామరులమైన మనకు తెలియదు కనుక వైద్యుడు మన శ్రేయస్సుకొరకే మందిస్తాడని మనం విశ్వసించాలి. ఆయనిచ్చే మందు చేదుగావున్న, తీయగావున్నా మనకదిమేలు చేస్తుందని గుర్తుంచుకొని కృతజ్ఞతతో తీసుకోవాలి.

అలానే మనగత జన్మల కర్మలగూర్చి, మన ఆధ్యాత్మిక శ్రేయస్సు గురించీ మనకు తెలియదు గనుక అది తెలిసిన సాయి మనకు శ్రేయస్కరమైనదే చేస్తారని విశ్వసించాలి గానీ ప్రియమైనది మాత్రమే చేయాలని తలచకూడదు. **సాయివంటి పరిపూర్ణుల విషయంలో మనవిశ్వాసము ఎప్పుడు సడలినా పొరపాటు మన అవగాహనలోనే, మన ప్రార్థనా విధానంలోనే వుంటుంది. ఇది తెలగాలంటే "సాయి ప్రబోధామృతము" జాగ్రత్తగ చదివి మననము చేసుకుంటుండాలి.** నిత్యమూ స్నానం చేసి దేహమాలిన్యాన్ని పోగొట్టుకున్నట్లు, నిత్య మననం ద్వారా అవివేక మనే హృదయ మాలిన్యాన్ని పోగొట్టు కుంటుండాలి. ఈ ప్రధాన సూత్రాన్ని మరచి ఎందరో తమ భక్తి పటిష్టం కావడంలేదని వాపోతారు.

ప్ర:- ***స్త్రీలు ఓంకార ముచ్ఛరించరాదని కొందరంటున్నారు ఇది ఎంత వాస్తవము? అది నిజమే అయితే ఎందువలన ఉచ్ఛరించకూడదో తెలుపవలసినది.***

***- టి.వి. శాస్త్రి, అట్లూరు.***

**జ:-** ఈ నియమం అర్షమని చెప్పడానికి ఆధారాలు చాలవు. పురుషులకువలెనే వేదకాలంలో స్త్రీలకుకూడా ఉపనయనము, వేదాధ్యయనము. మొదలైన అర్హతలుండేవని తర్వాత కాలంలో వారికైవారే ఒకవంక గృహకృత్యము, భర్త, బిడ్డలసేవ, అతిథిసేవ మొదలైనవి నిర్వర్తించడంలో ఈ వైదిక ధర్మాన్ని తగినంత దీక్షతో ఆచరించలేక వాటిని నిష్టతో ఆచరించుకొనే భర్తయొక్క సేవనుమాత్రము తమ ధర్మంగా గ్రహించినట్లు మనుధర్మ శాస్త్రంలోనూ దానిపై వ్యాఖ్యలలోనూ ఆధారమున్నది. పురుషుడికి గురుసేవ ఒక్కటిమాత్రమే స్వయం సంపూర్ణమైన సాధన ఎలాకాగలదో అలానే **గృహిణికి సద్ధర్మ పరాయణుడైన భర్త సేవయే స్వయం సంపూర్ణమైన ధర్మంగా వెలసింది.** వేదాధ్యయనము మొదలైన ఇతర సత్కర్మలన్నింటియొక్క సార్థక్యత గురుసేవ పైననే ఎలా ఆధారపడి యున్నాయో, అలానే స్త్రీకి గృహిణిధర్మం ప్రధానమని భర్తయొక్క ఆజ్ఞవల్లనే ఏధర్మమైనా, సాధనైనా సార్థకమని నిర్ణయించబడింది. అలానే స్త్రీలకు మాత్రమేగాక సామాన్య గృహస్థులకు గూడ కేవల ప్రణవజపము, ధ్యానము, తగదని నిషేధమున్నది. కేవల ప్రణవ ధ్యానము,

జపము ఒక అధికారియైన యతికి మాత్రమే తగియున్నది. అయితే ప్రణవధ్యానమన్నా, జపమన్నా శబ్ధోచ్ఛారణ మాత్రమే కాదని గుర్తించాలి, అర్థచింతనం కూడా ఎంతో అవశ్యకం. ప్రణవార్థాన్ని తెలిసి ధ్యానించడంవలన స్త్రీలకేగాక పురుషులకుగూడ క్రమంగా లౌకికమైన ధర్మాలను నిర్వర్తించడం సాధ్యం కాకుండా పోతుంది. కనుక యతులకు, సన్యాసినులకు. బ్రహ్మవాదినులకు మాత్రమే కేవల ప్రణవధ్యానము. **ఒక్కమాటలో చెప్పాలంటే జీవితంలో ప్రతిక్షణము పరమాత్మపై దృష్టినిలిపి ఒక్క లౌకిక తలంపైనా లేకుండా జీవించడమే ప్రణవోపాసనయొక్క పరాకాష్ఠ.** ఇందుకు అర్హత మానవుడు, పితృదేవతలకు, మానవులకు, దేవతలకు, ఋషులకూ వున్న ఋణాలను సంపూర్ణంగా నిర్వర్తించుకున్నాక మాత్రమే తగియున్నది. కేవలం యాంత్రికంగా నోట ఓంకారం ఉచ్ఛరించడం గురించి ఏనియమమూ ఉండజాలదు. అర్థ చింతనము,ధ్యానము కలిసినప్పుడే అది మంత్రమవుతుంది. అక్కడనుండి విధినిషేధములుంటాయి. ఆత్మ స్త్రీ పురుషుల కొక్కటేనన్నమాట నిజమే. దానికి నామరూప లింగభేదములేదు. అదే ప్రణవ స్వరూపం. కనుక తత్వత: దీని ప్రతీకమైన ప్రణవాక్షరం ఏ ప్రాణికి నిషిద్ధము కాజాలదు. అయితే ఎంతమేరకు తను ఆత్మనని గుర్తుండక తాను స్త్రీనని లేక పురుషుడనని భావముంటుందో అంతమేరకు మాత్రం పెద్దలు నిర్ణయించిన ఈ విధి నిషేధాలను పాటించడం ఎంతో ఉపయోగం. లేకుంటే వారి లౌకిక జీవితాలు, సహజమైన శారీరక క్రియలు తారుమారయ్యే అవకాశాలున్నవి. ఇంతకుమించి కేవలం శబ్ధోచ్చారణకు వెరవలసిన పనేలేదు. దాని వలన ప్రయోజనం లేదు.

ప్ర:- ***శ్రీ సాయిబాబా తామే సకలసాధు దేవతా స్వరూపులు, సకలజీవ స్వరూపులని నిరూపణ చేసియున్నారు కదా? అందులో నేను కూడ ఒక భాగమే కదా? ఆయన నిత్యతృప్తులు కదా? అటువంటప్పుడు మిగతా జీవులు బాధలతో వుంటున్నారెందువలన? దైవాన్ని ఏమికోరితే ఇంక కోరవలసినది లేకుండా వుంటుందో పత్రికద్వారా తెల్పండి?***

-బి. వి. ఎన్. రావు.

జ:- ఆయన సమిష్టి, మనం వ్యష్టి, అంటే ఆయన మొత్తం (whole) మనం Part అందుకే ఆయన తృప్తుడు. మనం దు:ఖ భాగులం.



దేవుని ముక్తి లేక జ్ఞానాన్ని కోరితే యిక కోరవలసినది ఏదీ వుండదని మామూలుగా లోకంలో పెద్దలనబడేవారు చెప్పేమాట. కాని అలాటి దొకటి వున్నదని అనుభవపూర్వకంగా తెలిసేదాకా ఎవ్వడూ హృదయపూర్వకంగా కోరలేడు. వాచా కోరినా మనస్సు, తదన్యములు ప్రత్యక్షానుభవాలు అయిన సుఖాలను, దుఃఖ నివృత్తినే కాంక్షిస్తుంది. మనమెప్పుడూ చూడని వ్యక్తిని మనమెలా విశ్వసించడం, ప్రేమించడం సాధ్యం కాదో అలానే ముక్తి దైవాల విషయంగూడ. కాని సాయివంటి సద్గురువులో ఈ లోపం ఉండదు. కనుక భగవద్గీత (అధ్యాయం 4. శ్లోకం 34) లో గూడ సద్గురువును శరణు పొందడమే పరమ కర్తవ్యంగా చెప్పబడింది. అర్జునుడు అలా కృష్ణుణ్ణీ ఆశ్రయించి గీతాబోధనేగాక విశ్వరూప సాక్షాత్కారంగూడ పొందాడు. కనుక దైవాన్ని దీనిని కోరితే యింకేమీ కోరనవసరంలేదో, అంటే సద్గురువుయొక్క సేవను కోరితే యింకేమి కోరనక్కరలేదని చెప్పక తప్పదు. "శ్రీసంహితాయన గురు ద్విసాహస్రి" లో ఉపోద్ఘాతము చదవండి. మీకే తృప్తికరమైన సమాధానం లభిస్తుంది.

*ప్ర :- శ్రీ గురుచరిత్రలోని 'అష్టోత్తరం' చదివేటప్పుడు ప్రతినామముముందూ 'ఓం, శ్రీం అని చదవాలా? లేక 'ఓం' అని చదవాలా?*

**— సూకరాజు**

జ:- ఓం అని చదివితే చాలు. నిజానికి మరే బీజాక్షరమైనా "తగినవారు" , "తెలిసినవారు" తగినవారికే ఉపదేశిస్తేగాని, ప్రయోజన ముండదని శాస్త్రం. అలా తెలిసి ఉపదేశించేవారు లేరు. 'ఓం' ఒక్కటి దేనితోనైనా కలిపి అనవచ్చు. నిజానికి అది అలవాటై అంటాము గానీ అదికూడ ఆవశ్యకముగా ను. గురువుయొక్క నామం ప్రణవమేనని గురువే ప్రణవ స్వరూపియనీ సాంప్రదాయం. నామావళిలో కొరవడిననామం 'పద్మినే నమః-- 'పద్మి'-- అని ఆరంభించే నామాలలో యిది మొదటిది.

*ప్ర:- శ్రీ సాయిబాబా చరిత్రగాని, శ్రీ గురుచరిత్రగాని పారాయణ ఎలా వేసుకోవాలి?*

ఒక భక్తుడు-ఖమ్మం.

జ:- పూజలోగాని, పారాయణలోగాని ప్రధానమైన సూత్రం శ్రద్ధ. ఏ సాధన గురించైనా విశ్వాసాన్ని బట్టి శ్రద్ధ కలుగుతుంది. మొదట యిలాంటి శ్రద్ధగానీ, విశ్వాసంగాని ఎలా కల్గుతుంది. రెండువిధాలుగా కలుగవచ్చు. ఎందరికో అట్టి సాధనద్వారా ఎంతో శ్రేయస్సు కలిగినట్లు తెలియడం వలన కలుగవచ్చు. ఇదే లోక సామాన్యంగా జరిగేది. అంతకంటేకూడ ఎందరో మహాత్ములు చెప్పిన ఈ అంశాలను జాగ్రత్తగా మననంచేసి మొదట మన శ్రద్ధను పటిష్టం చేసుకొని పారాయణకుపక్రమించాలి. ఇది **మొదటి నియమం.**

మనం చదివేది జనన మరణ రహితులు, త్రిమూర్త్యాత్మకులు, పరబ్రహ్మ స్వరూపియైన సద్గురువుల చరిత్ర, అంటే అది వారి శాశ్వతమైన అక్షరస్వరూపం. అది చదివినంతసేపూ మనం ఆంతరంగికంగా వారిసాన్నిధ్యంలో వుంటాము. వారు మనతోనే వుంటారు. అది గుర్తుంచుకోవడం ఈ శ్రద్ధలో **రెండవ అంశం.**

జపపూజాదులేమి చేసినా యింటివద్దకంటే నదీతీరంలోనూ, అంతకంటే పుణ్యక్షేత్రాలలోనూ, అన్నింటికంటే మహాత్ముని సన్నిధియందూ ఎన్నో రెట్లు అధిక ఫలితం కలిగియుంటాయని మన ఋషులందరూ చెప్పారు. మనం పారాయణ చేస్తున్నది సాయినాధుని సన్నిధిలో. ఆయనకు, ఆయన చిత్రపటానికి భేదంలేదని ఎందరికో ఎన్నిరీతుల ఆయన నిదర్శనమివ్వలేదు? ఇది గుర్తుంచుకొనడం పారాయణలోని **మూడవ అంశం.**

**వీటికి తోడు** మనం **పారాయణ** చేసే గ్రంథం **కూడ ఆ** సద్గురు మూర్తుల **భౌతికమైన అర్చనా** రూపం. **అందువలన పారాయణ ఆరంభంలోనూ, అంత్యంలోనూ** గ్రంథాన్ని యథాశక్తి **పూజించుకొనడం** శ్రేయస్కరం. **పటానికి,** విగ్రహానికి నివేదన, **ఆరతి యిచ్చినట్లే** గ్రంథానికీ **యిచ్చి తిరిగి** దానిని **భద్రపరచుకొనే అలవాటు** మంచిది.

ఈ ముఖ్య సూత్రాలు అర్థం చేసుకొని మిగిలిన పారాయణ విధానంలో చెప్పే నియమాలన్నీ ఈ శ్రద్ధయొక్క బాహ్య రూపాలని అర్థమవుతాయి. ఉదాహరణకు ఈ శ్రద్ధతో మనస్సు పారాయణలో పరాయణత చెందడమే - ఉపవసించడమంటే! ఈ ఆంతరంగిక సూత్రాన్ని పాటిస్తూ బాహ్యాచారాన్ని



యధాశక్తి అనుసరించవచ్చు. కేవలం బాహ్యంగా చెప్పినవన్నీ చేస్తూ అంతరంగికమైన పరాయణత చెందకుంటే గూడ ప్రయోజనం అత్యల్పమే అవుతుంది.

*ప్ర:- సాయిని పూజించినంతనే మోక్షప్రాప్తి కల్గుతుందా? వారి సూక్తులను నిత్య జీవితంలో ఆచరణ చేస్తేనేనా?*

*- బి. వెంకట్రాజు, ఉదయగిరి.*

జ:- పూజకు అర్థం తెలియకుండా చేస్తూ, ఆయన ఏమిటో తెలియకుండా పోలేరమ్మను పూజించినట్లు పూజిస్తేనే యీ ప్రశ్న ఉద్భవిస్తుంది. శ్రీ సాయీశుని చరిత్ర పారాయణవలన ఆయనపై ఎలాంటి వారికైనా ప్రేమ కల్గుతుంది. ఆ ప్రేమను వ్యక్తం చేసుకొనే పద్ధతులలో ఒకటి పూజ. రెండవది వారి సూక్తుల ఆచరణ. ప్రేయసికి ప్రియునిమాటలే ధృవతారలైనట్లు.

అయితే యిది చరిత్ర పారాయణ ద్వారా ఎవరికి వారికే కల్గాలిగాని మరొకరు చెప్పేది, చర్చించేదిగాదు. వారిపట్ల ప్రేమ మనకెంతగల్గిందో, విశ్వాసమెంత వున్నదో, సూక్తులు ఎంతవరకు ఆచరిస్తున్నామో ఎవరి అంతరాత్మసాక్షి వారిది. ఎవరి బాహ్యాంతర పరిస్థితులను, పరిపాకాన్ని యింకొకరెవరో అర్థం చేసుకోజాలరు. సాయివంటి సకలభూత హృదయస్థులు తప్ప. అందుకే బైబిలులో క్రీస్తు ఒక వ్యభిచారిణిని ఆదుకొన్నారు. నిష్కామంగా మాత్రమే సాయిని దర్శించాలని సాటివారికి చెపుతున్న భక్తుని నిగ్రహించారు.

ఇది మరచే ఒకరు మరొకర్ని ఎంచడం మొదలు పెట్టడం కూడ సాయి, క్రీస్తూ అంగీకరించలేదు. కారణం పరిపాకాలలో తారతమ్యాలుంటాయి. ఎవరినీ వారి పరిపాకాన్ని మించి నడవమనకూడదు. అది పక్వానికిరాని కాయ కోసినట్లు. దానికితోడు ఎక్కువమంది అటు తమ పరిపాకానికి మించి ఆవేశంతో నడచుకోవాలని ఒకనాటికి అహంకరించి ఒక్కొక్కరొక్కొక్క గురువుగా వెలసి లోకానికి అహితం చేయడమో లేక సాయిపథంనుండి ప్రక్కదారి పట్టడమో జరుగుచున్నది. సాయియందు ఎంత ప్రేమ కల్గితే అంతగా ఆయన



చరిత్ర, బోధలు నిత్యనూత్నమై పారాయణయందు రుచి పెరుగుతుంది లేకుంటే అవి యాంత్రికమై "ఊరికే పారాయణవల్ల లాభమేమిటి?" అన్పిస్తుంది. ప్రియురాలిపట్లరాని "పాతరోత" అన్న భావం ఆయనపట్ల ఎలా వస్తుంది? ఒకరికొకరం విషయం వివరించుకోవచ్చు, ప్రోత్సహించుకోవచ్చు, ప్రేమతో సూచనలు చేసుకోవచ్చు. ఆపైన ఎవరి యత్నానికి వారినివిడవాలి. వారికై మనం సాయిని ప్రార్థించడం తప్పులేదు. ఆయనున్నాడు వారిని సరిగ్గా మలచుకోడానికి. అదే ఆయనిచ్చిన హామీ.

ప్ర:- ***మానవజన్మ శ్రేష్ఠమన్నారు కదా, పాపాలుండగా మానవ జన్మవచ్చి కష్టపడడమెలా సంభవం?***

***- ఆర్. భారతీదేవి - ఐరల.***

జ:- **తన కితరులేమి చేయాలనుకుంటాడో తనితరులకది చేయటం, తనకితరులేమి చేయకూడదనుకుంటాడో అది యితరులకు చేయకుండడం ధర్మ రహస్యం. త్రికరణాలు ఈరీతిలో పనిచేయాలి అదే ధర్మాచరణ.** అపుడు ఫలితాన్ని ఆశించకనేమానవుడు తన ధర్మాన్నినిర్వర్తిస్తాడు. పుణ్యఫలం వలన అతడికి మంచి జన్మలే కలుగుతుంటాయి. అతనికెపుడు వివేకముదయించి జన్మరాహిత్యం కోరతాడోఅపుడు ఒక సద్గురువును ఆశ్రయించి ఆయన బోధ, అనుగ్రహంవలన ముక్తిపొందుతాడు.

పై సూత్రాన్ని ప్రతి ఒక్కరం స్వార్థ మమకారాది వికారాలప్రభావంవలన ఉల్లంఘిస్తాము. వ్యక్తులపట్ల రాగద్వేషాదులతో ఆచరించు పాపాలకు వారినుండి తిరిగి బాధ ననుభవించడానికి మానవ జన్మయే ఎత్తవలసి వుంటుంది. మనిషిలో అన్ని కారణాలలోనూ పశుత్వం ప్రబలి ఏ వ్యక్తులపట్లాగాక వీరు-వారనే భేదంలేక అధర్మమాచరిస్తాడో అపుడు జంతు జన్మలొస్తాయి.కారణం జంతువులలానే చేస్తాయి. అది మరీ విపరీతమైనపుడు నరకాది బాధలనుభవిస్తాడు. సామాన్యంగా జీవులు ఈ మూడురకాల పాపాలు ఏదో ఒక జన్మలో చేస్తుంటారు. కనుక ఇన్ని కర్మఫలాలూ అనుభవించాలి.

అయినా ఏదో ఒక దశలో యీసూత్రమర్ధంచేసికొని ఆచరించుకోగల యోచనాశక్తి జీవులన్నింటిలో మానవులకే వుంది కనుక, అది శ్రేష్టమన్నారు- చెట్టంతటిలోనూ దాని ఫలమే శ్రేష్టమన్నట్లు. అట్టి యోచనాశక్తిని సత్సాంగత్యంలో వృద్ధిచేసుకొనక రాగద్వేషాలమాటున పాతిపెట్టినందుకు శిక్ష జన్మ పరంపరలు. అలా వ్యర్థంచేసుకొనే అవివేకం మనిషికి వున్నందువల్లే మరొకవంక మత గ్రంధాలన్నీ దేహము, మమకారాదులూ తుచ్ఛమని ప్రబోధిస్తాయి. ఆ సత్యం గ్రహిస్తే మానవ జన్మ శ్రేష్టమే.

ఏపుణ్యం చేసినా జన్మరాహిత్యం రాదు. పుణ్యఫలం సిరిసంపదల రూపంలో వస్తుంది. అపుడు మరలా అహంకారాదులకు బానిసయై పాపాలుచేసి కష్టాలపాలవుతారెక్కువమంది. పూర్ణులయిన మహనీయుల నాశ్రయిస్తేతప్ప పుణ్యఫలంమీద ఆపేక్ష నశించి జన్మ రాహిత్యం కలుగదు- అయితే పూర్ణుల సాంగత్యము, అనుగ్రహము కలగాలంటే 'శ్రీగురుచరిత్ర' **పారాయణ, 'శ్రీగురుగీత' పారాయణ చేయాలి. అందుకే కృష్ణుడు భగవద్గీత అధ్యాయం 4, శ్లోకం 34లో తత్వదర్శి (అంటే బ్రహ్మజ్ఞాని)ని ఆశ్రయించ మన్నారు. కలి ప్రభావంవలన బ్రహ్మజ్ఞానంలేకనే వున్నట్లుభ్రమపెట్టేవారే వుంటారు. అసలైన తత్వదర్శి ఎలా వుంటాడో తెలియాలంటే పై గ్రంథాలు, 'అక్కల్‌కోటస్వామి చరిత్ర' అవధూత "వెంకయ్యస్వామిచరిత్ర",** చదవాలి. మిగిలిన వివరం ఆయా గ్రంధాలలో దొరుకుతుంది.

ప్ర:- **మానవుడికి దెయ్యమంటే భయమెందుకు వేస్తుంది?**

**- ఎన్. వి. కృష్ణయ, అంబలపూడి.**

జ:- న్యాయంగా అలాంటి భయముండకూడదు. కారణం దయ్యమంటే ఒకప్పుడు మనలా జీవించిన మానవుడే మరణం తర్వాత శరీరం లేకుండానే తిరుగుతుంటాడని అందరికీ తెలును, ఇంతమంది మానవులు మనచుట్టూవున్నాలేని భయం ఒక దయ్యంపట్ల ఎందుకు వుండాలి?

సామాన్యంగా మరణించాక కొద్దికాలం యితర లోకాలలో వారి కర్మలననుసరించివుండి అవి అక్కడ అనుభవాల ద్వారా తీరాక, భూమి



మీద అనుభవించి తీరవలసిన కర్మఫలాలకోసం మరలా జన్మిస్తాడు. అలాగాక తీవ్రమైన అన్యాయానికిగురియై ఆ ప్రతీకారవాంఛవలన మరలా జన్మకు రాకుండా దయ్యమై తిరుగుతాడని, తనకు అన్యాయం చేసిన వాడిని శిక్షిస్తాడని అంటారు. ఈఅన్యాయం ఎన్నోజన్మల క్రిందటిదై యుండవచ్చు గూడానట. కనుక దయ్యం కనబడితే తన కట్లాంటి శిక్ష పడుతుందన్న భయమే, అది మనమీద ప్రతీకారం తీర్చుకుంటుందన్నదే భయనికి కారణం. కాని అలాంటి కర్మబంధంవున్న వారినే అదేమైనా చేస్తుంది గాని యింకెవరినీ గాదని పెద్దలంటారు. మిగిలిన మనకు భయమెందుకు? అయినా భయపడటానికి కారణం — శవాన్ని చూచి కొందరు భయపడ్డట్లు—మనకూ అదేగతి పడుతుందేమో అన్నదే భయానికి కారణం. అంటే మనం చేసే తప్పులకు కల్గే శిక్షగూర్చిన భయమే దయ్యమంటే భయంగా ప్రకటమవుతున్నది.

అంతేగాదు. మనమందరమూ జన్మలు, లోకాలూ వున్నాయని నమ్ముతున్నామని భ్రమించినా నిజానికి ఎక్కువమందికి అదొక ఆలోచన లేక భావమేగాని, ధృడమైన విశ్వాసంగా వుండదు. కారణం మన మది ఎన్నడూ చూడలేదు. అందువల్లనే పుణ్య పాపకర్మ ఫలాలున్నాయని నమ్ముతున్నా మనుకునేవారు కూడా అలాంటి నమ్మకం లేనివారిలాగనే పాపాలు చేస్తూవుంటారు. నిజంగా నమ్మేవాడు అలా చేయనేలేడు, కనుక దయ్యం తారసిల్లినపుడు మరణం తర్వాత ఆత్మజీవించియే వుంటుందన్న ధృఢభావం కల్గి ఆ స్థితిలో మన అనుభవమెంత భయంకరంగా వుంటుందోనన్నది గూడా దయ్యాలంటే భయానికి కారణం.

**ప్ర:- సాయి పూనకాలద్వారా ఏమీ చెప్పడంటారేమి?**

**- ఎమ్. ఎస్. సి. సాయికుమార్, తాడేపల్లిగూడెం.**

జ:- సాయియేగాదు. నిజానికి ఏ దేవతలూ పూనరు. అందుకే నాకు గుర్తున్నంతలో మన అష్టాదశ పురాణాలలోనూ, యితిహాసాలలోను దేవతలు పూనిన సన్నివేశమొకటిగూడలేదు. కారణం విశ్వంసృష్టించబడినపుడు సగుణ బ్రహ్మముయొక్క దేహమనే ఈవిశ్వంలోని జీవశక్తులులాగ దేవతలుంటారు-



నీరు, నిప్పు, గాలిలాగ; మనదేహంలో చూచేశక్తి, వినేశక్తి, పనిచేసేశక్తి, రక్తప్రసరణశక్తిలాగ, ఇవి అంతటా నిండివుంటాయి—గంగాళంలోని సాంబారులో కలిపిన ఉప్పు, పులుపువగైరాలులాగ అంతటావున్నవి ఏ ఒక్కచోట ఒక్కదేహంలోకి ఎలా వస్తాయి? చచ్చినవారుమాత్రమే, అంతటిరాగద్వేషాలు, పాపాలువుంటే దయ్యాలై మరోవ్యక్తిని— అదిగూడ వారికి అలాటి ఋణానుబంధముంటేనే—ఆవేశిస్తారని మనప్రాచీనగ్రంథాలుచెప్పేవి. ఒక సకలదేవతాస్వరూపము, విశ్వవ్యాపియైన సాయి ఎలా పూనుతారు? ఇది తెలియని ఒకరు తనను సాయి పూనారని చెబుతూ, సాయి చెబుతున్నట్లు మాట్లాడుతూ "ఇప్పుడు నేనిక్కడున్నాను. శిరిడీలో లేను" అన్నారు! నేనెప్పుడూ నాభక్తులవెంటనుండి కాపాడుతుంటాను" అన్న సాయిసూక్తి ఏమిగావాలో? "మశీదులో కూర్చొని ఎప్పుడూ అబద్ధం చెప్పను" అన్నారుగదా సాయి! కనుక వీళ్లకు ఆయన పూనడం భ్రమేగాని ఎటుచూచినా నిజం కాజాలదు.

కాకుంటే ఒక్కొక్కవ్యక్తి సాధనబలంవలన ఈజన్మలో అప్పుడప్పుడూ మంచి రేడియో రిసీవింగ్ సెట్టులా తయారై, సర్వగతుడై తమ హృదయంలోవున్న దైవశక్తిని రవ్వంత అందుకొని కొన్ని సమయాలలో మనకు తెలియని నిజాలు చెప్పవచ్చు. కాని యీ సామర్థ్యం వారి ఆధీనంలో వుండదు. నిర్మొహ మాటంగాచూస్తే వారు చెప్పేది ఒకసారి రైటైతే ఒకసారి తప్పుతాయి. అటువంటప్పుడు వారు మనకేమైనా చెప్పినా అది కాలగతిలో నిజమో అబద్ధమో తేలినదాకా మనకు సత్యం తెలియనివారమే. అందుకే అట్టి అనుభవాలు వారు లోకానికి చాటడంవలన తమకు భ్రమతో తమ నాశ్రయించినవారిని అన్ని విధాల ప్రక్కదారి పట్టించిన పాపానికొడిగడతారు. **ఎప్పుడూ సర్వాత్మస్థితిలో వున్న సద్గురువునే ఆశ్రయించమని కృష్ణుడు, ఋషులూ చెప్పారుగాని పూనకాలవాళ్ళ గురించి చెప్పకుండటము లోకహితంగా ఋషులు, సాయివంటి మహనీయులుగూడ తలచారు.** జిల్లెళ్ళమూడి అమ్మ తమపై పూనుతున్నారని కొందరు, సత్యసాయి పూనుతున్నారని కొందరు గోలపెట్టారు. ఎందరో అమాయకులు వారిచుట్టూ చేరారు. కానీ తీరాప్రశ్నిస్తే అటు అమ్మ,



ఇటు సత్యసాయి కూడ అలాంటివి నమ్మవద్దని, తమ కెవ్వరినీ పూనన వసరంలేదని నిర్మొహమాటంగా చెప్పారు. అయినా ఈ పూనకాలవారు ఇదొక మాయ అని, పరీక్ష అని భక్తులనుయింకా వంచింప జూస్తున్నారు.

**ప్ర:- కొద్దిసార్లు సాయి చరిత్ర పారాయణ చేసాను. అయినా సమస్యలెదురవుతుంటే ఒక్కొక్కప్పుడు అపనమ్మకం తలెత్తుతోంది.**

**- వి. వెంకటేశ్వరరావు, పోలేపల్లి.**

జ:- ఒక్కటాలోచించండి. అపనమ్మకానికి అర్థంలేదు— జబ్బు తగ్గని వారివలన వైద్య విధానాన్ని రద్దు చేయగలమా? ఒకసంవత్సరము పంటరాకపోతే వ్యవసాయమే మానగలమా? పోనీ అపనమ్మకంవలన కార్యాలు నెరవేరితే అదే సాధనయ్యేదిగదా? ఇంతాచేసి పారాయణ విశ్వాసాలలో పెట్టుబడి ఎంత? నష్టమేమొచ్చింది. మానవులం గనుక గతంలోనో వర్తమానంలోనో చేసిన తప్పులకు ఫలితమనుభవించరాదనడం మనకోసం సృష్టిధర్మాన్ని మార్చమని కోరడమా? ఇది అవినీతి కాదా? తప్పుకు ప్రాయశ్చిత్తము, పరిహారమూ వుండాలి. కాని చేసిన తప్పుకు క్షమ ఎప్పుడెంత చూపించాలన్నది అవతలవారిదిగాని అదిపుడెంత వుండాలని నిర్ణయించే హక్కు మనకేమున్నది? మన వలన తప్పు జరిగినందువలన బాధపడిన వారి దృష్టిలో చూస్తే సాయి మనను రక్షించడం న్యాయమా? కనుక అపనమ్మకానికి తావేది? ఈ మహనీయులు ఒకవేళ ప్రస్తుత సమస్యలు తీర్చలేదనుకుందాము, అప్పుడైనా మనవలన యికముందెన్నడూ యిలా తప్పులు జరిగి బాధపడవలసిన అవసరంలేని స్థితి ఏనాటికైనా కల్గాలికదా? అందుకు వారినాశ్రయించడము తప్ప మార్గమున్నదా? అపనమ్మకానికి ఆధారమే లేదని గమనించాలి. మనలోని అధర్మప్రవృత్తి, స్వార్థాలే అపనమ్మకానికి కారణం. మనవలన జరిగిన తప్పులకు పశ్చాత్తాపం. సరిగాకల్గలేదనడానికి గుర్తు. అదిబాగా కల్గితే అసలు మనిషి ఉపశాంతి కోరలేడు! కోరితే అపకున్నా కినుక వహించలేడు. ఇక మరలా తప్పు మాత్రం చేయలేడు.



ప్ర:- శ్రీ సాయిని సేవించడానికి అభిషేకమే ముఖ్యమని ఒకడు , నామజపమే ముఖ్యమని మరొకరు, చరిత్ర పారాయణమే ముఖ్యమని యింకొకరు చెబుతున్నారు. సదా ఆయన నామం జపించడాని మూలమన్త్రమేమైనా వున్నదా?

- శ్రీ అలూరు గోపాలరావు, పొన్నూరు.

జ:- సాయిని స్మరించడానికి ఒక్కమూలమన్త్రమంటూ ఏమీలేదు. అట్టిదేమీ సాయి చెప్పలేదు. కొందరు భక్తులు తమ తమ అభిప్రాయా న్ననుసరించి వివిధ బీజాక్షరాలతో కలిపిన నామం మన్త్రంగా ఉపదేశించడము జరుగుతోంది. వారుగూడా ఒక్కొక్కరూ ఒక్కొక్కటి మూలమన్త్రమని చెబుతారు. మంత్రానికి ఉపదేశము, అంగన్యాస, కరన్యాసాలు, ముద్ర, శక్తి, కీలకము ఋషి—యివన్నీ అత్యవసరం—కాని **సాయియే స్వయంగా "చెవిలో ఉపదేశించడము మా సాంప్రదాయము కాదు" అని స్పష్టంగా చెప్పేవారు. అంతేగాదు తమ భక్తుల నెవరివద్దకు ఉపదేశంకోసం ఎవరినీ ఆశ్రయించవద్దని వారించారు.**

ఇక సాయిని స్మరించడానికి తగిన నామం గురించి ఆలోచిద్దాము. ఈవిషయంలో ఆయనేమి చెప్పారో అదే సాయి భక్తులకు పరమప్రమాణము. సాయి భక్తులుగాక, సాయి భక్త భక్తులకుమాత్రమే ఇతరులు చెప్పేది ప్రమాణం. **సాయి తమ నోటిమీదుగా "నీవెప్పుడూ పొంగిపొరలే భక్తితో 'సాయి-సాయి' అని నన్ను స్మరిస్తుండు, చాలు" అని చెప్పిన వివరం హేమాద్పంతు వ్రాసిన "శ్రీసాయి సచ్చరిత్రలోనే వున్నది.** సాయి ఉపదేశము, మంత్రమూ ఎందుకు వద్దన్నారోనన్నది శిరిడీవెళ్ళ నారంభించిన 7సం॥లకు ఒక సిద్ధ పురుషుని ద్వారా స్పష్టమైంది. ఆ వివరం" నేను దర్శించిన మహాత్ములు-1 పాకలపాటి గురువుగారు" అన్న గ్రంథంలో చాలా విపులంగా వ్రాశాను. అది చూస్తే యిక సందేహాలకు తావుండదు.

ఏనామ స్మరణైనా భక్తి కల్గాకనే సార్థకమయ్యేది. "భక్తిలేని పూజ పూలచేటు". 'భక్తిలేని నామ సంకీర్తన గొంతునొప్పి' అన్న నానుడి వున్నాయి.



భక్తికల్గాకనే పూజ మొదలుకొని చేసినసాధనలన్నీ సార్థకమవుతాయి. లేకుంటే అంతా బాహ్యాడంబరమే అవుతుంది. భక్తి కల్గాలంటే బాబా ఎంతటి శక్తిమంతులో, దయామయులో తెలిస్తేగాని వారిపైభక్తితో హృదయం పరవశించదు; పరవశిస్తేనేగాని మిగిలిన వేవీ సార్థకంగావు. అందుకు వారిచరిత్ర సూక్ష్మంగా పారాయణ చేయడమొక్కటే మార్గం.

వైద్యుని దగ్గర మందు తీసుకొనడమేగాక వారాదేశించిన పథ్యం గూడ ఎలా పాటించితీరాలో అలానే సాయిలీలామృతమనే మందు సేవించడమేగాక వారిని స్వయంగా దర్శించిన వారందరికీ ఎటువంటి జీవిత విధానము ఆయన ఆదేశించారోనన్న పథ్యం తెలియాలి. ఇవి తెలియకుండా ఆయన నామస్మరణ మాత్రమే చేయడం పథ్యం, మందు తీసుకొనకుండా వైద్యుని పేరుమాత్రమే ఉచ్ఛరించడంలా వుంటుంది. కనుక ఎవరెన్ని చెప్పినా చరిత్ర పారాయణ చేయనిదే మిగిలినవేవీ సార్థకం కాజాలవు.

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః॥**

---





# శాస్త్రపరమయినవి

ప్ర:- బల్లి మన శరీర భాగాలపై పడితే బల్లిపడే శాస్త్రం చూస్తాము. ఎన్నో జీవరాసులుండగా బల్లికి మాత్రం ఎందుకు చూస్తారు. బల్లికిగల ప్రాధాన్యతను వివరించండి. మన దేశంలోకాక విదేశాలలో కూడా పాటిస్తారా? ఈ శాస్త్రం ఎవరు ఏకాలంలో వ్రాశారో తెల్పండి. — ఐ. ఎస్. నారాయణ, సూళ్ళూరుపేట

జ:- సృష్టిలోని రూపాలన్నింటిలోను ఒకే చైతన్యశక్తి ప్రకటమవుతుందని ఆధ్యాత్మికత చెబుతుంది. అలానే సృష్టిలోని వస్తువులన్నీ ఒకే శక్తియొక్క రూపాలని, కనుక సృష్టిలో ఏమూల ఎంత చిన్న క్రియ జరిగినా స్వల్పంగానో, అధికంగానో తక్కిన సృష్టి అంతటినీ అది ప్రభావితం చేస్తుందని, అలానే సృష్టిలోని తక్కిన అన్ని క్రియల చేత, వస్తువుల చేత అనుక్షణము ప్రభావితమవుతుందని నేటి భౌతిక విజ్ఞానశాస్త్రం ఎంతగానో నిరూపిస్తూవున్నదో "విజ్ఞాన వీచికలు" అనే గ్రంథంలో వివరించాము. ఈరెండు సూత్రాలపై ఆధారపడి మనదేశంలో అనాదిగా "సరిగా అన్వయించుకోగల్గితే దేనిని గమనించి అయినా సృష్టిలోని మరే విషయం గూర్చయినా తెలుసుకోవచ్చు'’! అన్న సూత్రాన్ని మన పూర్వీకులు ఏర్పరచుకొన్నారు. ఇందుకుపకరించే అనేక శాస్త్రాలను వారు రూపొందించ యత్నించారు. వీటిలో శకునశాస్త్రమొకటి.

బల్లి మనము నివసించే గదులలో గోడలపై జీవిస్తుంది. సామాన్యంగా అది పట్టుతప్పి క్రింద పడదు. కనుక దాని పాటు ప్రకృతిలో ఒక ప్రత్యేకమైన మార్పును సూచిస్తుందన్న భావం ఈ శాస్త్రాని కాధారమై యుండాలి.

ఒక జీవిలో కలిగే ప్రాణక్రియకు సాటి జీవులపై ప్రభావముంటుందని నేటి నూతన వైజ్ఞానిక రంగమయిన 'సైకోట్రానిక్స్' చెబుతుంది. (దీని వివరణ "మతం ఎందుకు' అన్న పుస్తకంలో చూడవచ్చు) కనుక ఏవ్యక్తి సమక్షంలో ఎవరిపై బల్లిపాటు సంభవిస్తుందోవారి శరీరంలోని ప్రాణ క్రియలో ఏదో సూక్ష్మమైు, అనవహనము అయిన మార్పుకలిగి వుండాలన్న భావం ఈ శాస్త్రానికాధారమై యుండవచ్చు, అందుకే బల్లిపాటు ఫలితాలుగా చెప్పబడ్డవి.

ఎక్కువ భాగం దేహ ఆరోగ్యానికి, మానసిక వికారాల మార్పులకు వాటి పర్యవసానాలకు సంబంధించినదై యుంటుంది. అయితే ఈ 'శాస్త్ర' సూత్రాలను ఎంత నిర్దుష్టమైన పరిశీలనపై ఏర్పరచారన్నది మనం గమనించి చూడవలసినదే. కారణం మధ్యకాలంలో వ్యతిరేక మూఢనమ్మకాలను ఆధారంచేసుకొని పొట్టకూటి సంపాదించుకోడానికి కొందరు ఎన్నో నకిలీ శాస్త్రాలను ప్రచారంలోకి తెచ్చారు. కనుక ఈ శాస్త్రం ఏకోవకు చెందిందో అన్నది సంశయాస్పదమే! అయితే నిజమైన ఆస్తికుడికి ఇట్టి శాస్త్రాలతో ఎట్టి ప్రమేయాలు లేవని గుర్తించాలి. మశీదు గోడపై బల్లికూసినపుడు శకునమేమని ప్రశ్నించిన భక్తుడికి సాయి చెప్పిన సమాధానంలో ఈభావమే స్ఫురిస్తుంది. సర్వం **కర్మసూత్రాన్ననుసరించే జరుగుతుందని విశ్వసించినా లేక దైవ సంకల్పంవల్లనే జరుగుతుందని తలచినా ఈ శాస్త్రాలవలన మనకు జరిగేది ఏదీలేదు.** మన భక్తిశ్రద్ధల వలన మన చైతన్యస్థాయి పై రెండు కారణాలను జరుగవలసినదానిని మార్చగలుగుతుందని తలిస్తే, అట్టి సాధన తానెల్లప్పుడూచేస్తూవుంటే ఇటువంటి శాస్త్రాలతో పనిఏమి? అంతేకాక అంతటికీ దైవమోలేక కర్మో మాత్రమే కారణమన్న ధృఢవిశ్వాసాన్ని, అది ప్రేరేపించే సంపూర్ణ శరణాగతిని, సుఖదుఃఖాది ద్వంద్వాలపట్ల నిర్లిప్తమయి సమానస్థితిని; ఇట్టిశకునాది శాస్త్ర విశ్వాసాలు చెదరగొడతాయి, కనుక ముముక్షువులకవి నిషిద్ధం. తక్కినవారికి అనివార్యంగా జరుగవలసిన వాటినే శకునాది శాస్త్రాలు సూచిస్తాయి. కనుక—అవి నిర్దుష్టమయిన శాస్త్రాలే అయితే – వాటిని ముందుగా తెలుసుకున్నందువల్ల జరిగేదేమీ వుండదు. కాగా వూరికే వ్యర్థమయిన ప్రలోభాలకు మానసిక బలహీనతలకు మాత్రమే ఇవి కారణాలవుతాయని మనం గుర్తించాలి.

ప్ర:- **నేనే భగవంతుణ్ణి.నన్నే పూజించండి అని సాయి ఎన్నడూ చెప్పలేదని నేనంటాను; "నీదృష్టి నాపై నిలిపితే నాదృష్టి నీపై నిలుపుతాను" అన్నప్పుడు సాయి అలా చెప్పినవారయ్యారు. అలా చెప్పేవాడు భగవంతుడే కాడని**



నాసోదరుడంటున్నాడు. సాయిగురువేకాని దేవుడు కాదంటున్నాడు. మా సమస్య తీర్చండి?

- కుమారి కృష్ణవేణి, హైదరాబాద్.

జ:- సాయి భగవంతుడు అవునో కాదో తెలియాలంటే భగవంతుడు ఎక్కడ, ఎలా వుంటాడో తెలియాలి. సాయి ఎలాటివారో తెలుసుకోవాలి. బంగారం ఎలా వుంటుందో ఎన్నడూ చూడనివాడు తన ఎదుటనున్న ఉంగరం బంగారం అవునో కాదో ఎలా తెలుసుకోగలడు? బంగారము ఉంగరమంటే ఏమో తెలిసినవాడికిమాత్రమే అది బంగారు ఉంగరమవునో కాదో తెలిసే అవకాశమున్నది. బుద్ధి శక్తితో స్వల్పంగానైనా భగవంతుని గూర్చి తెలియాలంటే ఎంతో చదవాలి, చర్చించాలి, ఆలోచించాలి. ఇదేమీ చేయకుండానే తాను చెప్పినదే సత్యమని వాదించేవారు ఆస్తికులైనా, నాస్తికులైనా మూఢులు. అంటే బుద్ధి వికాసం చెందనివారని అర్థం. అలా తెలుసుకొనడానికి చేసిన యత్నము, ఫలితము "విజ్ఞాన వీచికలు", "మతం ఎందుకు?"లలో చూడవచ్చు. అనుభవంతో కూడిన పూర్ణమైన జ్ఞానం తీవ్రసాధన వల్ల మాత్రమే కల్గుతుంది- వాదన వలనకాదు. అట్టి సాధనను మరల సాధన ద్వారా అనుభవముపొంది గురువువద్ద నేర్చి, వారి పర్యవేక్షణలో కొనసాగించవలసినదే. అలా చేసినవారు పూర్ణులైన గురువు త్రిమూర్తుల స్వరూపమేగాక సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపమేనని "గురుధ్యాన" శ్లోకంలో చెప్పారు. అలానే చేయాలని భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాలు గూడ చెప్పాయి. పూర్ణులైన గురువు భగవంతుడేనని అనుభవజ్ఞులు చెబుతుంటే పూర్ణులుగాని గురువులను జూచి, గురువులందరూ అలాటివారేనని తలచినందువల్లనే నీ సోదరుడలా అనివుండవచ్చు. నన్నాశ్రయించినవాడిని రక్షించగలనన్నమాట భగవంతుడే తానైన పూర్ణగురువుకు మాత్రమే సాధ్యం. "నేను నీవాణ్ణి" అని శరణు పొందిన వారిని రక్షించడమే తమ వ్రతమని రాముడు,కృష్ణుడు గూడ చెప్పారు. తనకు, జ్ఞానికి భేదమేలేదని కృష్ణుడు చెప్పాడు. పూర్ణుడైనవాడే గురువని, అట్టి గురువు భగవంతుడేనని, భగవంతుడంటే ఏమో మనకు తెల్పే ప్రాచీన గ్రంధాలన్నీ చెబుతున్నాయి. అట్టి చిహ్నాలు సాయిలో పూర్ణంగా కనబడతాయి. ఇలాటి విషయాలలో అటు



మహనీయుల అనుభవము, అట్టి అనుభవాల సమగ్ర రూపమైన శాస్త్రాలే ప్రమాణంగాని మనకు తోచిన అభిప్రాయాలేవీ ప్రమాణం కాజాలవు. ఇలా వివరించినప్పుడు సహృదయంతో విన్పించుకునేవారికి చెప్పడము అలా విననివారిని పట్టించుకొనకుండడము ఒకటేకర్తవ్యము.

ప్ర:- ***భగవంతుడు లౌకికమైన కోర్కెలు తీర్చడానికి, ఆధ్యాత్మికమైన కోర్కెలు తీర్చడానికి తేడా ఏమిటి?***

***- కుమారి టి. అంజని, కందుకూరు.***

జ:- ఆధ్యాత్మికతలో మనస్సును ఏకాగ్రము చేసుకోవడం తప్ప వేరు కోర్కెలుండవు. అందుకు సాయి, అక్కల్‌కోటస్వామివంటివారి లీలలు మరల మరలా చదువుకుంటూ, చింతనచేస్తూ ఆ లీలలలో ప్రకటమయ్యే వారి తత్వాన్నీ, మహిమనూ గుర్తించి, గుర్తిస్తూ పరవశిస్తుండడమొక్కటే మార్గం. ఇది కుదిరాకగాని యింకే సాధన కుదరదు, సఫలమవ్వదు. ఇది ఎవరి యత్నాన్నిబట్టి వారు పొందేదే గనుక నిరాశకు తావులేదు. ధర్మబద్ధమైన కర్తవ్యాన్ని భగవంతుడు సంతసించేలా చేస్తూ, అనివార్యమైన అపజయాలను ఓరిమితో సహిస్తూ మనను సంస్కరించడానికి సద్గురువు చేసే చికిత్సలుగా నిశ్చింతగా స్వీకరించగల్గడమే ఆధ్యాత్మికత. లౌకికంలో సాయి ఎన్ని నెరవేర్చినా తృప్తివుండదు. కనుక శ్రేయస్కరముగానివి ఆయనగా నెరవేర్చరు. మన పుణ్యంవలన మాత్రమే నెరవేరుతే అప్పుడు పొంగకుండా, అహంకరించకుండా వుండడం మన మనస్సుకు నేర్పాలి.

ప్ర:- ***మునుల దివ్యదృష్టికి, సామాన్యుల దృష్టికి గల భేదమేమి? దిష్టి తగలడం అన్నది నిజమా? మూఢ నమ్మకమా?***

***— ఆర్. వి. రాఘవరావు, ఒంగోలు.***

జ:- సర్వము పరమేశ్వరమయమన్నది మునుల దృష్టి. రాగద్వేష యుతమైనది, వస్తువుల స్థూల రూపమే సత్యమన్నది పామరుల దృష్టి.

వస్తువులు, వ్యక్తులకేసి మనము జూచినపుడు మనలోని సంస్కారాలన్నీ సూక్ష్మరూపంలో ఆ వస్తువుల లేక వ్యక్తులమీద ముద్రించుకుంటాయి. కనుక



ఉత్తమ సాధకులు కొందరు అలాంటి వస్తువులను స్వీకరించక నిరాకరిస్తారు. ఈ కారణంగానే దేవాలయాలలో భగవంతునికి నివేదనిచ్చేటప్పుడు ఆ వంటకాలను, పండ్లను ఎవరు చూడకుండా తెర అడ్డం వేస్తారు. నివేదించేవస్తువుల రుచివూహించి, ఆశించని ఇంద్రియ మనోనిగ్రహము కలవాడుగా వుండాలి. ఇలా సంస్కారాలు ముద్రించుకోవడమే దృష్టి ప్రభావమంటే. అతి దుష్టంగావుండే పూర్వజన్మ సంస్కారాలు గలవారుచూస్తే, ఆ పశువులు, వ్యక్తులు రోగగ్రస్తులవుతారు. ఇదే దృష్టిదోషం. ఈ సూత్రాన్ననుసరించి మహనీయుల దృష్టి వస్తువులను, వ్యక్తులను, పరిసరాలను పవిత్రంగా చేసేదిగా వుంటుంది. కొందరికి దృష్టిదోషం తగలకపోవటానికి కారణం, వారి పవిత్రత అట్టి దోషంకంటే బలీయమైనదిగా వుండడంకాని లేక దాదాపు అంతటి పవిత్రత ముందునుంచి కలిగివుండడం గావచ్చు లేక పూర్వపుణ్యం బలీయమైనదిగా వుండొచ్చు.

**ప్ర:- *కుటుంబంలో ఎవరైనా మరణించినప్పుడు మైలరోజులలో సాయి చరిత్ర పారాయణ, పూజ చేయవచ్చా?***

***— టి. వి. రామకృష్ణ, తణుకు.***

**జ:-** ఈ విషయం మన భక్తిశ్రద్ధలపై ఆధారపడి వుంటుంది. జీవితంలో రాగద్వేషాలు బలీయంగా వుండేవారు, తామడిగింది సాయి నెరవేర్చనప్పుడు ఆయనతో అసంతృప్తి చెందేవారు ఆ రోజుల్లో పారాయణ, పూజ మానివేసి "సాయిలీలామృతంలో" 'సద్గతి' అనే అధ్యాయము, "శ్రీ సాయినాథ ప్రబోధామృతము" శ్రద్ధగా చదివి తమ భావాన్ని శుద్ధిచేసుకొని, పూజా, పారాయణలు చేసుకోవచ్చు. చనిపోయినవారిపట్ల శోకం ఎక్కువగా వున్నవారు పూజ, పారాయణ నైవేద్యము మొ॥నవి చేయగూడదు! కారణం ఆ జీవియొక్క జన్మపరంపరలు, పరిపాకమూ, శ్రేయస్సులననుసరించి మాత్రమే మరణం నుండి సాయి వారిని రక్షించడము, రక్షించకపోవడమూ చేస్తారని తెలుసుకొన్నవారికి శోకముండదు. శోకం మన భక్తి విశ్వాసాలెంత బలహీనంగా వున్నాయో తెల్పుతుంది. దృఢమైన ఇట్టి విశ్వాసంవలన శోకించక సాయి నిర్ణయాన్ని అంగీకరించగలవాడు పూజ, పారాయణ చేసుకోవచ్చు. గతించినవారి ఆత్మశాంతికై ప్రత్యేక పారాయణ చేయడం వారి కెంతో మేలు.



**ప్ర :- దేశంలో ఎన్నో ఆలయాలలో ఆంజనేయస్వామిమూర్తి వుండడానికి గల కారణమేమి?**

**- టి. యస్. నారాయణ, ఒంగోలు.**

జ:- ఆంజనేయుడు వాయుదేవుని కుమారుడు. వాయు చలనాన్ని మన శరీరంలో నియమించడమే. యోగం ఇతర మార్గాలలో గూడ సాధన ఫలిస్తున్నప్పుడు యిట్టి క్రియ సహజంగానే జరుగుతుంది. అంటే ఆధ్యాత్మ సాధనలన్నింటిలో ప్రధానమైన యోగమే ఆంజనేయుడు గనుక అన్ని దేవాలయాలలో ఆ మూర్తిని ప్రతిష్ఠించడం జరిగింది. దానికితోడు మన జాతి వీరత్వం కోల్పోయి విదేశీయులను చూచి భయపడుతున్న సందర్భంలో శివాజీ గురువైన సమర్థ రామదాసస్వామి మరియు ఆ సంప్రదాయంవారు మన జాతికి ఆదర్శము, కర్తవ్యము తెల్పి ఉత్సాహపరచడానికి దేశవ్యాప్తంగా ఆంజనేయ ప్రతిష్ఠలు చేశారు. అట్టి ఆంజనేయుడుగా సాయిబాబా దర్శనమీయడం వలన మన జాతికి సాయిబాబా యిచ్చే సందేశం గూడా వీరులుగమ్మనే! అంజనాదేవి కొడుకు ఆంజనేయుడు- అంజనమంటే కాటుక చీకటి. లేక మాయ తన మాయవలన మనమధ్య అవతరించాడు గనుక అయన ఆంజనేయుడు.

**ప్ర :- మీరీ మధ్య ఒంగోలు, విద్యానగర్ మొ॥న సాయిమందిరాలను వాస్తు శాస్త్రజ్ఞులకు చూపుతున్నారు గదా. సర్వసమర్థులైన సాయి మందిరాలకు గూడ వాస్తు అవసరమా?**

**- బాలచందర్, గుంటూరు.**

జ:- సృష్టియొక్క సమిష్టి తత్వమే సాయి, గనుక విశ్వమంతటా పనిచేసే శక్తులకు తగిన రీతిన సాయి చేసిన ప్రతి పని— శిరిడీలోని వాస్తు గూడ — దానికై అదే సమకూడింది. అట్టి అతీతజ్ఞానం లేని మానవులు, గణనము మరియు అనుభవాల ద్వారా వీలైనంత నిర్దుష్టంగా భవన నిర్మాణ విధానం రూపొందించుకున్నారు. ఇది మానవ ప్రయత్నంలో ఒక భాగమే. ప్రయత్న



లోపమెప్పుడూ వుండగూడదని భగవద్గీత బోధించినది. సాయికూడ దానినే బోధించారని 'శ్రీ సాయి ప్రభోధామృతం' చూస్తే తెలుస్తుంది. **ప్రయత్నం మాత్రం నిర్దుష్టంగా చేసి, ఫలితంలో జయాపజయాలపట్ల నిర్లిప్తులై వుండడమే కర్మయోగం. సంసారులమైన మనకు అదే ముఖ్యసాధన.** సాయి మందిరాలను సాధ్యమైనంత నిర్దుష్టంగా నిర్మించుకోచూట్టం గూడా ఆయనపట్ల మనకుండవలసిన శ్రద్ధలో భాగమే. మన యింట్లో సాయిని ప్రతిష్టించు కొన్నాము. గనుక యిక యింటికి తలుపులే అవసరంలేదన్న స్థితి మనకు కలిగే లోపల మందిరాలపట్ల మన మలాటి శ్రద్ధ వహించాల్సిందే. అలాగాకుంటే మనింటిపట్ల మనకున్న శ్రద్ధ సాయి మందిరం పట్ల మనకు లేనట్లేగదా?

***ప్ర:- భవిష్యత్తు మొ॥వి తెలుసుకునే సామర్థ్యమున్న వారిని మహాత్ములనిగానీ, ఉత్తమ సాధకులనిగానీ తలచవచ్చా?***

జ:- బయట ప్రపంచంలో జరిగేవాటిననుసరించి మహాత్ముల శరీరంలో గాని, మనసులోగాని తగిన ప్రేరణ అదే జరుగుతుంది. అందువల్ల ముందేమి జరుగుతుందో తెలుసుకోవలసిన అవసరంగానీ, ఆసక్తిగానీ వుండదు. అది సాధకులకు మంచిదే. అలాటివి తెలుసుకోవాలనిపిస్తే తెలుసుకుండే మనకు, మనచేత తెలుసుకోబడే ప్రపంచానికీ మధ్య భేదమనే అడ్డుగోడ— సాయి కూలదోయమన్నది— మిగిలిపోతుంది. అట్టి జ్ఞానంతో ఆకర్షించుకోవాలన్న బుద్ధిపుడుతుంది. అట్టి భ్రాంతికి లోబడితే మనచిత్తమే మనకు ముసుగువేసి ఆత్మ వంచనకు దోహదం చేస్తుంది. అలా జరుగబోయేవి తెలుసుకొని చెబితే జనానికి విశ్వాసం కలిగి సన్మార్గంలో నడుస్తున్నారు అన్నదే ఆ భ్రాంతికి కారణం. అక్కడ 'సన్మార్గంలో' అన్నదానికి నిజమైన అర్థం 'మనం చెప్పినట్లు సన్మార్గంలో నడవడమే'! అంటే వాళ్ళు మనల్ని పూజించడం, గౌరవించడం మన గొప్పతనం గురించి నలుగురికి డబ్బా కొట్టడం.

దీనివలన ఒక సాధకుడలా చేస్తే యితర సాధకులకు గూడ అలానే చేయాలనిపిస్తుంది. దానికి గూడ నైతికంగా మనం బాధ్యులమౌతాము.



"గురువుకు పగ్గాలప్పగించాక యిక చింతకు తావేలేదు" అన్న సాయి వాక్యాన్ని మరుస్తాము. సద్గురుస్థానంలోంచి సాయిబాబాను నెట్టివేసి మనమే కూర్చోవాలనుకోవడం అంటే అదే. దాని గురించే భగవద్గీతలో "ఈశ్వరోహం అహంభోగి- నేనేఈశ్వరుడను, సర్వభోగాలూ అనుభవించవలసినవాడనూ" అన్నది అసురీ భావమని భగవద్గీత స్పష్టంగా చెబుతుంది. ఇలాటివి (భవిష్యత్తు తెలుసుకొని చెప్పడమనేవి) ఒకసారి భ్రమించి చేశాక నలుగురి దృష్టిలో మనపట్లగల యీ పూజ్యభావాన్ని నిలుపుకోవడానికి పాడుగునా చేస్తుండాల్సివస్తుంది. మన "శిష్యులు" మనం నడిచేది నిజమైన ఆధ్యాత్మిక మార్గంగాదు అని తెలుసుకోవడం యిష్టం వుండదు గనుక నిజమైన ఆధ్యాత్మికత ఏమిటో సాయి, అక్కల్‌కోటస్వామివంటి మహాత్ముల విధానమేమిటో, గొప్ప తనమేమిటో, మన శిష్యులు చదివి తెలుసుకొనడం క్రమంగా మనకు సహించరానిదిగా అవుతుంది. ఇతర సద్గురువులను (అప్పుడు మన దృష్టిలో మనమూ సద్గురువులమే గనుక యిలా చెప్పవలసి వస్తుంది.) తమ శిష్యులు దర్శించడం, సేవించడం, సహించలేక " నా శిష్యులు నా అనుమతిలేక ఏ సద్గ్రంథమూ చదువకూడదు; ఎవరి ప్రసంగము వినకూడదు, ఏ మహాత్ములనూ దర్శించకూడదు" అని నిషేధించ బుద్ధవుతుంది. అంటే మనం బాగుపడకపోయినా మనవద్దకొచ్చినవారు గూడ మనను విడచి ఇకముందు గూడ బాగుపడకుండా చూచుకోటానికే మన శక్తి, సమయమంతా ఖర్చవుతుంటాయి. తిరిగి ఏనాటికైనా వెనక్కి చూచుకోగలిగితే – మొదట మనం తరించాలని ప్రారంభించిన సాధన తర్వాత లోకహితం చేయడంగామారి, అటు తర్వాత లోకకంటకం చేయడంగా, ఆత్మ వికాసం సాధించుకోకుండా మారుతుంది. అందుకే సాయి "మనకా వేశ్యతో ముద్దులాట తగదు" అని హెచ్చరించారు. శ్రీఅక్కల్ కోటస్వామి వారు కూడ అలాగే చెప్పారు. వేశ్యతో ముద్దులాట ప్రారంభించినవాణ్ణి వేశ్య వ్యామోహపరచి అతడంతకంతకూ లోబడి వుండగలందులకు జూదము, మద్యము, అసత్యాలకు, తనవారిపట్ల ధర్మంపట్ల విముఖతకూ అలవాటు చేస్తుంది. అందుకనే సద్గురువు చరిత్రలు పారాయణ చేస్తూ, ఆయనకు దాసులుగా మాత్రమే వ్యవహరిస్తూ వారు చెప్పినట్లు యిట్టి వ్యామోహాలకు ముందునుండే చాలా దూరంగా వుండడం అలవరచుకోవాలి.



ప్ర :- సాయి తమ గత జన్మలలో జోగ్ మొ॥న వారితో కలిసి ఒకే గురువును సేవించినట్లు, గుడ్డలు నేసినట్లు యిలా ఎన్నో రకాలుగా చెప్పిన దానినిబట్టి ఆయన జన్మాంతరంలో క్రమంగా పరిపూర్ణుడైనట్లు తోస్తుంది. సాయి దత్తావతారమనడమెలా కుదురుతుంది?

— చి. సుబ్బరామరెడ్డి, రేబాల.

జ:- సాయి శిరిడీలో భౌతికంగా జీవిస్తున్నప్పుడు గూడ రత్తంజీవాడియా దగ్గర రూ. 3-14-0 సత్కారంగా పొందిన మౌల్వీ సాహెబ్ తానేనని, గోవాలో 35,000/- వంటవాని వలన పోగొట్టుకున్న వ్యక్తిని తామేనని చెప్పారు. అంతేగాదు. ఝాన్సీలక్ష్మీబాయి సైన్యంలో తామొక సిపాయినన్నారు. కానీ ఝాన్సీలక్ష్మీబాయి, సాయినాథుడు సమకాలికులే. కనుక తామొక నీతి చెప్పదలచినప్పుడు అది తమపరంగా చెప్పుకొనడం దత్తావతార లక్షణమని అది వారి నిరాడంబరము, నిరాహంకారతకు నిదర్శనమని తెలియాలి.

సర్వజీవుల హృదయాన్తర్వర్తియైన ఆయన ఏ జీవిగారు గనుక ? మీరు పైన ప్రస్తావించిన వారి పూర్వజన్మ కథలు కూడ అలాంటివేనని తలచాలి. వాటికి తోడు ఆయన తాము కబీరునన్నారు ; కబీరు వృత్తి కూడా నేతపని; ఆయన గూడ ఒక గురువు నాశ్రయించారు. కాని ఆయనగూడ అయోనిజుడుగా ముస్లిం దంపతులకు దొరికాడు. ఆయన స్పర్శ వలన గొడ్రాలైన ఆ తల్లికి స్తన్యమొచ్చింది. అదిగాక సాయి— అక్కల్‌కోటస్వామి ఒక్కరేనని నిదర్శన మిచ్చారు. ఆయనయే మాణిక్యప్రభువు, నృసింహసరస్వతి. గాణగాపురంలో సంతతి పొంది మొక్కుతీర్చని భక్తునితో " నీరాతలో పుత్రసంతాన మెక్కడిది? నా శరీరం చీల్చి నీకు మగ బిడ్డనిచ్చాను!" అని సాయి మందలించారు. కనుక ఆయన శ్రీపాద శ్రీవల్లభులే. అంటే ఆయనే దత్త ప్రభువు; అందుకే ఆయనే రామాయణ, భాగవత, భారతకథ జరుగుతున్నప్పుడు గూడ వున్నామని, స్వయంగా చూచామని యిప్పుడెలా వున్నారో అప్పుడుగూడ అలానే వున్నామనీ అన్నారు. అంటే సాయి దత్తావతారమని యీ లీలలు నిస్సందేహంగా తెల్పుతాయి. అయినా ఒక

సద్గురువును సేవించి వారి అనుగ్రహంవల్ల మాత్రమే తాము తరించినట్లుచెప్పి లోకానికి సద్గురుసేవ ఎంత అవసరమో తెల్పడం దత్తావతార లక్షణం. శ్రీనృసింహసరస్వతి గూడ తప్పనిసరి అయ్యేవరకు కేవలమొక మూగబాలుడిగా నటించడము; ఉపనయనం చేయమనికోరి గాయత్రీ ఉచ్చరణతో మాత్రమే మాట్లాడటం చూచాముగదా? అందుకే నిజానికి "శ్రీగురుచరిత్ర", "శ్రీమాణిక్య ప్రభువు చరిత్ర" "శ్రీస్వామిసమర్థ చరిత్ర", "శ్రీ సాయిబాబా జీవితచరిత్ర" — యివి వేర్వేరు మహాత్ముల చరిత్రలని భ్రమించగూడదు — ఒకే దత్తస్వామి యొక్క చరిత్రలో వేరు అధ్యాయాలుగా మాత్రమే తలచి పారాయణ చేస్తేనేగాని ఆయన మహాత్మ్యము మన హృదయాలకు అవగతంకాదు, చాలినంత భక్తి కుదరదు. వీటిలో ఏది పారాయణ చేయక విడిచినా సాయి చరిత్రలో కొన్ని భాగాలు చదవకుండా విడిచినట్లే. అది సరియైన భక్తి ఎలా అవుతుంది? ఈ సత్యాన్ని మరువకుండానే మీరు ప్రస్తావించిన అంశాలను సమన్వయం చేసుకోవాలి.

ప్ర :- **సాయిబాబా రాతిపై కాలుమీద కాలు వేసుకొని కూర్చొనడంలో భావమేమి?**

— ఐ. ఎస్. నారాయణ, నూళ్ళూరుపేట.

జ:- దేహం ధరించాక ఎలాగో ఒకలాగ కూర్చోవాలి గదా? ఎలా కూర్చున్నా ఈ ప్రశ్న వస్తుంది గదా? ఆయన చెప్పదలచినది లీలలు, మాటలలో, ఆచరణలో బోధించారు గదా? ఆయనకూర్చున్న భంగిమను రకరకాలుగా వివరిస్తున్నారు. వారి రెండు చేతుల వేళ్ళు ద్వంద్వాలని, వాటిమధ్య తొంగిచూచే వారి బొటనవ్రేలు పరమాత్మయని కొందరంటారు. వెనకనున్న మూడు వ్రేళ్ళు త్రిగుణాలని, వాటినుండి చూపుడు వ్రేలు అనబడు జీవుణ్ణి విడుదల చేయగల్గి సద్గురువు యొక్క పాదాన్ని అలా ఆశ్రయించాలని వారిభావమని కొందరంటారు. ఇలా ఎన్ని రీతులు వివరించుకున్నా అవి మన భావాలే అవుతాయి. వీటిలో దేనిని ఆచరించాలన్నా వారి చరిత్ర మరలా మరల పారాయణ చేస్తూ వారు చెప్పినట్లు చింతనచేస్తూ వారి ప్రత్యేకానుగ్రహంకోసం "శ్రీ గురుచరిత్ర" పారాయణ చేయడమొక్కటే మార్గం.



ప్ర :- **ఉపనయనము అంటే ఏమిటి? ఎందుకు చేసుకోవాలి.**

**- జిజ్ఞాసువు, గుంటూరు.**

జ:- ఈ శీర్షికలో ఈ విషయం స్థూలంగానూ, క్లుప్తంగాను వివరించడం మాత్రమే సాధ్యం. ఉపనయనమంటే గురువువద్దకు చేర్చి గాయత్రీ మంత్రోపదేశము, అగ్నిహోత్రము మొ॥నవి బిడ్డలకు నేర్పించడమని అర్థం. అవి సక్రమంగా నేర్చుకుంటామని దీక్ష పూనడానికి చిహ్నామే యజ్ఞోపవీతం. అతడికవి నేర్పించేవాడు మాత్రమే గాదు, 'ఆచార్యో ఆచారం గ్రాహ్యతి' అని యాస్కమహర్షి నిర్వచనం. ఆచారమేమిటో చెప్పడమేగాక దానిని శిష్యుని కలవరచేవాడే ఆచార్యుడు. వేదవేదాంగాలయొక్క అసలైన అర్థం తెల్పేవాడే ఆచార్యుడని మనువు చెప్పాడు. ఉపనయన మంత్రాలలో ఆచార్యుడు బ్రహ్మచారిని "నీవెవరి బ్రహ్మచారివి?" అని అడుగుతాడు. అతడు "భవతా", "మీవాడనే" అని ఆత్మసమర్పణ చేసుకుంటాడు. ఆచార్యుడు "నీవు ఇంద్రుడను భగవంతునియొక్క బ్రహ్మచారివి, అగ్నియే నీ ఆచార్యుడు. నేను కూడ నీ గురువునే" అని చెప్పి, అతని శ్రేయస్సు భగవంతునికి, సూర్యునికి, ఆపను (జలము)కు, ఓషదులకు, భూమ్యాకాశాదులకు, సర్వభూతములకు మరియు దేవతలకు అప్పచెపుతాడు. అగ్ని ఎలా గురువవుతాడో శ్రీ గురుచరిత్రలో అవధూత కొంత బోధించాడు. ధునిని సేవించిన సాయి మనకు ఆచరించి చూపారు. "మీరు నన్ను ప్రార్థిస్తే నేను మీ ప్రార్థనలు భగవంతునికి అర్పిస్తాను. నిజానికి మిమ్ములను రక్షించేది ఆ భవగంతుడే" అని సాయి చెప్పిన మాటలు ఈ వేదమంత్రాలకు అర్థమే. అటుతర్వాత గురువు కొన్ని ధర్మాలు మరియు ఆరోగ్య సూత్రాలు బోధించి అగ్నికి సమిధలర్పించి "నీవుబ్రహ్మచారివి. నీవు ఉదయమే ఆపోశనం (చల్లనినీరు త్రాగడము) చెయ్యి. సంధ్యావందనము; అగ్ని హెూత్రము మొ॥న నిత్య ప్రార్థనలు చేస్తూండు. పగలు నిద్రపోవద్దు. వాక్కును నియమించుకొని సత్యమే పల్కు. నృత్యము, సంగీతము: విసర్జించు. దేహాన్ని అలంకరించు కొనడం మానివేయి" అని చెబుతాడు. అలా గురువు నాశ్రయించి యివన్నీ ఆచరించినవాడే శిష్యుడనదగినవాడు. గురుకృప అట్టివారికే లభిస్తుంది.



ఇదంతా సాయి ఆచరించి చూపినదే. చివరకు ఆచార్యుడు "మాలోని మంచిని మాత్రమే గ్రహించి అనుసరించు. యితరములైన వాటినికాదు" అని చెబుతాడు. ఈనాటి గురువులు, శిష్యులు దానినుండి ఎంతైనా నేర్చుకోవాలి. చివరకు బ్రహ్మచారి అగ్నినిలా ప్రార్థిస్తాడు: "ఓ భగవంతుడా నీవీ సమిధలను నీలో చేర్చుకొని నీరూపంగా మార్చుకున్నట్లే నేనుకూడా వీర్యము;బుద్ధి మరియూ స్వస్థతల రూపమగుదునుగాక!" అటు తరువాత అతడు గురుకులంలో పేద-ధనిక భేదంలేకుండా వటువులందరితో కలసి, గృహస్థుల యిండ్లవద్ద భిక్ష చేసుకుని జీవిస్తూ వేదమభ్యసిస్తాడు. ఇలా భిక్ష చేయడంవలన, తనను కన్నవారు మాత్రమే తన తల్లిదండ్రులను మమత తొలగి "నేనీ దేశమంతటికీ బిడ్డను, దేశంలోని గృహస్థులందరూ నా తల్లిదండ్రులే" అనే విశాలభావం కల్గుతుంది. అహంకారము, అసూయ, ద్వేషాలన్నవి తలెత్తవు. ఇట్టి సంస్కారము లోపించడంవలన కలిగే అనర్థాలు నేటి గురుశిష్యులలో ఎక్కువమందిలో చూడవచ్చు.

***ప్ర:- అవధూతకు, పిచ్చివానికీగల భేదమేమి? వారిని ఎలా గుర్తించాలి.***

**— జి. పిచ్చయ్య, ఖమ్మం.**

**జ:-** "శ్రీ గురుచరిత్ర", "దత్తావతార మహాత్మ్యము" శ్రద్ధగా మహనీయుల దర్శన ఆశీస్సులు కోరి పారాయణ చేస్తుంటే మనలోనే ఒక సూక్ష్మ గ్రహణం క్రమంగా మేల్కొంటుంది. అవధూత నివసించే ప్రాంతం సమీపించగానే మనస్సు దానికై అదే నిశ్చలమై అద్భుతమైన శాంతి అనుభవమవుతుంది. ఒక్కొక్కప్పుడు పారాయణ ఫలితంగా దత్తస్వామి ఆ అవధూత రూపంగా దర్శనమివ్వడమూ లేక ఆయన అవధూత! ఆయనను సేవించమని చెప్పటము జరుగుతుంది. లేక అవి పారాయణ చేసి ఆయన అవధూత అయితే నా వద్ద ఏదైనా అడిగి తీసుకోవాలి. మొ॥న పరీక్షలు పెడితే వెంటనే ఆ ప్రకారమే వారు నిదర్శనమిస్తారు. కాని అందుకు నిజాయితీ వుండాలి. అంటే నిరూపణయ్యాక లజ్జవిడిచి వారిని దర్శించి సేవించి తరించడము, నిత్యజీవితంలో చరిత్ర పారాయణ తీవ్రతరం చేసుకోవడమూ వుండాలి. వ్యర్థమైన కుతూహలానికి వారు స్పందించరు సరిగదా ఒక్కొక్కప్పుడు మనకు ముప్పుగూడ వాటిల్లవచ్చు.



**ప్ర:- సాయి మందిరాలలో విగ్రహ ప్రతిష్ఠలు చెయ్యరాదని, వారి చిత్రపటాలు మాత్రమే ఉంచాలని పెద్దలొకరు చెప్పినట్లు మా మిత్రులొకరు అంటున్నారు. మీ సమాధానమేమిటి?**

**— పి. ప్రమీల, విజయనగరం**

జ:- మన సమాధానమెందుకు? ఏ విషయంలో నైనా సాధ్యమైనంతవరకు సాయి ఏమి చేశారో లేక ఏమి చెప్పారో అదే మనకు ప్రమాణం. మే 1973 "సాయిలీల"లో యిలా వ్రాశారు :-

"శివపురికి చెందిన కేశవరావ్ ప్రధాన్ 1916 లో బాబానుదర్శించి ఆశీస్సులు పొందాక ఆయనతో, 'బాబా మీరు శివపురిలో మాయింటికి దయచేయండి' అన్నాడు. అప్పుడు బాబా తన విగ్రహమొక్కటి అతనికిచ్చి 'నీవీ మూర్తిని తీసుకుని శివపురికి వెళ్ళు దీనిని మందిరంలో ప్రతిష్టించుకో. అలాచేస్తే నీవు నన్ను దర్శించడానికి శిరిడీదాకి రావలసిన పనిలేదు' అన్నారు. అతడా మూర్తిని తీసుకువెళ్ళి తన యింట పూజా మందిరంలో పెట్టుకున్నాడు. కొద్ది నెలల తరువాత అతడు మళ్ళా బాబా దర్శనానికి వచ్చినప్పుడు. అతనితో, బాబా 'నేనే నీ యింటికొచ్చేశానుగదా! నీవు మరలా శిరిడీ వచ్చావెందుకు? శివపురియే నీ ఆధ్యాత్మిక క్షేత్రం, నేను అక్కడే వున్నానని నీవు తెలుసుకోవాలి.' అన్నారు. అతడు తిరిగి స్వస్థానం చేరాక శివపురిలో ప్రత్యేకంగా ఒక మందిరం కట్టించి ఆ విగ్రహం అందులో ప్రతిష్టించి నిత్యపూజలు చేయనారంభించాడు" ఇది చాలు మనకు.

**ప్ర:- ఆడవాళ్ళు బాబాకు కొబ్బరికాయ కొట్టవచ్చునా?**

**- వెంకటేశ్వర్లు, రత్నగిరి**

జ:- కొట్టవచ్చు దోషమేమిలేదు. భక్తితో పత్రం, పుష్పం ఫలం, తోయం అన్నట్లు. ఏమి అర్పించినా భగవంతుడైన సాయి సంతోషంగా స్వీకరిస్తాడు. మన భావమే ప్రధానం.



ప్ర:- పూనకాలు ఎంతవరకూ నిజం?

జ:- శ్రీసాయివంటి మహనీయులు ఎవరినీ పూనడముండదు. నిజానికి దేవతలుగూడ పూనరు. ఒక దయ్యాలుమాత్రమే పూనుతాయి. ఈదయ్యాలు పట్టినవారు అని తలచబడేవారిలో గూడ, వందమందిలో నిజంగా దయ్యం పట్టినవారు ఒకరిద్దరుకూడా వుండరు. మిగిలిన వారిలో ఎక్కువ మందికి ఇంట్లోవారిని సాధించడానికో, బాధ్యతలుతప్పుకోడానికో అలా నటిస్తారు. మిగిలినవారిలో ఎక్కువ మందికి శరీరంలోనో, మనస్సులోనో దాగియున్న దెబ్బవలన అలాటి భ్రమలు కలుగుతాయి. మంచి హెూమియో డాక్టరు దగ్గర మందిప్పిస్తే తగ్గిపోతాయి.

శ్రీ సాయిబాబా సాక్షాత్తు భగవంతుడే. ఆయన విశ్వమంతటా వ్యాపించియున్నాడు. ఆయన ఎవరిలోకైనా ఎలా ప్రవేశిస్తాడు? మీ ఊరిలోని స్థలమంతా మీయింటికి వచ్చివేయడమెలా సాధ్యం? ఒకవేళ ఆయన ఎవరికైనా పూనుతారని ఎవరైనా వాదించారనుకుందాం. ఈనాడు దేశంలో ఎంతోమంది అలా చెప్పేవారున్నారు. వారిలో ఒకరికి పూనినమాట నిజమైతే, అదేసమయంలో మిగిలినవారందరికీ పూనడమెలా సాధ్యం? వీరిలో ఎవరు నిజం చెబుతున్నట్లు? ఎవరు అబద్ధం చెబుతున్నట్లు? అది నిర్ణయించేదెలా? ఆధ్యాత్మికత అంటే ఏమో, సద్గురు వంటే ఏమో ఏమాత్రమూ తెలుసుకోడానికి ప్రయత్నం చేయకుండానే అమాయకంగా నమ్మేసే వారి వారి 'భక్తి' అభిప్రాయాలే, విశ్వాసాలే ప్రమాణమనుకుంటే ఈ పూనేవారందరి భక్తుల, తాము నమ్మినవారే నిజమని, మిగిలినవారిది వట్టి మోసమని అంటారు.

శ్రీ సాయిబాబా శిరిడీలో సశరీరులుగా నివసించిన యాభైఎనిమిది సంవత్సరాల కాలంలోనే ఆ దేహనికి పరిమితులుగా ఎన్నడూ లేరు! శ్రీమతి తార్ఖాడ్ కుక్కకు అన్నం పెడితే శ్రీ సాయికి కడుపు నిండింది; హంసరాజ్ పిల్లిని కొడితే ఆయనకు తగిలింది; శిరిడీకి చెందిన అబోతును కసాయివానికి ఒక ధూర్తుడు అమ్మివేస్తే శ్రీ సాయి వేరొక భక్తుడికి కలలో కన్పించి తమనే కసాయివాని వాకిట్లో కట్టివేసినట్లు చెప్పారు. ఆయన సశరీరులుగా ఉన్నపుడే



ఆ దేహానికి పరిమితులుగా లేకుంటే, ఈనాడు వీళ్లందరికోసము వారిలో ప్రవేశించి, వారి దేహాలకు పరిమితులు గావడం ఆయనకెలా సాధ్యం? సాయిబాబా పత్రికలో గాని, బొంబాయినుండి వెలువడుతున్న 'సాయిలీల' (ఇంగ్లీషు) పత్రికలోగాని వెలువడుతున్న భక్తుల అనుభవాలు చూస్తుంటే, ఆయన ఎందరికైనా స్వప్నంలోనో, శరీరంతోనో కన్పించి తమ సందేశ మివ్వగలరని నిస్సందేహంగా తెలుస్తుంది. అది ఆయనకు చేతగాకుంటేగదా అయన ఎవరినైనా పూని భక్తులకు సందేశాలివ్వవలసిన అగత్యం పట్టేది? అందుకే సాయి సశరీరులుగా శిరిడీలో నివసించిన 58 సం॥లలో ఒక్క భక్తుడికి గూడ ఆయన పూనలేదు. అయితే కొందరలా చెబుతున్న సందర్భాలున్నా గూడ చరిత్రకెక్కలేదేమో ననిపిస్తుంది. కారణం, దాసగణు మహారాజ్ వ్రాసిన హరికథలో అందుకు సూచనలున్నాయి. గంగగిర్‌బాబా శిరిడీవచ్చి, మారుతీ ఆలయంలో కూర్చొని భక్తులతో మాట్లాడుతూ, భుజంపై నీటికుండ పెట్టుకుని మశీదుకు పోతున్న బాబాను అనుసరించాడు. అప్పుడు సాయి మాటల సందర్భంలో అతనితో "లౌకిక సుఖాలు అనే కల్లు త్రాగి మైకంతో గంతులేస్తున్న ఈ మానవుల మధ్యకు భగవంతుడు నా నెత్తిమీద ఒక పాలకుండ పెట్టి, వారందరికీ సన్మార్గం బోధించమని వీళ్ళ మధ్యకు పంపించారు. కాని నా వద్దకు వచ్చిన వారందరూ నా పాలకుండపై రాళ్ళు రువ్వి, గేలిచేస్తున్నారు. కొందరు సాయిబాబా మమ్మల్ని పూనాడు మా వద్దకురండి. ఇప్పుడు ఆయనవద్ద ఏమీలేదు. ఆయన చెప్పినది వినవద్దు! అంటున్నారు" అని చెప్పారు. అంటే ఇటువంటి గొడవలు ఆయన శరీరంతో ఉండగానే జరిగాయన్నమాట! ఇటువంటివాటి గురించి ఆయనకు ఎంత అసమ్మతియో, ఎంత జుగుప్సో ఈ సన్నివేశం తెలుపుతుంది. సాయి భక్తులమని చెప్పుకుంటూ ఇటువంటి అసహ్యకరమైన అంశాలను ప్రచారం చేయడం మహాపాపం, ఎంతో ఏహ్యమైనది. తిన్నగా తన భక్తునికి సందేశమివ్వడం శ్రీసాయికి చేతగాదనుకుంటే తప్ప, అలా నేరుగా ఆయన నుండి భక్తులు సందేశాలు పొందుతున్న అనుభవాలన్నీ కల్పనలనుకుంటే తప్ప ఈ పూనకాలను నమ్మవలసిన అగత్యముండదు. శ్రీ సాయి అలా నేరుగా సందేశమివ్వలేని

వారైతే, వారిలా పూనకాల ద్వారా సందేశమిచ్చినా, అది నమ్మవలసినంత విలువగలది కానేకాదు. ఇటువంటి వారెందరివద్దకో నేను వెళ్ళి పరీక్ష చేసి చూశాను. వారిద్వారా సాయి చెబుతున్నారని వాళ్ళు చెప్పేవి వ్రాసి వుంచుకుని, వాటిలో ఎన్ని నిజమవుతాయో తర్వాత పరీక్షగా గమనించాను. మీరు గాని, నేనుగాని తోచినదెల్లా చెప్పేస్తుంటే ఎంతవరకు నిజమౌతాయో అంతకుమించి యివేవి నిజంగావు. మీరు, నేను కళ్ళుమూసుకు చెప్పినా కొన్ని తప్పక నిజమవుతాయి. కాకుంటే సామాన్య ప్రజలు ఎంతో అమాయకులు; నిజమైన ఆధ్యాత్మికత అంటే ఏమిటో, సద్గురుని సహాయం పారాయణ మొ॥న రీతులలో ఎలా పొందాలో తెలియనివారు ఎందరో వున్నారు. వాళ్ళ అజ్ఞానమే, మూఢమైన భయాలు మరియు ఆశలే ఈ పూనకం—దుకాణాలకు పెట్టుబడి. ఈ గణాచారులు చెప్పినది ఏకొద్ది శాతమో కాకతాళీయంగా నిజమవుతుంది. అది చూచిన వెర్రిబాగులవారు లోకంమీదబడి దండోరావేస్తారు. ఈ గణాచారులకు భారీయెత్తున పూజలు చేసి, సమాజంలో ఈ మూఢనమ్మకాన్ని పెంచుతారు. కొందరి వైఖరి చూస్తుంటే కొందరు దీనిని వ్యాపారంగా కూడా వాడుకొని, వచ్చే లాభాలతో పెద్ద పెద్ద వాటాలు గూడా తీసుకుంటారేమో అనిపిస్తుంది. ఇటువంటి కలియుగ విన్యాసాన్ని, ఈ పూనకాలనూ నిరసించడం గూడ శ్రీ సాయినాధుని అవతారకార్యాలలో ఒకటనిపిస్తోంది. ఇటువంటివి మచ్చుకు మూడు అనుభవాలు చెబుతాను.

"సత్యసాయి మా శరీరంమీదకు వచ్చారు"అనో "మేము సత్య సాయిబాబాగారి మరొకరూపం" అనో చెప్పుకుంటూ చిల్లర మహిమలు కొందరు చేయసాగారు. అదంతా పచ్చిమోసమని, నమ్మవద్దని శ్రీ సత్యసాయి స్పష్టంగా ప్రకటించారు! వారి మాసపత్రికలో గూడ అటువంటి హెచ్చరికలు ఎన్నోసార్లు చేసారు. అయినా ఆయనపేరిట గూడ ఈ తమాషాలు అలాగే కొనసాగుతున్నాయి. (2) కొందరు భక్తురాండ్రు జిల్లెళ్ళమూడి అమ్మ తన వంటి మీదకు వచ్చారని చెప్పుకుంటుండేవారు. అది గూడ అమ్మ శరీరంతో వున్నప్పుడే! అటువంటి ఒకామె తన 'భక్తుల'తో 'ఈ సంగతి మీకందరికీ ప్రత్యక్షంగా నిరూపిస్తాను. మనమందరము అమ్మవద్దకుపోతే ఆమె నన్నెలా

ప్రతిరూపంగా గుర్తిస్తుందో మీరే చూడవచ్చు!'' అని చెప్పి అందరినీ వెంట బెట్టుకుని అమ్మవద్దకొచ్చింది. ఈ నాటక నిర్వాహకులు ఒక్క అడుగు ముందుగా వచ్చి అమ్మతో చెప్పారు. అమ్మ తనయొక్క ఈ ప్రతిరూపం కోసం ప్రత్యేకంగా సింహాసనం వేయించి ఆమెకు కూడ పాదపూజ ఏర్పాటు చేయిస్తుందని వాళ్ళు ఆశించారు. అమ్మ అలాంటివేమీ చేయలేదు. ఆ ప్రతిరూపం రానే వచ్చింది. కాని ఆమెను ఎక్కడ కూర్చోబెట్టాలన్నది ఆమె భక్తులకు అర్థం కాలేదు. ఆమెకోసం ప్రత్యేకంగా కుర్చీవేయబోతే ఆశ్రమంలో వారు అంగీకరించలేదు. చివరకు ఆమెతో అమ్మ యిలా అన్నారు! "నీవే జిల్లెళ్ళమూడి అమ్మనని అందరికీ చెప్పుకుంటున్నావు. కాని నేను జిల్లెళ్ళమూడి కరణంగారి భార్యను కూడ. నీవుకూడ అలానే చెప్పుకుంటావా ఏమీ! ఒకవేళ నీవలా చెప్పినా, నీవు నేను కాజాలవు. కారణం నా భర్తే నాకు దైవం ఆయనకుమించి నాకు వేరొక దైవంలేదు. ఏదేదో ఆశించి ఇంకొకరి భర్తను నాభర్తగా చెప్పుకునే దుస్థితి నాకింకా కలుగలేదు'' అని మందలించారు. అంతటితో ఆ ప్రతిరూపం యొక్క భక్తులకు చిర్రెత్తింది. ఇంకొకరికి కీర్తి ప్రతిష్టలు కలుగుతుంటే ఓర్వలేక అమ్మ అలా బొంకుతున్నారని చాటుకున్నారు. అంత బలీయమైన భ్రాంతులున్నా అమ్మయొక్క ప్రతిరూపమని ఆ 'భక్తురాలు, చాటవలసిన అవసరమేమని ఆ మూఢులకు తోచలేదు. ఇటువంటి ఇంకొకరివద్దకు గూడ నేనెవరో ముందుగా చెప్పా పెట్టకుండా వెళ్ళాను. ఆ 'ప్రతిరూపం' నన్ను కనీసం గుర్తించనైనా లేకపోయింది. ఆమె జిల్లెళ్ళమూడి అమ్మ అయితే నన్ను గుర్తించలేకపోయే ప్రశ్నే లేదు! ---ఇలా ఎన్నో! --- వ్రాసినకొద్దీ వున్నాయి! అయితే, తమనెవరో పూనుతున్నారని చెప్పేవారిలో కొద్దిమంది దగ్గర కొన్ని అద్భుతాలు జరుగుతాయి. వారు చెప్పినవి కొన్ని జరుగుతాయి కూడ. కొన్ని మహిమలూ జరుగుతాయి. కాని అందుకు కారణం దేవతలుగాని, సాయి వంటి మహాత్ములుగాని నిజంగా పూనడంమాత్రముకాదు. పూర్వజన్మలో వారు తీవ్రంగా ఒక దైవాన్ని ఉపాసించడం వలన ఆ పూర్వజన్మవాసనగా ఈ జన్మలోకూడ వారికి మనస్సు ఆ దైవంపై లగ్నమై తాత్కాలికంగా వారందులో లీనమవుతారు. ఆ ధ్యానంలో తన్మయులవుతారు —సినిమా చూచేవారందరూ ఆ సినిమాలో తన్మయులైనట్లు. అపుడా సినిమాహాలంతా ఏ ఒక్క ప్రేక్షకుని



బుర్రలోకి చొరబడదు. ప్రేక్షకుల మనస్సులే తాము చూచే సినిమాలో లీనమై, భావ పారవశ్యం చెందుతాయి. ఇదే పూర్వజన్మలోని వాసనా బలంవలన జరిగినపుడు వారిలో కొన్ని అతీతశక్తులు మేల్కొంటాయి. అందుకు కారణం మనలోని జీవాత్మ నిజానికి పరమాత్మ స్వరూపమే! చక్కెరకుండే తీపి దానితో చేసే వంటకాలన్నింటికీ వచ్చినట్లే. ఆ పరమాత్మలోని శక్తులన్నీ జీవునిలోనూ వుంటాయి. కాకుంటే వాళ్ళ మనసులు బహిర్ముఖమై చంచలంగా వున్నప్పుడు ఈశక్తులు మరుగుపడిపోతాయి— తొట్టిలోని స్వచ్ఛమైన నీటిని బాగా కలియబెట్టినపుడు ఆ తొట్టెకు అడుగువున్నా, అది కనిపించకుండా పోయినట్లు. పూర్వజన్మ సంస్కారం వలన మనస్సు ధ్యానంలో నిలచినపుడు, క్షణికంగా ఈ దివ్యశక్తులలో ఏ కోటి అంశమో తాత్కాలికంగా ప్రకటమవుతాయి. అంతేగాని ఆ సమయంలో వారిలో జొరబడటానికి ఎల్లెడలావున్న పరమాత్మకుగాని, పరమాత్మ స్వరూపులైన మహాత్ములకుగాని సాధ్యముగాదు, అవసరమూ లేదు. ఎవరైనా నిజంగా అలా పూనేటట్లయితే వారు దయ్యాలకువలె అజ్ఞానులేగాని, మహాత్ములు కాజాలరు; ఆ దయ్యాలకు క్షుద్రశక్తులు ఉండవచ్చు; అవి తాము దేవతలమనో లేక మహాత్ములమనో చెబుతూ శక్తులు ప్రదర్శించనూవచ్చు.

దేవతలు పూనడం గురించికూడా యిలానే చెప్పవలసి వుంటుంది. అగ్ని, వాయువు మొ॥న పంచభూతాలు, వాటి అధిదేవతలూ విశ్వవ్యాప్తంగా వస్తుజాలమంతటిలోనూ, అన్ని జీవ దేహాలలోనూ వుంటారు. కారణం సృష్టి అంతా పాంచభౌతికమే. ఇవన్నీ కలసి భగవంతుని యొక్క విశ్వరూపమనే దేహమని శ్రీకృష్ణుడిచ్చిన విశ్వరూప దర్శనము, ఆయన చెప్పిన విభూతియోగమూ, భాగవతమూ, విష్ణుపురాణము మొదలైనవన్నీ చెబుతున్నాయి. దీనినే శృతులు "సర్వం ఖల్విదం బ్రహ్మ" — "ఈసర్వమూ బ్రహ్మమే" ! "ఈశావ్యాస మిదం సర్వం" "ఈ సర్వమూ ఈశ్వరుని మయము"; "ఏకం సత్" "సత్యమైన పరమాత్మ ఒక్కడే" అన్న వాక్యాలలో చెప్పాయి. కనుకనే మన శరీరంలోని వివిధ భాగాలలోనూ అలానే జంతువుల, మరియు వృక్షాల, దేహభాగాలలోనూ వివిధ దేవతలుంటారని శాస్త్రాలు



చెబుతున్నాయి. అటువంటప్పుడు ఏ దేవతలైనా ఏ ఒక్కరినో పూనడము, అంటే ఒక వ్యక్తిలోనికి రావడము, ఎలా సాధ్యం? స్థూలంగా చెప్పాలంటే, ప్రతి రేడియోలోనూ, టి.వి సెట్టులోనూ వేరు వేరు ప్రసారకేంద్రాలనుండి వచ్చే శబ్దాలను, రూపాలను గ్రహించి ప్రకటించే శక్తి సామర్థ్యాలున్నట్లే, ప్రతిజీవిలోనూ అందరు దేవతలూ వుంటారు. అంటే వేరు వేరు దేవతలుగా పిలవబడే దివ్యమైన శక్తి సామర్థ్యాలు గల ఒకే పరమాత్మ అన్నింటిలోనూ వుంటాడు. పూనకాలు నిజమని నమ్మాలంటే వేదాల దగ్గరనుండి మహనీయులవరకూ అందరు చెప్పినదీ అబద్ధమే కావాలి! అలా అయితే నాస్తికత్వం ఒక్కటే నిజమవుతుంది. అప్పుడు గూడ పూనకాలు నిజమయ్యే అవకాశమే వుండదు!! ప్రజలకు ఈ పరమ సత్యం ఎంత త్వరగా తెలిపితే వారిని అంత త్వరగా నిరాధారమయిన భయాలనుండి, ఆశా వ్యామోహాల నుండీ విముక్తులను చేయవచ్చు. వాటి సహాయంతో ప్రజలను అసలైన ఆధ్యాత్మ విద్య నుండి దూరంగా వుంచి స్వార్థం సాధించుకోజూచే వారి గోలను అంతమొందించుకోవచ్చు. అలా గాకుంటే, మానజాతిని ఉద్ధరించగల ఏకైక మార్గమైన ఆధ్యాత్మికవిద్యయే జాతియొక్క నైతిక పతనానికి దారితీస్తుంది.

ప్ర:- *సాయిలాంటి పూర్ణపురుషులను మనసా, వాచా, కర్మణా శరణుపొందితే గత జన్మల కర్మలు, గ్రహబాధలు తొలగించబడతాయి అనే సిద్ధాంతము నిజమా?*

**- ఎమ్. రాధాక్రిష్ణ - హైదరాబాదు.**

జ:- మనలోనూ, అంతటా నిండియున్న ఒక పరమాత్మతత్వమే మనం శరణు పొందిన సద్గురువని గుర్తించి దానిననుసరించి నడుచుకొనడమే శరణు పొందడం. ఇందులో తన అభిప్రాయాలకు, యిష్టాయిష్టాలకు తావుంది. సద్గురువు బోధించిన రీతిన కర్మణా మనసా వాచా అనుక్షణమూ ఏమారక జీవించడము, అందులో వచ్చిన కష్ట నిష్టూరాలను మన ప్రగతి కవసరమైన ఔషధము, అనుపానాలుగా సద్గురువు ప్రసాదించినవని గుర్తించి నడుచుకోవడమే శరణు పొందడమంటే.

ఇలా శరణు పొందడానికి హృదయ పూర్వకంగా ధ్యానము, పారాయణ, భావయుక్తమైన నామస్మరణ, పూజ, సత్సాంగత్యము, మన లౌకిక బాధ్యతలు ఆయన మనకు విధించిన కర్తవ్యంగా త్రికరణ శుద్ధిగా నిర్వర్తించడమూ అవసరము.

ఇలా జీవించ యత్నిస్తూ శరణాగతిని క్రమంగా నిర్దుష్టం చేసుకోవాలి. శరణాగతి సామాన్యంగా ఒక జన్మలో కుదిరేది కాదు. బహు జన్మల అభ్యాసమే యీ జన్మలో కొద్దిమంది మహనీయులలో మనకు కన్పించే శరణాగతి.

ఇలాంటి లక్ష్యంవైపుగా జీవితాన్ని కొనసాగించుకొనే దీక్షగల వారికి పూర్వకర్మ ఫలితాలు, సంస్కారాలూ తాము ఉన్నతి చెందటానికి అధిరోహించ వలసిన సోపానాలవుతాయి. అటువంటి కర్మదోషాలు, గ్రహబాధలు ఎదురైనపుడు సద్గురువును శరణుపొందని వారు రాగ, ద్వేష, అసూయ, భయాది దుష్ట సంస్కారాల చేత ప్రేరేపించబడి పనిచేస్తారు. కనుక తిరిగి మరుజన్మలకు అలాంటి అవరోధాలనే కల్పించుకొన్నవారవుతారు. అంతేగాదు తిరిగి తిరిగి అలా అవరోధాలను కల్పించుకోవడమే అభ్యాసము, లేక సంస్కారంగా ఏర్పడుతుంది. కనుక కర్మలు, గ్రహబాధలు సద్గురు భక్తుడికి సోపానాలు. కనుక వాటికా పేరు యిక తగదు. అంతేగాని ప్రత్యక్షంగా, స్థూలంగా ఫలితాలు తొలుగుతాయని గాదు. ''చేసిన కర్మఫలం అనుభవింపక ఎన్నటికీ ఆగదు.'' అని నారికురుపుతో బాధపడుతున్న డా॥పిళ్ళేకు సాయిచెప్పినది మరువకూడదు. పామరుల కర్మగ్రహ బాధలు ప్రాణాలు, తీసే విషంవంటివి; సద్గురు భక్తులకు అవే రోగాలు తగ్గించే మోతాదులు. నిపుణుడైన వైద్యుడుపయోగించే పాషాణాది ఔషధాలు నాశనానికి, రక్షణకు కూడ కారణమవగలవు. బాగా చదివేవాడికి పరీక్షలు పైకి పోయేందుకవసరము. చదవని అనర్హులు అక్రమంగా పై తరగతికి పోకుండా అవరోధం.

'కర్మ' అనే పదం ఏ కార్యకారణ సూత్రాన్ని తెలుపుతుందో 'గ్రహబాధ' అన్నపదం దానినే ప్రత్యక్షంగా జన్మాంతరజ్ఞానంలేని వారు ఉరామరీగా అంచనావేసే పరోక్షపద్ధతియైన 'జ్యోతిషశాస్త్రం' సూచిస్తుంది. ఒకటి పొడుగును అంగుళాలలో కొలిస్తే యింకొకటి సెంటీమీటర్లలో కొలుస్తుంది.

*ప్ర:- మీరు దత్తాత్రేయుడు సంపూర్ణమైన భగవదవతారమని, సద్గురువులందరూ ఆయన రూపాలేనని, అట్టివారిని ఆశ్రయించక మోక్షమేలేదని వ్రాస్తున్నారు. నా మిత్రులొకరు దత్తస్వామి యోగనాధుడు మాత్రమేనని, యోగము షడ్దర్శనాలలో ఒక్కటి మాత్రమే గనుక సాంఖ్యాది ఇతర సాంప్రదాయాలకు ఆయన గురువు కారని, ఆయన గురించి వేదాలలో ప్రస్తావన లేదని, ఆయన గురించి ఒక్క ఉపనిషత్తుకూడ లేదనీ, దశావతారాలలో ఆయన పేరు లేదని కనుక ఆయన సంపూర్ణమైన భగవదవతారము కాదని, మనకు శ్రీకృష్ణుడొక్కడే ప్రమాణమని అంటున్నారు మీ సమాధానమేమిటి?*

జ- శ్రీకృష్ణుడు మనకు ప్రమాణమని అంగీకరిస్తే సృష్ట్యాదిలో వివస్వంతుడు - మనువు - ఇక్ష్వాకులకు తననుండి ప్రాప్తించి తర్వాత కాలాంతరములో శిధిలమైన యోగవిద్యను తాను మరల బోధిస్తున్నానని అర్జునుడికి బోధించిన యోగవిద్యకూ, మీ మిత్రులుతలచే యోగవిద్యకూ సంబంధమేలేదు. సర్వకాల సర్వావస్థలలోనూ చలించని సమత్వము, యజ్ఞ-దాన-తపః కర్మలనుండీ యుద్ధాది స్వధర్మాచరణదాకా అన్నింటినీ అట్టి భావముతో నిర్వహించే కౌశలమే యోగమనీ చెప్పాడు శ్రీకృష్ణుడు. దానివల్లనే మీమాంసలో చెప్పబడిన కర్మ, కల్పంలో చెప్పబడిన యజ్ఞాదులు ఉత్తమ పురుషార్థాలవుతాయని కృష్ణునిభావం. జీవితమంతటినీ పరమార్థ సాధనంగా మార్చేదే యోగమని ఆయన భావం. ఆయన బోధను గ్రంథాసం చేసిన వ్యాసుడికి అది సమ్మతమే. కనుక శ్రీ దత్తాత్రేయుడు యోగనాధుడన్నపుడు సకల మోక్షవిద్యలకు ఆయన మూల పురుషుడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర పరబ్రహ్మలేకమైన విశ్వజనీనమైన గురు స్వరూపమాయన. రావణ దుర్యోధనాది దానవ సంహరణ, భూభార నిర్వహణాది పరిమిత కార్యాన్ని నిర్వర్తించేవాడు గాదు. కనుకనే ఆయన తనను తాను దత్తంచేసుకున్న అయోనిజ సంభవుడు. గీతా శాసనాన్ననుసరించి జన్మించిన ప్రతివారూ మరణించవలసినదే. కాని శ్రీ దత్తాత్రేయుడు మరణ రహితుడు. విశ్వసృష్టి వికాసంకోసం తపస్సు చేసిన అత్రి, అనసూయల తపఃఫలం. ఆయన పూర్ణావతారం కాకుంటే యింకెవరు? ఈయన కార్తవీర్యార్జునుడికి అష్టాంగయోగము, యదు ప్రహ్లాదులకు అవధూత రూపంలో జ్ఞానమార్గాన్ని బోధించినవాడు.



ఇక పురాణాలలో అవతారంగా ఆయన పేర్కొనబడలేదనడం అసత్యం. హరివంశము, విష్ణుపురాణము, భాగవతములలో దత్తాత్రేయుడు మత్స్య, కూర్మ, కృష్ణఅవతారాలతో సమంగా పేర్కొనబడ్డాడు. భారతము (శాంతి పర్వములోని తొమ్మిదింటిలో ఆయనలేడుగదా అంటే, తక్కిన అష్టాదశ పురాణాలకూ మూలమనదగు విష్ణుపురాణంలో దత్తావతారమున్నది. కృష్ణావతారమేలేదు! భారతము-వనపర్వము ప్రకారం భగవంతుని అవతారాలు, లేక ప్రాదుర్భావాలు అనంతము)

శ్రీ దత్తాత్రేయుణ్ణి గురించి ఉపనిషత్తు లేదనడం సరిగాదు. శ్రీ దత్తాత్రేయోపనిషత్తు వున్నది. శాండిల్యోపనిషత్తూ ఈయన బ్రహ్మ, విష్ణు, శివ, సకలదేవతామయుడుగా కీర్తిస్తుంది. అవధూతోపనిషత్తు గూడ ఆయననే కీర్తిస్తుంది. అవధూతయన్న నామము ఆయనయందే పూర్ణమైనట్లు యీ ఉపనిషత్తు చెపుతున్నది.

ఇక ఒక్క సమాధానంచాలు. శ్రోత్రియతకు మారుపేరనదగిన వాసుదేవశాస్త్రి యనే మహాపండితునితో శ్రీ గోవిందస్వామి దత్తోపాసన చేయమంటే ఆయన "నేను వైదికుణ్ణి, సూర్యఅగ్నులనుపాసిస్తున్నాను, మరల దత్తోపాసన ఎందుకు? అన్నారు. కాని చివరకు యీయన దత్తోపాసకులై సర్వ పురాణాంతర్గములైన దత్త కథలను క్రోడీకరించి "శ్రీదత్త మహాత్మ్యము", "శ్రీదత్త పురాణము" అన్న గ్రంథాలే గాక "శ్రీదత్తాత్రేయ వేద పాదస్తుతి"ని వ్రాశారు. ప్రామాణికము గాకుంటే ఆయన అలా చేసియుండరు.

ప్ర :- **అందరి జ్ఞానేంద్రియాలు ఒకే నిర్మాణం కలిగియున్నవుడు వాటిచేత ప్రభావితమయ్యే మనస్సుల తత్వాలు ఎందుకు భిన్నంగా వుంటాయి?**

**- సి. హెచ్ లక్ష్మీనారాయణ, సంగారెడ్డి.**

సృష్టి ప్రళయంఅన్నవి ఆద్యంతాలు లేకుండా తిరిగి తిరిగి జరుగు తుంటాయని, ప్రళయానికి ముందున్న జీవులన్నీ వాటి కర్మలననుసరించిన కర్మఫలాలను, సంస్కారాలనూ అనుసరించి తర్వాత సృష్టిలో ఆయా గుణాలు కల్గిన జీవులుగా, వాటి కర్మఫలాలను ప్రసాదించ సమర్థమైన పరిస్థితులలో, యోనులలో జన్మిస్తాయని, అక్కడ నుండి మరలా జననము - కర్మ -



కర్మఫలము + సంస్కారము- మరణము-జన్మ అనే గొలుసు ఎల్లకాలం కొనసాగుతుందని ఋషులు చెప్పారు. సంస్కార, గుణభేదాల ననుసరించి సత్త్వ రజస్తమో ప్రధానమైనవిగా జీవులను విభజించవచ్చు- అవి చేసిన మానసిక (భావాలు) వాచక (సత్యాసత్య, వ్యర్థ, దుష్టభాషణలు), కాయిక (ధర్మబద్ధంగా ఆర్జించబడిన శుద్ధమైన ఆహారాన్ని మాత్రమే భగవంతునికీ, ఆయన రూపాలుగా తలచి సాటి జీవులకూ పెట్టడముగాని, లేక తద్విరుద్ధమైన జీవనంగాని) కర్మలనుబట్టి జీవులలో ఆయా గుణాలు మరింత బలీయమవుతాయి. ఇవే సంస్కారాలు, వాసనలు. వీటి సమిష్టి రూపమే మనస్సు కనుక వ్యక్తికి వ్యక్తికి భిన్నంగా వుంటాయి. మానవస్థాయిలోనే ఇలాంటి భేదముంటుంది. కారణం తక్కిన తిర్యగాదులలో లేని యోచనా, అవగాహనశక్తులు మనిషికుంటాయి. జంతువులలో అవి తాత్కాలికమైన జీవితావసరాలకు పరిమితమై మాత్రమే పనిచేస్తాయి. మనిషిలోని యోచనలలో చాలా స్వల్పభాగం మాత్రమే జీవితావసరాల గురించి వుంటాయి. వ్యక్తుల వస్తువుల గురించిన అభిప్రాయాలు, భూత భవిష్యత్తులను గురించిన ఆశలు, భయాలు, జీవితపు విలువలపట్ల విభిన్న దృక్పథాలు, వాటివలన కలిగిన భేదాభిప్రాయాలు వాటన్నింటిపట్ల మమకార ద్వేష అసూయాదులు వుంటాయి. ఉదాహరణకు మత, జాతి, వర్ణ, భాష, ప్రాంతీయ భావాలు ఉచ్చనీచాలు మొదలైనవెన్నో ఉంటాయి.

వీటన్నింటికి మూలం యోచనే - అవగాహన పెరిగినకొద్దీ యోచన నిర్దుష్టమై, మంచిని గుర్తించి, ప్రేమించి, ఆచరించి, వృద్ధి చెందించుకునే సామర్థ్యము మనిషికున్నది. అయితే అంతా కర్మఫలాన్ననుసరించే జరిగితే యిక మార్చుకునే స్వేచ్ఛ ఎక్కడిదీ అన్న ప్రశ్న రావచ్చు. మన అవగాహన పెరిగితే కర్మఫలంగా జరిగి తీరవలసిన సంఘటనపట్ల, వాటి కారకులనుకున్న వారిపట్ల భావాలు మారతాయి. ఈ మార్పు వారి ప్రతి క్రియలను, వాటికి మూలమైన సంకల్పాలనూ మార్పు చేయిస్తుంది. ఉదాహరణకు **విశ్వమంతా భగవంతుని రూపమన్న అవగాహనను నిత్య సత్సాంగత్యము, పూజ, ధ్యానము, సద్గ్రంథ పఠనలతో దృఢం చేసుకుంటే, మనకు చెడు చేసేవాడు అజ్ఞానం వలన,**



మన ఋణానుబంధం వలన అలా చేస్తున్నారని, ఆరూపంలో మనమిది వరకు అజ్ఞానంలో చేసినదానికి ప్రతిఫలం మనమే అనుభవిస్తున్నామని గుర్తుండి యథాశక్తి ఆ చెడును తప్పించుకోడానికి, ఆ వ్యక్తులను ప్రేమతో, అవగాహనతో సంస్కరించుకోడానికి యత్నిస్తాము. అయినా వారు చెడుచేస్తే ఓర్పుతో ప్రేమతో ఊరకుంటాము. భాగవతంలోని భిక్షుగీత యీ తత్వాన్ని చక్కగా చిత్రిస్తుంది.

కనుక యీ యోచనలోని భేదంవలన వస్తువుల, వ్యక్తులపట్ల మన భావాలను దానినిబట్టి వాటిపట్ల మన ఆచరణ ఉంటాయి. ఇదే వ్యక్తులమధ్య భేదానికి కారణం. ఈ జీవిత కార్యంలో జ్ఞానేంద్రియాలన్నవి నిమిత్తమాత్రమైన పనిముట్లు మాత్రమే. యోచనాత్మకమైన మనస్సులో భేదాన్ననుసరించి జ్ఞానేంద్రియానుభవాల ప్రభావం భిన్నంగా ఉంటుంది.

**ప్ర :- *'ఓమిత్యే కాక్షరం బ్రహ్మ' అన్న వేదవచనానికి 'ఆదియందు వాక్యముండెను; వాక్యము దేవునియొద్ద ఉండెను; ఆ వాక్యమే దేవుడు' అన్న బైబిలు వాక్యానికీ సారూప్యమున్నదా?***

***- బి. నా. రా. చీరాల.***

**జ :-** ఈ రెండు వాక్యాలకూ సంబంధమేమీ లేదు. 'అ, ఉ, మ' కారాల ఏక స్వరూపమైన 'ఓమ్‌కారము 'మూడు వేదాలకు, త్రిమూర్తులకు, భూత భవిష్యద్వర్తమానాలకూ, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకూ - వీటి ఐక్యతకూ చిహ్నము. వీటన్నిటి సమగ్రరూపమే బ్రహ్మ అని వేద వాక్యార్థము. అర్ధతన్మాత్ర తురీయానికి చిహ్నము. ఇక్కడ ఓంకారమంటే 'వాక్కు' లేక 'వాక్యము' అని అర్థముగాదు. అక్షరమంటే 'క్షరము' లేక 'నాశము' లేనిదన్న అర్థంలో 'బ్రహ్మ' అవుతుంది. ప్రణవం బ్రహ్మతత్వాన్ని చెప్పే వాక్యమిది.

బైబిలులోని వాక్యంలో 'వాక్యము' అన్నది గ్రీకు భాషనుండి ఆంగ్లంలోకి, ఆంగ్లం నుండి తెలుగులోకి అనువదించడంలో వచ్చిన అపోహ యిది. మూలంలోని గ్రీకు పదానికి 'సంకల్పము', 'ప్రేరణ, 'ఇచ్ఛ' అని అర్థము. మొదట అద్వయుడుగా వున్న పరమాత్మ 'నేననేకమగుదునుగాక' అని సంకల్పించి, అనేకమైనాడు అన్న శృతి వాక్యానికి సంబంధించినది బైబిలు వాక్యము. ' ఆ సంకల్పం భగవంతునిలో వుండెను. కనుక ఆయనయే



అయియుండెను' అని ఆమాటకర్థం. భగవంతుని అద్వయమైన తత్వాన్ని తెలిపేది వేదవాక్యమయితే, ఆయనకు విశ్వరూపంలో ప్రకటమవుదామని కల్గిన తలంపును గురించి బైబిలు వాక్యము చెబుతుంది.

*ప్ర:- **కుటుంబ నియంత్రణవలన దుర్లభమైన మానవ జన్మకు అవకాశంలేకుండా చేస్తున్నాము కనుక పాపమంటున్నారు పెద్దలు నిజమా?***

**- ఎ. యం. రావు, హైదరాబాదు.**

జ:- చిన్న శస్త్ర చికిత్సతోనే జీవుల కర్మను మార్చగల్గితే యిక శస్త్రాలే దైవాలవుతాయి. అనివార్యంగా, యుగధర్మంగా వచ్చే యిటువంటి సాంప్రదాయాలన్నీ జీవుల సమిష్టి కర్మఫలంగానే వస్తాయి. కనుక పాపమేమీ గాదు. సంతతి గల్గవలసియున్నప్పుడు ఆ తల్లిదండ్రులకు కుటుంబ నియంత్రణ చేసుకోవాలన్పించదు. అలాగాక కుటుంబ నియంత్రణవలన అలా జీవుల కర్మను మార్చవచ్చుని, అది పాపమనీ తలుస్తే, పెంచి పోషించగల సామర్థ్యానికి మంచి బిడ్డలను కనిపోషించలేకపోవడం యింకా పాపం. 'నారు పోసినవాడు నీరు పోయడా?' అని అప్పుడు మాత్రం చెప్పేది మెట్ట వేదాంతం. నారు పోయవలసినది (కుటుంబ నియంత్రణ చేసుకొనక బిడ్డలను పుట్టించేది) మానవుడే అయితే నీరు పోయవలసినదీ వాడే. ఆపక్షంలో కుటుంబ నియంత్రణ విషయం నిర్ణయించే బాధ్యత మనిషిదేగాని అందులో వేరే పాపమేమీ వుండదు. నారుమాత్రం మనం పోస్తాం-నీరుమాత్రం దైవం పోయాలన్నది మిథ్యావాదం. పాపంలేని కుటుంబ నియంత్రణ దంపతులిద్దరికి యింద్రియ మనోనిగ్రహం కల్గియుండడమే. అది లోపించాక బిడ్డలను కనడం పుణ్యంగాని, కనకుండడం పాపంగాని కాజాలదు.

*ప్ర :- **ఈ మధ్య పెద్దలొకరు శంబళంలో అవతార పురుషుడు జన్మించారని చెప్పారు. అది నిజమేనా? అంటే కలియుగమైపోయి కృతయుగం త్వరలో రానున్నదా?***

***-శ్రీమతి శారదావివేక్, సికిందరాబాద్***

జ :- ఎంత ఆలోచించినా ఆ విషయం అంత ప్రస్తుతము కాదని నాకు తోస్తుంది. అందులో రెండంశాలున్నాయి (1) అవతరించిన మాట నిజమా! (2) ఆ విషయం మన కెంతవరకూ వుపయోగం?



1) ఇంతకు ముందే ఎన్నోసార్లు `ఇదిగో అవతరించాడు` అంటే `అదిగో అవతరించాడు` అంటూ ఎందరో వ్రాశారు. కాని యింతవరకు అవి తృప్తికరంగా నిజమైనదంటూలేదు. శ్రీ మెహర్‌బాబాయే యీ యుగావతారమని, శ్రీ సత్యసాయిబాబాయేనని, శ్రీ జిడ్డు కృష్ణమూర్తియే రానున్న అవతార పురుషుడని యిలా యింకెందరి గురించో వారి వారి భక్తులంటున్నారు. కనుక యిలాంటి మాటలు ఎంతవరకూ నిజమో మనకు తెలుసుకునే అవకాశమే లేదు. ప్రతివారు అటు గుడ్డిగా నమ్మటమో, కాదనడమో జరుగుతుంది. ప్రతి భక్తుడు తాను నమ్మిన మహనీయుడే భగవత్స్వరూపమని గూడ నమ్మడం సహజం గూడ. (ii) చాలా ఆలోచిస్తే యీ ప్రశ్న అప్రస్తుతమనిపిస్తుంది. ఒకవేళ భగవంతుడవతరించినా ఆయన రక్షించబోయేది శిష్టులనే. అంటే చక్కటి నైతిక వర్తన కలిగియున్న వాళ్ళనే. దైవం అవతరించకున్నా మన కర్తవ్యమదే. ఆ కర్తవ్యం నెరవేర్చినపుడు, భగవంతుడు అవతరించినా, అవతరించకున్నా మనకు ఆయనయొక్క అనుగ్రహం లభిస్తుంది. ఇక మనకు ఆ ప్రశ్న అప్రస్తుతమే గదా!

ఇక యుగాల ప్రసక్తిగూడ అంతే. నైతిక పరివర్తన చెంది సాధన చేసేవారికి యీ కలియుగం చక్కని అవకాశమని, యితర యుగాలలో ఎంతో శ్రమిస్తేగాని రాని సత్ఫలితం యీ యుగంలో స్వల్ప యత్నంతో లభిస్తుందని "శ్రీ గురుచరిత్ర" చెబుతుంది. నిరంతరం భగవంతుని శరణుజొచ్చి స్మరించినవారిని కలిమలం అంటలేదని శాస్త్రం. అంటే సాధన చక్కగా చేసేవారికి కలియుగంలోగూడ సత్యయుగమే. అలాగాని వారికి సత్యయుగంలో గూడ కలియుగమే అవుతుంది. త్రేతాయుగంలో రాముని అవతారకాలం గూడ రాక్షసులకు ఏమి వినియోగపడింది కనుక? ఇక రాబోయేది ఏ యుగమైనా మన కర్తవ్యమొక్కటే. ఇటువంటి ప్రశ్నలు సాధననుంచి మనస్సును మరల్చడంకంటే చేయగల్గినదేమున్నది. మనకు లభించిన సమర్థసద్గురు సాయినాథుని సేవ, చరిత్ర పారాయణ "గురుచరిత్ర పారాయణలను సార్థకం చేసికొనడం మనకు చాలు.



**ప్ర :- "శ్రీపాదవల్లభ, దిగంబరా!" అన్నట్లే భక్తులు "సాయి దిగంబరా" అంటున్నారు. దిగంబరా అంటున్న నామం ఎవరికి వర్తిస్తుంది? సాయి దిగంబరుడెలా అయ్యాడు?**

**- సుధామయి, విజయవాడ.**

జ :- దిగంబరుడంటే, 'దిక్కులే వస్త్రాలుగా గలవాడు' అని అర్థము. దీనికి పామరులు వస్త్రాలు ధరించనివాడు అని అర్థం తీసుకుంటున్నారు. అది సరిగాదు. పిచ్చివాళ్ళు, తప్పతాగిన వాళ్ళు, పసిపిల్లలూ గూడ వస్త్రాలు లేకుండా గూడ వుండవచ్చు. కానీ వారిని ''వివస్త్రులు'' అని మాత్రమే అనాలి.

వేదాంతములో ఆకాశమే బ్రహ్మముయొక్క స్థూల రూపమని చెప్పబడింది. దానికంటే సూక్ష్మముగా ఉంటుంది దేశ కాల భేదాల కతీతమై సర్వత్రా, సర్వదా నిండియుండినది బ్రహ్మము. బ్రహ్మము వలె ఆకాశముగూడ సూక్ష్మము, అవికారము, సర్వగతమూ అయి దేనికీ అంటనిదై యుంటుంది. కానీ ఆకాశము ప్రళయములో నశించి మరలా సృష్ట్యారంభములో ఏర్పడుతుంది. బ్రహ్మమలాకాదు, అది శాశ్వతము. అవినాశి. ఆకాశము జడము, బ్రహ్మము చైతన్యము. అందుకే ఆకాశము బ్రహ్మముయొక్క ఆచ్ఛాదనము లేక వస్త్రముగా చెప్పబడినది. అందుకే ధ్యానములో శూన్యములో గోచరించే చిదాకాశము అనుభవమవుతుంది దాని కతీతంగా సాక్షి కేవలమైన ఎరుకగా ఆత్మ బ్రహ్మముంటుంది. కనుక బ్రహ్మానికి ఆకాశమే ఆచ్ఛాదనమని చెప్పబడుతుంది. అట్టి బ్రహ్మమే తానని ఎవడు స్థిరమైన అనుభవంతో తెల్సుకుంటాడో అతడే బ్రహ్మమయి ఉంటాడు. అతని వస్త్రము ఆకాశమే అయి ఉంటుంది. ఆ స్థితి పొందినవారికి సర్వత్రా బ్రహ్మమే అనుభవమవుతుంది. కనుక వారికి తమను అన్యులు చూస్తారని, అది ఏహ్యమనిఅనిపించదు. అట్టి బ్రహ్మీస్థితి సహజమయిన వారికి కృత్రిమమైన వస్త్రధారణ దుర్భరము అవుతుంది. వస్త్రము అజ్ఞానానికి చిహ్నము. అజ్ఞానంవలన తానే దేహమని, ఇతరులు తనకుండి వేరుగా వుంటారని తలచే అజ్ఞునకు మానావమానాలు, శీతోష్ణాలుంటాయి. మనో వికారా లుంటాయి. వాటి నుండి తమను రక్షించుకోడానికి వస్త్రధారణ అవసరము అవుతుంది. దానితోబాటు అందమైన వస్త్రాలపట్ల భ్రాంతికూడా కలుగవచ్చు.



మొత్తముమీద వస్త్రాలు అజ్ఞానానికి చిహ్నము. కానీ భగవంతుడు మానవాకృతిలో అవతరించినప్పుడు భక్తులపైన వాత్సల్యంతో వారికర్థమయ్యే స్థాయిలో వారితో వ్యవహరించడానికి అజ్ఞానమనే వస్త్రాన్ని, దాని ప్రతిరూపమైన నశ్వరమైన దేహాన్ని ధరిస్తాడు. కానీ ఆంతర్యంలో సర్వగతమైన బ్రహ్మమే అయి వుంటాడు. అంటే దిగంబరుడై యుంటాడు! అందుకే శ్రీ పాదవల్లభులు, శ్రీ సాయిబాబాకూడ దిగంబరులే. మహనీయులలో కూడ ఎవరు సామాన్య మానవులతో కలిసి జీవించి, వారిని సన్మార్గానికి ఆకర్షించడానికి దేహం ధరిస్తారో వారు గూడ స్వతహాగా దిగంబరులైనప్పటికీ వస్త్రాలు ధరిస్తారు.

అంతేగాక ఆకాశమువలె బ్రహ్మము గూడ సర్వగతమన్నాము. అవి రెండూ ఎల్లప్పుడూ మనము ఎక్కడ గుర్తిస్తే అక్కడే వున్నాయి. సర్వగతులైన శ్రీపాదవల్లభులు, శ్రీసాయి గూడ మనమెప్పుడు ఎక్కడ స్మరిస్తే - అంటే గుర్తిస్తే-అక్కడే ఉంటారు. అట్టివారినే దిగంబరులంటారు. వారి భౌతిక శరీరము నశించినంతమాత్రాన వారి ఉనికికి భంగముండదు. కనుక దిగంబరుడంటే సర్వగతుడూ, ఎక్కడ స్మరిస్తే, గుర్తిస్తే అక్కడనే వున్నవాడు అని అర్థము. ఎప్పుడు ఎక్కడ దేనిని గుర్తించినా గుర్తింపు జరిగేది మన హృదయంలోనే! అక్కడగూడ ఆ దిగంబరుడే వుంటాడు. కనుక దిగంబరుడంటే సర్వభూత హృదయగతుడు అని గూడ అర్థం. అసంఖ్యాకమైన సాయి లీలలన్నీ ఈ నామాన్ని సార్థకం చేసేవే గనుక సాయి దిగంబరుడు కాకుంటే యిక దిగంబరియనదగిన వారేలేరు.

ఇది తెలియక పరిపూర్ణమైన మహాత్ములుగా గుర్తింపబడి పూజింపబడాలని కోరేవారుగూడ, వివస్త్రులై సంచరిస్తే అట్టివారు బాహ్యదృష్టికి దిగంబరుల్లా కనిపించినా నరరూపంలో సంచరించే పశుపక్ష్యాదులే సుమా!

ప్ర :- ***పునర్జన్మ గురించి హిందువులతో మాట్లాడిన బాబా ముస్లింలతో ఎందుకు మాట్లాడలేదు?***

- ***ఎ. ఆదినారాయణరెడ్డి,*** పెనుబల్లి.

జ:- పునర్జన్మ ఉన్నాలేకున్నా మానవుడి కర్తవ్యమొక్కటే-ధర్మాచరణ. ఆధ్యాత్మవిద్య మనకు ఇతరుల వలనగాని కల్గిన దుఃఖాలకు కృంగక, యితరులపై ద్వేషం పెంచుకొని మరలా కర్మ శృంఖలాలు తగిలించు కొనకుండా, మన కర్మలే ఆ సుఖ దుఃఖాలకు కారణమని తలచి ఆత్మ



సంస్కరణ కలిగిస్తుందని ఆ సిద్ధాంతాన్ని మన ఋషులు చెప్పారు. అకారణంగా వారు మనకందించిన విద్యనే సాయి హిందువులకు చెప్పారు. కష్ట సుఖాలు మనలను సరియైన రీతిన మలచడానికి దైవమే చేస్తాడని తలచినా, అటువంటి ఓరిమే ఆయన ప్రీతికి పాత్రులమవ్వాలన్న సంకల్పాన్ని కలిగిస్తుంది. ధర్మాచరణకు ప్రేరేపిస్తుంది. ఈ విషయాన్ని యిస్లాము, క్రైస్తవమూ చెప్పాయి. పామరుల కంతుబట్టని విషయాలు చెప్పడమనవసరమని వారి భావం. ఈ జన్మ వృథా చేసుకున్నా మరుజన్మ నయినా సార్థకం చేసుకోవచ్చన్న ఆలోచనను, యత్నాన్ని పుట్టిస్తుంది జన్మ సిద్ధాంతము. ఈ అవకాశం జారిపోతే యిక మరలా రాదన్న తీవ్రత నిస్తాయి యిస్లాము, క్రైస్తవమూ. రెండింటిలోనూ లాభాలు, నష్టాలు ఉన్నాయి. ఆయా సాంప్రదాయాల వారికి తద్భిన్నంగా చెబితే వూరికే సందేహాలు, భావనలు, ద్వేషాలు రేకెత్తుతాయి గాని ప్రయోజన ముండదు; సరిగదా వారివారి కర్తవ్యం నుండి మానవులు ఈ వాదాలలోకి దిగుతారు. కనుకనే అట్టి భేదబుద్ధి సామాన్యులకు జ్ఞానియైనవాడు కల్గించక వారికెలా చెబుతే కర్తవ్యమాచరిస్తారో ఆరీతినే చెప్పాలనే భగవద్గీత చెబుతుంది. "దానితో వారికేమి పని? సత్యం బోధించాలిగదా? అనడం అజ్ఞానమే. శ్రేయస్సును చేకూర్చే అసత్యమే సత్యమని, శ్రేయస్సును పాడుచేసే సత్యం గూడ అసత్యమేనని, మహాభారతంలో కృష్ణుడు చెప్పాడు. ఆలోచిస్తే అది నిజమే గూడ. మీరు తలచిన రీతిన హిందువులకు జన్మలేదని గాని, ముస్లింలకు జన్మలున్నాయని గాని చెప్పడం వలన ఆయా మతస్థులు గందరగోళ పడతారేగాని ప్రయోజనమేమీ వుండదు. సాయి చెప్పినట్లు చెబుతేనే ఏ ధర్మానికి చెందినవారు ఆ ధర్మాన్ని శ్రద్ధగా ఆచరించి కృతార్థత పొందగలరు.

ఈ రెంటిలో ఏదో ఒక్కటే సత్యం కాగలదనీ, దానినే ఆయన చెప్పాలనడం సత్యంయొక్క తత్వం తెలియకపోవడం వల్లనే. ఒక్క ఆత్మజ్ఞానం వినా మిగిలినవన్నీ సాపేక్షికసత్యాలే. హిందూధర్మము కూడా ఒకవంక మనకు జన్మ పరంపరలున్నాయని చెబుతూనే, మరొక వంక యిది అవిద్యయని, జనన మరణ రహితము - కనుక పునర్జన్మ రహితమయినదే అసలైన ఆత్మయని కూడ చెప్పబడ్డది - ఒక వ్రాత బల్ల చిన్న పిల్లవాడికి ఎత్తైనదిగాను,

వాడే పెద్దవాడయినప్పుడు ఎత్తు తక్కువగానూ తోచినట్లు. అందుకే అధికారి భేదాన్ని బట్టి బోధించగల్గడమే గురువు యొక్క నైపుణ్యమని శాస్త్రం చెబుతుంది. ఈ సూక్ష్మాన్ని గుర్తించని మన విద్యావిధానంలో నానాటికీ విద్యా ప్రమాణాలు దిగజారడం చూస్తాము. వీనిని గుర్తించిన వర్ధమాన దేశాలలో నానాటికి విద్యా ప్రమాణాలు పెరగడం చూస్తాము. **సాయి చేసినదేదైనా వేదవాక్యమే, ధర్మశాసనమే సుమా?** అందుకే లోకాల గురించి సాయి పెద్దగా పట్టించుకోలేదు. మన కర్తవ్యం దృష్ట్యా అది అప్రధానము కాకుంటే ప్రకృతి యంతటిపైనా శ్రద్ధాభక్తులున్న వారికి గతించిన వారిపట్లా, లోకాల పట్ల లోకాధిపతులపట్లా పూజ్యభావాన్ని వ్యక్తం చేసుకొనే పద్ధతే శ్రాద్ధాది కర్మల లక్ష్యం. అవి ఏదో ఒక రీతిన అన్ని మతాలవారికి వారి వారి దేశ కాల పరిస్థితుల ననుసరించి ఆయా మతాలు చెప్పాయి. జీవితవనరులు తక్కువయిన జాతుల వారి మతాలలో అది క్లుప్తంగా వుంటుంది. వనరులు సమృద్ధిగా వుండే మనదేశంలో అది విపులంగా వుండి సాటివారిని భోజనదానాదులతో తృప్తి పరచేదిగా వుంటుంది. వీటి విషయం నేను వెనుకొక పరిప్రశ్నలో చర్చించాను.

ప్ర :- ***వేద విద్య వలన దేశానికిగల ప్రయోజనమేమి?***

***- రామచంద్రరావు, కపిలేశ్వరపురం.***

**జ :-** నేటి విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలను వినియోగించుకోగలగాలంటే తగిన విద్యా విధానమవసరము. అందులో అట్టి సిద్ధాంతము (థియరీ) ఇట్టి ప్రయోగము కూడా (ప్రాక్టికల్) అవసరం. ఈ రెండు అర్థంకావాలంటే గణిత శాస్త్రము, భౌతిక రసాయనిక శాస్త్రాలు, తర్కము (లాజిక్) మొ॥న వెన్నో తెలియాలి. అలానే వేదవిద్య వుపయోగపడాలంటే సిద్ధాంతము కావాలి. దానిద్వారా ఈ సృష్టితత్వము, మానవుని శారీరక, మానసిక తత్వాలను తెలుసుకోవచ్చు. అవి తెలిశాక ఈ రెంటినీ సమన్వయించుకొన్న కొన్ని ప్రయోగాల వలన మన చేతనాన్ని వికసింపజేసుకోవచ్చు. అప్పుడు మానవుడు మిగిలిన ప్రకృతితో సామరస్యంగా జీవించగల సహజ నైపుణ్యం గలవాడవుతాడు. అపుడు జాతి మనుగడకు అవసరమైన ప్రకృతి వనరులను సంరక్షించుకోగల్గుతాడు. వాటిని అటు ప్రకృతికి యిటు తన జాతికి



వినాశకరంగాని రీతిన వినియోగించుకోగల్గుతాడు. అందుకవసరమైన దివ్యమైన ప్రేమ ప్రకృతిలోని వస్తువుల, ప్రాణులపట్ల వహించడం చేత అతని జీవితం గూడ ప్రేమమయమవుతుంది. తృప్తి మానవజీవిత లక్షణమవుతుంది. అప్పుడు స్వార్థము, అసూయ, ద్వేషము పలుచబడతాయి. అశాంతి తొలుగుతుంది. ఆధునిక విజ్ఞానము, సాంకేతిక విద్య బాహ్యమైన జీవితాన్నీ, ప్రకృతిని సంస్కరించుకొనే వుపాయాలవుతే వేదవిద్య మానవుని ఆంతరంగిక ప్రకృతిని సంస్కరించుకొనే ఉపాయం. మొదటి రెండూ మానవుడు తన పరిసరాలను మార్చుకొనే పద్ధతి; రెండవది వాటిని దూరదృష్టితో సద్వినియోగం చేసుకొని వినోదకరమైన పంథా త్రొక్కకుండా చూచుకునే పద్ధతి. అయితే మొదటిరకమైన విద్య కెంత ప్రత్యేకమైన తర్ఫీదవసరమో రెండవదానికీ అంతే అవసరం. ప్రాచీనకాలంలో మొదటిదానిని అశ్రద్ధ చేసి రెండవదానికి మాత్రమే ప్రాముఖ్యమివ్వడం పొరపాటు. ఈనాడు అందుకు విపర్యయమైన పొరపాటు జరుగుతుంది. ప్రకృతి తల్లి. మానవుడు బిడ్డడు అనుకుందాము. కేవలం బాహ్యవిద్యకే ప్రాముఖ్యమిచ్చే మానవుడు తల్లిని ప్రేమించక ఆమె ప్రేమను పచ్చి స్వార్థంతో హృదయం లేకుండా వాడుకొనేవాడవుతాడు. తల్లిచాటునుండి అన్నీ పొందినా ఆమె ప్రేమ నర్థం చేసుకొని ఆనందించే అదృష్టంలేని దౌర్భాగ్యుడవుతాడు. వేదవిద్య గూడ నేర్చుకొనేవాడు తల్లినుండి సర్వాన్నీ పొందుతూ ఆమె ప్రేమనర్థం చేసుకొని ఆనందిస్తూ, ఆమెను తిరిగి ప్రేమిస్తూ తన శ్రేయస్సూ ఆమె శ్రేయస్సూ కోరినటువంటివాడు. అటువంటివాడికి తక్కిన ప్రకృతి పట్ల గూడ అదే భావముంటుంది. అందుకే కేవల బాహ్యవిద్యకు ప్రాముఖ్యమిచ్చే యీ రోజులలో ఒకరినొకరు హృదయరహితంగా వాడుకొనడం చూస్తున్నాము. అలాగాక వెనుకటి కాలంలో చెట్లను, జంతువులను గూడ ప్రేమతో చూచుకోగల్గి, తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను సోదరులను - అందరినీ ప్రేమగా చూచుకోగల్గడం వలన మానవ జీవితమొక ప్రేమ స్రవంతిగా సాగుతుంది. నేడు సామాన్యమైన సౌఖ్యాలెన్ని వున్నా ప్రతివాడు స్వార్థమనే తీరని ఆకలితో మల మల మాడుతూనే యున్నాడు. వివాహంలో భార్యకంటే ధనము, మర్యాద, లాంఛనాలు ముఖ్యమయ్యాయి. తల్లిదండ్రులకు



వారిచ్చే తృప్తి హోదాలవల్లనే భార్యాబిడ్డలనుండి గౌరవం లభించే దుస్థితి కల్గింది. డబ్బు, ఆస్తి మొదలయినవి తన వినియోగం కోసం సృష్టించిన మనిషి తనకంటే వాటికే ఎక్కువయిన విలువనిచ్చుకొనే బానిస బుద్ధికి దిగజారాడు.

ఈ వైఖరి క్రమంగా మనలో మార్పురానిదే వేదవిద్య మృతంగా వుండిపోతుంది. పరీక్ష కోసం గుడ్డిగా వల్లించిన పాఠాలలాగ. ఆ మార్పు రావాలంటే శ్రీ సాయిబాబావంటి పూర్ణ గురుని సేవిస్తే అన్నిజీవులలో ఆయనే వున్నారన్న వివేకము, తద్వారా సర్వ జీవులపట్ల ప్రేమ, గౌరవము ఏర్పడతాయి. అప్పుడు మన జీవితాలను పూర్ణం చేసుకోవాలన్న నిజమైన జిజ్ఞాసకల్గి వేదవిద్యను సక్రమంగా అధ్యయనం చేసే సంస్కారం ప్రజలకు కలుగుతుంది.

ప్ర :- ***హస్త సాముద్రికములు, శంఖ, చక్ర, పద్మరేఖలు భగవదంశము సూచిస్తాయంటారు, కారణమేమి?***

జ :- అరుదైన వస్తువుల గురించి గ్రంథాలలో చదివినా అనుభవజ్ఞుల వద్ద శిక్షణ పొందక గుర్తుపట్టడమసాధ్యము. అట్టివే ఈ రేఖలున్నూ. పూర్వ కర్మరూపమే ఈ దేహము. కష్టసుఖాలు, మనిషి చేసిన పుణ్యపాపాలు, సాధించిన ధర్మపటిమ శరీరంపైన కన్పించే శుభ లక్షణాల రూపంలో ప్రకటమవడంలో ఆశ్చర్యమేమి? ఈ సూత్రము పైనే లింగ, హస్త సాముద్రికాలూ, జ్యోతిషము ఆధారపడ్డాయి.

బుద్ధుడు అనేక జన్మలలో నిరంతరకృషితో ఒక్కొక్క ఉత్తమ గుణాన్ని సాధించినకొద్దీ అతని శరీరంపై ఒక్కొక్క చిహ్నము ఏర్పడుతూ వచ్చిందని, యిట్టివి 32 ఏర్పడేసరికి అతడు పుణ్యపురుషుడై బుద్ధత్వం చెందాడని బౌద్ధులు చెబుతారు. జైనులు గూడ వారి గురువులైన తీర్థంకరుల గురించి అలానే చెబుతారు. అయితే ముముక్షువులకు అట్టి సాధనామార్గమే ప్రస్తుతం గాని, దాని పర్యవసానమే అయిన రేఖల శాస్త్రం అప్రస్తుతమేగాక మన దృష్టిని ప్రక్కదారి పట్టిస్తుంది. అందుకే సాయి తన హస్తరేఖలను పరిశీలించగోరిన మూలేశాస్త్రిని నాలుగు పురుషార్థాలకు సంకేతంగా నాలుగు పండ్లిచ్చి మౌనం వహించారు. వారి అంగ సాముద్రికము పరిశీలించగోరిన వ్యక్తి గురించి "వీడు నాకుటీరానికున్న వాసాలను గమనించవచ్చాడు. అది వ్యర్థం పొమ్మను" అన్నారు.



ఇట్టి శాస్త్రాల సహాయంతో అజ్ఞాన మోహితులైన పామరులనాకట్టుకొని, వారిచేత ధర్మ ప్రచారానికి సహాయం చేయించుట ఒక్కటే సమ్మతమని సద్వినియోగమని ''దత్తమహిమ'' అనే గ్రంథంలో దత్త స్వామి చెబుతారు. వేరు జీవనం లేకపోతే తప్ప వీటి ద్వారా ధనార్జన పాపమని ఆర్షవాక్యం.

***ప్ర:- శ్రీ సాయిబాబా చరిత్ర చదివి ఆయన గురించి తెలుసుకోకుండా ఆయనను గుడ్డిగా 'పోలేరమ్మను' పూజించినట్లు పూజించటం తగదని 1-1-86 సంచికలో మీరు వ్రాశారు. పోలేరమ్మను అలా తక్కువ చేయడం సమంజసమా?***

***- వీ. నాగరాజు, నంద్యాల్.***

జ:- బాగా ఆలోచించండి. యిక్కడ నిరసించ బడినది. పోలేరమ్మగాదు. ఆమెను పామరులు గుడ్డిగా పూజించడం గురించి. సాయి సకలదేవతా స్వరూపియని తెలిసాక ఏ దేవతనూ కించపరచడం జరుగదు. గుడ్డిగా పూజించడం వ్యర్థము. కారణం మనకేమీ పరిచయంలేకనే ఎవరినీ భక్తితో ఆరాధించ సాధ్యముగాదు. కేవలం పూర్వజన్మ సంస్కారంగల కొద్దిమందికి ఫలితం కన్పిస్తుందిగాని అందరికీ అది చాలదు.

***ప్ర :- దేవతలు మనో కల్పితములా, నిజంగా వున్నారా? పరబ్రహ్మ సద్గురువుగానూ,అవతారముగానూ తప్ప - మానవాకృతి గానే తప్ప - దేవతలుగా ఉండడా?***

***- యం. వి. రెడ్డి, తణుకు.***

జ :- పరబ్రహ్మ సద్గురువుగా తప్ప అవతరించడు. అవతారం. అవతార కార్యాన్ననుసరించి తగురీతిన తన మాయకు కట్టుబడి అవతరిస్తాడు. కృష్ణుడు దైవమే అయినా కౌరవులు దుష్టులన్న భావంతోనే అవతరిస్తాడు. అన్నీ తానన్నది తన అంతరంగంలోనే యుంటుంది అదీ ఒకానొక యోగస్థితిలో. అందుకే ఉత్తరగీతలో అర్జునుడు తనకు చెప్పిన భగవద్గీత మరచానని, మరలా చెప్పమని కోరితే ''అది యోగస్థితిలో చెప్పాను, యిప్పుడు మరలా చెప్ప వీలుగాదు'' అంటాడు. సద్గురువుకు పరిమితమైన అవతారకార్యముండదు. సదా పరబ్రహ్మమెలా ఉంటుందో అలానే ఉంటాడు అన్నీ తానే అయిన స్థితిలో ఉంటాడు. అందుకే వారికి ప్రత్యేకమైన అవతార కార్యముండదు.

పరబ్రహ్మలో ఒక అంశము సగుణ బ్రహ్మమై విశ్వమవుతుంది

"పాదోస్య విశ్వభూతాని" అన్నట్లు. ఆ విశ్వం సగుణ బ్రహ్మయొక్క దేహం రూపం. దాని అంగాలు దేవతలు పురుషసూక్తం చెప్పినట్లు. దాని ఆత్మగా ఉన్న పరబ్రహ్మ వైపునుండి ఆయన దేహము, అవయవాలు భిన్నంగావు - మన దేహము, యింద్రియాలు భిన్నంగా అనుభవంగానట్లే. కాని యింద్రియాలు అవయవాల వైపు నుండి దేవతలవైపు నుండి చూస్తే వారు భాగాలుమాత్రమే. సమిష్టి గారు. అందుకే పరబ్రహ్మ స్వరూపియైన సద్గురువుకు దేవతలు ఆధీనులు. వారిని తిండి గుడ్డల కాశ్రయిస్తే, లక్ష్మి వారి ఆదేశానుసారం మనను కటాక్షించి తీరాలి.

దేవతలుండడమన్నది మనకిప్పుడు గోచరించే జగత్తు, దేహేంద్రియాలూ ఎంత వాస్తవమో అంతే వాస్తవాలు ఎక్కువాగాదు తక్కువాగాదు. మాయలోనుండి చూస్తే నిజంగా వుంటారు. ఆత్మ దృష్టితో చూస్తే "ఏకం సత్" సత్యమైన ఉనికిగల దొక్కటే. నవలా రచనలో రచయిత తననొక పాత్రగా ప్రవేశపెట్టుకొనడంలాంటిది సద్గురువు యొక్క రూపం. ఇతర పాత్రలూ అతడి మనోరూపాలే అయినా తన ప్రతిరూపం మాత్రము అవేవీ కాని రీతిన తాను, మిగిలిన పాత్రలేవీ కానివిధంగా ఆ పాత్రలన్నీ అతని ప్రతినిధియొక్క మూలతత్త్వం (రచయిత మనస్సు) యొక్క రూపాలు.

కృష్ణుడు భగవద్గీతలో తన తత్త్వం గురించి "యథామామ్" అన్నది ఆయనప్రత్యేకమైన యోగస్థితిలో చెప్పినవి మాత్రమే. ఉద్ధవగీగ ప్రమాణం చూపానుగా? సద్గురువు ఎల్లప్పుడూ అట్టి స్థితిలోనే ఉంటాడు. అందుకే 'శ్రీగురుచరిత్ర', 'సాయిలీలామృతాలలో' దేవతలే తమ భక్తులను సద్గురువు నాశ్రయించమనడం చూడవచ్చు.

సద్గురువు సగుణ నిర్గుణ బ్రహ్మల సమైక్య రూపమని తెలిసిన భక్తుల దృష్టిలో వేరు దైవాలంటూ వుండరు. బౌద్ధులు, జైనులూ, సూఫీల ధర్మాలకు గూడ మూలమిదే "గురువే సకల దేవతలున్నూ" అన్న సాయి సూక్తే. ఈ సత్యాన్ని వాక్యరూపంగాగాక దృశ్యరూపంగా గుర్తుంచుకోడానికే శిరిడీలో భక్తులు విగ్రహ ప్రతిష్ట చేసినది.

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా!**

**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః!!**

---



# ఆచారపరమైనవి

ప్ర :- మనం బొట్టు పెట్టుకునే కుంకుమ, విభూతుల ప్రాశ్యస్తం వివరించండి. విభూతి పైన , కుంకుమ క్రింద పెట్టుకోవాలంటారు. ఎందువలన? కుంకుమ ముత్తైదు స్త్రీలు పెట్టుకుంటారు. విభూతి భర్తలేని స్త్రీలు మాత్రమే పెట్టుకుంటారు. ఈ తేడా లేమిటి?

- ఎ. సత్యనారాయణ, సూళ్ళూరుపేట

జ :- విభుని చిహ్నం విభూతి. అంటే సృష్టికాధారమైన చైతన్యమే విభుడు లేక పరమాత్మ పురుషుడు. ఆయన శుద్ధసత్వ స్వరూపియని గుర్తుంచుకొనేందుకే తెల్లని విభూతి వాడతారు. ఆయన శక్తియే ప్రకృతి, లేక జగన్మాత. సృష్టికార్యోన్ముఖమైన ఆ ప్రకృతి రాగాత్మకమని గుర్తుంచుకొనడానికి ఎఱ్ఱని కుంకుమ వాడతారు. మొదటనున్న పరమాత్మయే సంకల్పశక్తిరూపంలో ఈ ప్రకృతిగా అవతరిస్తుందని, దాని కతీతం పరమాత్మయని, అతడి అధీనంలోనిదే ప్రకృతియని తెల్పడానికి పైన విభూతి క్రింద కుంకుమ ధరిస్తారు.

సాంసారికమైన సుఖదుఃఖానుభవాల ద్వారా కర్మవాసనల నుండి విడివడి పవిత్రమైన దైవీభావంతో సంసారాన్ని నిర్వహించాలని తెల్పడానికి ముత్తైదువులు కుంకుమ పెట్టుకుంటారు. భర్తను ప్రాణ సమానంగా ప్రేమించిన స్త్రీలు భర్త మరణానంతరము సాంసారిక సుఖ దుఃఖాలనుండి, రాగాత్మకమైన ప్రకృతి నుండి, శోకంనుండి కలిగిన వివేకం ద్వారా విడివడి కేవలం పరమ్మాత ధ్యానంయందే జీవిత శేషాన్ని గడపాలని తెలుపడానికి విభూతి మాత్రమే ధరిస్తారు.

ప్ర :- స్త్రీలు బహిష్టు అయినపుడు యధారీతిగా ధ్యానము, పూజ వేయవచ్చునా?

జ :- మానవులలో శరీరగతమైన జీవ క్రియలకు, మానసిక స్థితికి ఎంతో సన్నిహిత సంబంధమున్నది. రుచికరమైన పదార్థాన్ని చూచినపుడు లాలాజలము, ఒక్కొక్కప్పుడు జీర్ణకోశంలోని రసాలు శరీరంలో ఉత్పన్నమవుతాయి. అలానే ఆకలయినపుడు రుచికరమైన ఆహారపదార్థాలపైకి మనస్సు పోతుంది.



జపము, ధ్యానము మొదలగున అధ్యాత్మిక సాధనలను హృదయపూర్వకంగా చేసేటప్పుడు శరీరంలోని ప్రాణశక్తి ఊర్ధ్వగతిన పనిచేస్తుంది. అందుకే అట్టివారికి క్రమంగా జీర్ణకోశంలోని రసాలు తక్కువగా పనిచేయడం ఆరంభించి ఆహార పరిమితి క్రమంగా తగ్గుతుంది. అలాగే అధోగతిన బహిర్గతమయ్యే మలమూత్రాల ప్రమాణం కూడా తగ్గుతుంది. అందుకే భోజనానంతరం తీవ్ర ధ్యాన, జప, పూజాదులు చేయకూడదని శాస్త్రం. కారణం ఆహారం సరిగా జీర్ణంకాదు. అలానే మలమూత్ర విసర్జన సమయంలోగాని అందుకు కొద్దిముందుగాని జపాదులు తీవ్రంగా చేయకూడదు. సాధ్యమైనంతవరకు ఇలాంటివి కాలకృత్యాలుతీర్చుకున్న తరువాతనే చేసుకోవాలని చెప్పారు.

స్త్రీలు బహిష్టు అయినపుడు అధోగతిని శరీరం నుండి ఎంతో మాలిన్యం వెడలిపోతుంది. ఇక్కడ మాలిన్యమంటే శరీరానికి అవసరం లేని పదార్థమంతా అని అర్థం. ఈ కారణంగానే శాస్త్రంలో ఆ సమయంలో పూజాదులు చేయకూడదని నిషేధించబడినది. మితంగా భగవన్నామస్మరణ, మహాత్ముల చరిత్రలు పారాయణ చేసుకోవడానికి ఎట్టి అభ్యంతరము లేదు. కాకుంటే ఎట్టి శారీరక మానసిక స్థితులలో వున్నప్పుడు ఏఏ వస్తువులను, ప్రదేశాలను ఉపయోగిస్తామో, అట్టివి తిరిగి అటువంటి మానసిక స్థితులను మనలో ప్రేరేపిస్తాయని నిత్యానుభవాన్ని గమనిస్తే తెలుస్తుంది. పూజాపటాలున్న గదిలో లౌకిక వ్యవహారాలను గూడ సాగిస్తే క్రమంగా ఆ దైవరూపాలపై శ్రద్ధ, ఏకాగ్రత తగ్గడం మనం చూడవచ్చు. అందుకే ప్రత్యేకంగా పూజాగృహాలు, దేవాలయాలు అవసరమయ్యాయి. అలానే బహిష్టు అయినప్పుడుగూడ తక్కిన విధములైన మలవిసర్జనల విషయంలోలాగనే మనము నిత్యము జీవించే గృహానికి దూరంగా వుండాలని, అప్పుడు వాడిన వస్తువులను శుభ్రం చేయకుండా వాడకూడదని చెపుతారు.

ఒక ప్రాణి శరీరంలోనూ మనసులోనూ జరిగే ప్రాణక్రియలకు సమీపంలోని జీవులపై ప్రభావముంటుందని ఇటీవల సోవియట్ రష్యా అధ్వర్యంలో జరిగిన అంతర్జాతీయ సైకోట్రానిక్స్ సమావేశములో ఋజువు



చేయబడ్డది. అందుకే మలమూత్ర విసర్జన చేసినవారి వలెనే బహిష్ఠు అయిన స్త్రీలయొక్క స్పర్శనం, సామీప్యాన్ని శాస్త్రాలు నిషేధించాయి.

మలమూత్ర విసర్జనచేసే సమయంలో ప్రశాంతంగా, మౌనంగా వుండాలంటుంది శాస్త్రం. మనోవ్యాపార మధికమయితే ఆ ప్రకృతి క్రియలు నిర్దుష్టంగా జరగక శరీరంలో దోషం ఏర్పడుతుందని, అంతే కాక క్రమంగా అదే అలవాటుగా మారుతుందని భావం. అలా బహిష్ఠు అయిన స్త్రీకి కూడ గృహ సమస్యల గూర్చిన ఎట్టి తీవ్ర మనో వ్యాపారం తగదు. అందుకుకూడ అట్టివారిని ఇంటికి దూరంగా వుండమంటారు. అప్పుడు భర్తను దర్శించితే వారిలో కామం, మమకారాది భావాలవంటి వ్యాకులత కల్గవచ్చని అలా హెచ్చరించారు.

*ప్ర :- **శిరిడీ సాయిబాబా అన్నిఫోటోల్లోనూ తలపాగా (కఫ్నీ) ధరించియేయున్నారు. కారణం తెలుసుకోవచ్చా?***

***- ఇ. గోపాలకృష్ణమూర్తి, ఒంగోలు***

**జ:-** బాబా తాము తలపాగాను ధరించిన కారణం ఎప్పుడూ ఎవ్వరికీ చెప్పలేదు. ఇస్లాంలో తలపై గుడ్డ వుంచుకొనడం శరణాగతికి చిహ్నం. అందుకే నమాజు చేసేటప్పుడు తలపై వస్త్రం వేసుకుంటారు. 'అల్లామాలిక్ హై' అంటూ బాబా తాము భగవంతునికి నిత్య శరణాగతుడనని స్పష్టపరిచేవారని, ఎన్నడూ తీయని ఆయన 'తలగుడ్డ'ను బట్టి మనం భావించవచ్చు. ఇంకా యోగపరమైన, చమత్కార భూయిష్టమైన కారణాలు కొందరు చూపారు గానీ అవేవీ శాస్త్రానికి, పరిప్రశ్నకు నిలబడవు. పోతే మీ ప్రశ్న సూచిస్తున్నట్లు 'కఫ్నీ' అంటే తలగుడ్డకాదు. బాబా ధరించిన పొడవైన అంగీ (చొక్కా).

*ప్ర :- **1) బాబాకు అసలు భిక్ష తెచ్చుకుని తినవలసిన పని ఏముంది? ఆయన దేముడుకదా?***

***2)** సాయిబాబా మసీదులో వుంటారుకదా మహమ్మదీయులు బాబాను పూజించరు ఎందుకని?*

- ఎన్. రాజమ్మ, పుల్లంపేట.

**జ :- 1)** శ్రీసాయి హిందూ ముస్లిమ్ సాంప్రదాయాలను మేళవించి పాటించే సూఫీ సాంప్రదాయంలోని ఫకీరు. మహారాష్ట్ర దేశములో గోసాయిలను,



"సాఁయ్" అని పిలిచేవారు. దానికి బాబా పలికారు. సాయి నైష్టిక బ్రహ్మచారి, ఫకీరు. ఆ ధర్మాన్ని అనుసరించి ఆయన భిక్ష చేసారు.

అన్నరగ్ని రనికేతస్స్యా గ్రామ మన్నార్థ మాశ్రయేత్।
ఉపేక్షకో సంకుసుకో మునిర్భావ సమాహిత।
కపాలం వృక్షమూలాని కుచేల మసహాయతా।
సమతాచైవ సర్వస్మిన్నెస్ముక్తస్య లక్షణం।

లౌకికాగ్ని లేనివాడై, యిల్లులేక, తన శరీరముపట్ల, విషయాల పట్ల ఉపేక్షగలవాడై ఆహారముకొఱకు మాత్రమే గ్రామములోనికి పోవుచూ ఎప్పుడుమౌనియై బ్రహ్మధ్యానమునందు తన్మయుడై యుండవలెను. భిక్షకై మట్టి మూకుడును, నివాసమునకు చెట్ల మూలమును, చింకి బొంతలు, దుస్తులుగను, అన్నింటియందు సమత్వబుద్ధియు యివి ముక్తుడయిన యతికుండవలసిన లక్షణములు. వారు సాధు, ఫకీరు, ధర్మములో అవతరించారు గనక ఆ ధర్మము ప్రకారము భిక్షాటన చేశారు. **"గ్రామమన్నార్థ మాశ్రయేత్"** భిక్షకొరకు మాత్రమే శిరిడీ గ్రామంలోకి వెళ్ళారు. ఐదు యిళ్ళవద్ద మాత్రమే భిక్ష చేసేవారు. ఒక్కయింటి భిక్షతో తృప్తిపడ వచ్చుగదా అన్ని ప్రశ్నిస్తే; **"భైక్షణెవర్తయే నిత్యంనై కాన్నదీ భవేద్యతి"** ("ప్రతిరోజు యతి పెక్కు యిండ్లకడ తెచ్చుకున్న అన్నమునే తినవలెను కాని ఒక్కయింటి అన్నము తినరాదు") **"భిక్షాహారీ నిరాహారే భిక్షానైవ ప్రతిగ్రహః! అసంతోవాపిసంతోవా సామపానందినేదినే!,** (భిక్షాహారము భుజించే వాడు నిరాహారి! భిక్షను అడగటం వల్ల ప్రతి గ్రహదోషం అంటదు. సజ్జనుడినుండైనా దుర్జనుడినుండైనా ఎవడు భిక్షను యాచించి భుజిస్తాడో వాడు ప్రతిదినం అమృతపానము చేసినవాడగుచున్నాడు.) పై ధర్మాలన్నీ పాటించి ప్రమాణంగా నిలిపిన ధర్మావతారుడు శ్రీ సాయిబాబా.

**జ:- 2)** బాబాను మహమ్మదీయులు పూజించరని ఎవరన్నారు? బాబాను మహమ్మదీయులూ ఆరాధిస్తారు. శిరిడీ దర్శించిన వారికీ అనుమానంరాదు. మశీదులో జరిగే విగ్రహారాధన మొ॥న హైందవ పూజాదికాలు ముస్లింలకు నిషిద్ధం కనుక ఆ కార్యక్రమాలలో పాల్గొనడానికి కొందరు ముస్లింలకు అభ్యంతరము, కొందరికి భయమూ ఉండటము సహజమే.



**ప్ర :- మన పెద్దలు ప్రతీవారినీ 'పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు' అని ఆశీర్వదిస్తారు. ప్రాచీనులు పూజలలోని సంకల్పంలో గూడా అలానే చెప్పారు. అంటే బిడ్డలు - అందులో మగ పిల్లలు -ఎంత ఎక్కువ మంది కల్గితే అంత సంతోషమన్న భావం వ్యక్తమవుతుంది. కాని నేటి సాంఘిక, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా అది వాంఛనీయంగాదు. ఇప్పుడు సంతానం విషయంలో మన దృష్టి ఎలా వుండాలి?**

జ :- శృతులు మానవుడు సంతానాన్ని బడసి పితృఋణం తీర్చాలన్నాయి. అయితే మీరు తలచినట్లు బహు సంఖ్యలో బిడ్డలుండాలని వారు చెప్పలేదు. మన తదనంతరము మనకు పిండోదకాలర్పించడానికి కొడుకులు లేకుంటే పుణ్యలోకాలు దక్కవని వారు చెప్పిన మాటలలో ఎంతో లోతైన భావమున్నది.

తమ జాతి, వంశము నిలవాలన్నది జీవులన్నింటికీ ప్రకృతి సిద్ధంగా ఉన్న కోరిక. యోచనాశక్తి గల మానవులు తమ సంతానం ఉత్తమంగానూ, పవిత్రంగానూ రూపొంది వంశానికి కీర్తి, పుణ్యము గడించాలని ఆశించడం సహజం. అది స్వార్థంగాదా? పైగా వారు కీర్తి గడించినందువలన గతించిన పెద్దలు పై లోకాలలో పొందేదేమిటి? ఉత్తమవంశంలో యోగ భ్రష్టులైన ఉత్తమ సాధకులు జన్మించి తమ యోగాన్ని కొనసాగించుకోవాలని వారి కోరిక. ఉత్తముడైన యోగి, జ్ఞాని, జ్ఞాన వైరాగ్యాలుగల సన్యాసి జన్మిస్తే కొన్ని తరాల పెద్దలు గూడ తరిస్తారని ఋషి వాక్యము. మానవాళికి గూడ ఎంతో మేలు జరుగుతుందిగదా! ఇలాంటి జగద్హితానికి దోహదం చేయటమే ప్రతి కుటుంబంయొక్క పవిత్ర కర్తవ్యమని పెద్దలభావం. అదే జన్మసార్థకత. ఇలాంటి వంశోద్ధారకులైన బిడ్డల జననమే ఆశీస్సులతో సూచించబడింది గాని కేవలం కోడిపిల్లలలాగా సంఖ్య ప్రధానమని తలచరాదు. కారణం బహుళ సంతతి దరిద్ర లక్షణంగా పలుచోట్ల ప్రాచీన గ్రంథాలలో కన్పిస్తుంది. అంతేగాదు పవిత్రమైన ధర్మాచరణలేని బిడ్డల వలన పితృదేవతలు సైతం అధోగతి పాలవుతారని, అట్టివారు కేవలం లాంఛనంగా శ్రాద్ధాది కర్మలు చేసినా వ్యర్థమని ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి. భగవంతునియందు నిజమైన



భక్తి లేనివాడికి కర్మాచరణ ఫలితం శూన్యమని ధర్మశాస్త్రాలన్నీ చెబుతున్నాయి. కనుక కల్గిన పరిమితమైన కొద్దిమంది సంతతి ఉత్తమ సంస్కారవంతులు గావాలన్నది పెద్దల ఆశీర్వచనానికి అర్థము. అంతేగాదు. ఇద్దరు లేక ముగ్గురు బిడ్డలు కలిగాక దంపతులు సోదరీ సోదరులవలె జీవించగల్గడం మానవ జీవితాదర్శంగా చెప్పబడ్డది. కారణం పరిమిత సంఖ్యలో బిడ్డలుంటే తల్లి దండ్రులు వారి విద్య, పెంపకాలలో తగు శ్రద్ధ తీసుకొని వారిని సంస్కరించడం సాధ్యమౌతుంది. ఈ విషయాన్నే శ్రీ రామకృష్ణ పరమహంస ఎన్నో సందర్భాలలో సూచించారు.

ప్ర :- ***మంచి తులసిమాల ఉపయోగించాలంటారు వైష్ణవులు. ఒకసారి మెడలోధరిస్తే తిరిగి దానిని జపానికి వాడకూడదంటారెందుకు? మంచిమాల ఎక్కడ దొరుకుతుంది?***

**- శ్రీమతి ఎన్. సి. లక్ష్మీదేవి, బెంగుళూరు.**

జ :- సృష్టిమొత్తమూ త్రిగుణాత్మకము. కనుక వస్తువులు, ప్రాణులు కూడ సత్వ రజస్తమో గుణాలలో ఒకదానిని ప్రధానంగా కల్గివుంటాయి. మొక్కలలో సత్వప్రధానమయిన వాటిలో తులసి ఒకటి. ఈ సత్వగుణమన్నది ఆ మొక్కకు మన దేహధాతువులపై, మనస్సు పైన ఒక విశిష్టమైన ప్రభావముంటుంది. ఇది స్పర్శ, దర్శన, వాసనల ద్వారా కూడా పనిచేస్తుంది. కనుక తులసిమాలను ఉపయోగించడం ఒక గొప్పసహకారి, జపంలో మనసు చలించినప్పుడుదానిని వెనుకకు లాక్కోడానికి కనీసం కొంత పరిమిత జపకాలంలోనైనా మనస్సు ధ్యేయంమీద ఏకాగ్రం కావడానికి మాల, జపసంఖ్య ఉపయోగపడతాయి. కొలికిపూస లేక మేరువును జపంలో దాటిపోగూడదన్న నిబంధన జపాన్ని యాంత్రికమవనివ్వకుండా, మన శ్రద్ధను కట్టుదిట్టం చేస్తుంది. అంటే మాల ఎప్పుడూ మెడలోనే ఉంటే సామాన్యులకు నిత్యకృత్యాలలో దానిపట్ల అతి పరిచయం వలన శ్రద్ధమందగించి అంత మేరకు జపంలో అంతగా ఉపకరించ లేకపోతుంది. కనుక జీవితాన్నంతటినీ అనుక్షణమూ భగవత్స్మరణలో గడపను అంకితం చేసుకున్న మహనీయులకు, దేవతలకు మెడలో తులసిమాల, రుద్రాక్షమాల వంటివి సమ్మతించబడ్డాయి.



తీవ్రయోగాభ్యాసంలో ఒక విషయం అనుభవ గోచరమవుతుంది. ఎవరు ఏ భావంతో ఏ వస్తువును చూడడం, స్పృశించడం చేస్తారో వారి భావాల ప్రభావం సూక్ష్మంగా ఆ వస్తువులకు సోకుతుంది. ఉదాహరణకు తీవ్ర సాధనాకాలంలో మొహమాటానికో, చాపల్యానికో పోయి, ఎవరైనా యిచ్చిన వస్తువులు స్వీకరిస్తే, అంతవరకూ ఆ సాధకుడికెన్నడూ సహజంగా రానివి, ఆ వస్తువును సమర్పించిన వ్యక్తికి సహజమూ అయిన భావాలు కల్గుతాయి. అందువలన భగవద్ధ్యానంలో వుండను వీలులేకుండా ప్రాపంచిక జీవితాన్ని గడిపే స్థితిలో నున్న మనలో సంస్కారంబలం వలన ఎన్నో ద్వంద భావాలు కల్గుతాయి. మనస్సు కొన్నివేల యోచనలు చేస్తుంది. భావాలను పొందుతుంది. ఇవన్నీకలసి 'నిరంతరం నిశ్చలమైన భగవత్ స్మృతిలో వుండక పోవడం' అన్న సంస్కారంగా మన మెడలోని మాలను ప్రభావితం చేస్తాయి. కనుక రోజులో ఎక్కువకాలం ఈ వైఖరిని సంతరించుకున్న మాలలో స్వల్పకాలం మాత్రమే మనం సాగించే జపప్రభావం బలహీనమవుతుంది. కనుక జపమాలను మెడలో వేసుకోవద్దన్నారు. శరీర ధాతువుల మీద తులసికుండే మంచి ప్రభావాన్నను సరించి వేరొకమాల నెప్పుడూ మెడలో ధరించమన్నారు పెద్దలు.

నిరంతర భగవత్స్మరణ కుదిరాక మాల అవశ్యకత వుండదు. మిగిలిన వారి కాదర్శంగా మాత్రమే అంటే అలాటి అభ్యాసం తనకెట్టి కృతార్థత నిచ్చిందో సాటివారు గుర్తించి ఉపయోగించుకొనేందుకు మాత్రమే మాలను ధరించవచ్చు. లేక సాత్విక స్వభావానికి సాత్త్విక పదార్థాలు మీద ప్రీతియున్నట్లే ఉత్తమ సాధకులకు తులసి ప్రీతినివ్వడం వలన గూడ వారు దానిని ధరించ వచ్చు.

మంచి మాలను మధురా బృందావనంలోని మఠాలలో దొరుకుతాయి. దివ్యజీవన సంఘము, వ్యాసాశ్రమము (ఏర్పేడు), రామ నామక్షేత్రము (గుంటూరు) మొదలైన వారివద్ద మాత్రమే మంచివి దొరుకుతాయి. ఇటీవల మరికొన్ని ఆధ్యాత్మిక సంస్థలు చాలా ఎక్కువ వెలకు అమ్ముతున్నారు గూడ. నా మిత్రులకు గుంటూరులోని రామనామక్షేత్రంలో చాలా సరసమైన ధరలకు మంచిమాలలు దొరికాయి.



ప్ర :- సగోత్ర వివాహాలు చేయకూడదా?

- ఒక భక్తురాలు, హైదరాబాదు.

జ:- రక్తసంబంధం ఎంత దగ్గరగా ఉంటే అంతమేరకు సంతతికి శారీరకంగాను, మానసికంగాను గూడా క్షేమకరంగాదని నేటి శాస్త్రజ్ఞులు కూడా కనుగొంటున్నారు. రక్తం యొక్క సాన్నిహిత్యానికి కేవలం దగ్గర బంధుత్వమే వుండనక్కరలేదని రక్త హీనులైన రోగులకు క్రొత్త రక్తమెక్కించే విధానం వలన తెలుస్తుంది. సగోత్రీకుల మధ్య అట్టి సాన్నిహిత్యముండి వుండవచ్చు. అంతకంటే గూడ ఋణానుబంధాలను బట్టి ఈజన్మలో బాంధవ్యాలేర్పడుతా యన్నది సూత్రము. ఆధ్యాత్మిక స్థాయిలో అట్టి సంబంధం ఏర్పరచడం సమంజసంకాని జీవులు సగోత్రీకులయి వుండడం కారణం అయివుండవచ్చు. కేవలం తాత్కాలికంగా ఆడపిల్ల భారాన్ని వదిలించుకునే దృష్టి సరిగాదు. సంస్కారాలన్నీ ఎంతో లోతైన ఆధ్యాత్మిక సూత్రంమీద ఆధారపడ్డాయి. సంస్కారాలలో వివాహమొకటి. "శాస్త్రాలెన్నటికీ అబద్ధాలు కావు." అన్న సాయి మాటలకంటేప్రమాణమేముంటుంది? జీవిత సమస్యలనుండి తప్పుకు నేందుకు దగ్గరదారులు వెదకడంవల్లనే మనిషి అధర్మం చేస్తాడని ఆ కర్మఫలాన్నే అనేక బాధలుగా అనుభవిస్తాడనికొంచెం యోచిస్తే తెలుస్తుంది కదా! ఎవరికి, ఎప్పుడు, ఎవరితో వివాహం జరగాలన్నది ఋణానుబంధంవలన, కర్మ ఫలంగాను, ముందే నిర్ణయమవుతుందని "శ్రీ సాయి లీలామృతము" లెక్కకు మీరిన అనుభవాలతో నిరూపిస్తున్నది. అయినా శ్రేయస్కరమైన రీతిన సాధ్యమైన మేరకు కర్మఫలాన్ని శ్రీసాయి సర్దుబాటు చేస్తారు. శ్రీ సాయికి మ్రొక్కుకొని, శ్రీ సాయిలీలామృతము 7 సార్లు పారాయణ చేస్తూ సమస్య తీరేంతవరకు ఇష్టమైన వంటకాన్ని వదలుకొని, నిత్యము సాయికని భోజనానికి ముందు వాకిట్లో మూడు ముద్దలు విడచి మిగిలినది ప్రసాదంగా భుజించమని చెప్పండి. ప్రతి పారాయణ అవగానే శిరిడీకి రూ॥2లు దక్షిణగా పంపుతూండమనండి. అయితే ఈ సలహా యిచ్చేముందు మీరు నియమంగా "శ్రీ సాయిలీలామృతము", "శ్రీగురు చరిత్ర" పారాయణ చేయండి. నూటికి తొంభైమందికి సమస్యలు తీరడం నా అనుభవం.



ప్ర :- గ్రహణ దినాల్లో దేవాలయాల్లో పూజాది కార్యక్రమాలు ఎందుకు నిషేధించారు?

- అయితా సత్యనారాయణ, సూళ్ళూరుపేట.

జ :- అటు అనంత విశ్వానికి ఇటు మానవుడికి పరమాత్మ తత్త్వంలో ఐక్యమున్నది. సామరస్యమున్నది. దానిని వివరించడంలో అండాండ పిండాండాలకు పోలిక, సంబంధము వివరించారు ఋషులు. అలానే జ్యోతిష్యాస్త్రజ్ఞుల ప్రకారం సూర్యుడు ఆత్మకారకుడు; చంద్రుడు మనః కారకుడు; భూమి దేహానికి కారకురాలు. ఏగ్రహణమైనా మనస్సు అంతర్ముఖమై ధ్యానస్థమవడానికి సంకేతం. కనుక అపుడు పూజాదికాలు చేస్తూ మన మనస్సును, యిష్టదైవాన్ని బహిర్ముఖం చేయగూడదు. ఇష్టదైవం కూడా ధ్యానస్థుడైయుంటాడని భావం. పూజించడమంటే దైవంయొక్క దృష్టిని మనమీదకు భేదభావంతో మరల్చుకొనడమన్నమాట. గ్రహణమపుడు మనముకూడా ధ్యానస్థులమై అభేదభావంతో ఆయనతో తాదాత్మ్యానికి యత్నించాలి.

ప్ర :- స్త్రీలు మెన్సెస్‌వలన ఆటంకం కల్గినపుడు ఎన్ని రోజులు పూజ చేయగూడదు. ఎన్నిరోజులు 'శ్రీగురుచరిత్ర' 'సాయిబాబా జీవితచరిత్ర' పారాయణ చేయగూడదో చెప్పగోర్తాము.

- లక్ష్మీకాంతమ్మ, రంగుతోట, ఒంగోలు

జ :- ఆధ్యాత్మికతంతా మానవుడు ఆంతరంగికంగా పరిశుద్ధుడవడమే. బుద్ధి లేక శౌచము రెండు విధాలు; బాహ్యము, అంతరంగికమున్నూ. మానసిక, శారీరక శౌచము బాహ్యము. ఆధ్యాత్మిక శౌచము ఆంతరంగికము. ధ్యానం ఆధ్యాత్మశుచికి మార్గం. ఆరోగ్యమైన ఆహారం, న్యాయార్జిత జీవనము, దానము, ఇంద్రియ మనోనిగ్రహములు, వివేకంతో రాగ ద్వేష మమకారాలను తొలగించుకొనడమూ శారీరక మానసిక శుద్ధికి కారణాలు.

మీ ప్రశ్న శారీరక శుచికి సంబంధించినది. మనస్సుకూ శరీరానికి సామాన్యులందరితోనూ అవినాభావ సంబంధముంటుంది. పూర్తిగా మనస్సును వశంచేసుకున్న వారిని మాత్రమే దేహసంబంధమైన అశుచి ఏమీచేయలేదు.



భోజనానికి ముందు చేతులు కడుక్కొనడంలాగా నిద్రలేవగనే మలమూత్ర విసర్జనలు; పళ్ళు తోమడం లాగా బహిష్టు విషయంలో గూడ శుచిని పాటించడం కొంతైనా అవసరం.

ఈ విషయంలో ఎంతవరకు వాటిని పాటించితీరాలన్నది మన మారాధించే మూర్తినిబట్టి వుంటుంది. ఉదాహరణకు శ్రీరాఘవేంద్ర స్వామి, శ్రీపాదవల్లభులు, శ్రీ నృసింహ సరస్వతిస్వామి బహు ఆచారవంతులు. కనుక వారి విషయంలో మనం బహిష్టు సమయంలో పూజ, పారాయణ చేయక మరుస్నానమయ్యాకనే వారిని పూజించాలి. వారి చరిత్రలు పారాయణ చెయ్యాలి. కారణం అప్పుడు మనకు వారిసన్నిధి లభిస్తుంది. శ్రీ సాయి చాలా మితంగా మాత్రమే శుచిని పాటించారు కనుక వారి చరిత్ర బహిష్టు సమయంలో ఆపి స్నానమయ్యాక చేయవచ్చు. కాని నేటి పరిస్థితుల ననుసరించి బహిష్టు సమయాలలో కూడ స్త్రీలు యింటిపనులు చేసుకొనక తప్పడంలేదు. కనుక సాయిచరిత్ర పారాయణ బహిష్టయిన మొదటిరోజు మాత్రం మాని మిగిలిన రోజులు చేయవచ్చు. పూజగూడ అంతే. ఆ సమయంలో స్త్రీలు విడిగావుండే అవకాశముంటే ఆ నాల్గురోజులు ఆపి మిగిలిన మూడు వారాలలోనే పారాయణ చేసుకొనడం ఉత్తమం. శ్రీ సాయి లీలలను, నామాన్ని మాత్రం సదా స్మరించవచ్చు.

ప్ర :- **ధనుష్కోటిలో సిద్ధారూఢస్వామి సముద్రస్నానం చేస్తున్న ఒకయాత్రికుని "నువ్వెందుకు స్నానం చేస్తున్నావు"? అని అడిగితే అతడేమీ చెప్పలేక "శరీరశుద్ధికి" అన్నాడు . అసలు సముద్ర స్నానమెందుకు చేస్తారు?**

**- శ్రీమతి శారద, హైదరాబాదు**

జః- మీరు వ్రాసినట్లు సముద్ర జలంలోని లవణాలు మొ॥నవి శరీరానికి మంచివన్నది స్థూలమైన కారణం. వివిధ పవిత్ర నదీజలాలు వాటిలో ఎందరో మహనీయులు అర్ఘ్యాదులు విడవడం వలన వాటి తీరాలలో మహ నీయులు స్నానము, తపస్సు ఆచరించడం వలన వాటికి పాత్రులయిన సాధకులపైన పవిత్రమైన అంతరంగిక ప్రభావముంటుంది. అట్టి నదులెన్నో సముద్రంలో కలుస్తాయి. గనుక అన్నింటిలోనూ స్నానమాచరించిన ఫలితం



సముద్రస్నానం వలన శ్రద్ధావంతులకు కల్గుతుంది. అంతేగాక బాహ్య ప్రకృతిలోని కొన్ని వస్తువులు నిగూఢమైన ఆధ్యాత్మిక సత్యాలను స్మరింపజేసేవిగా వుంటాయి. సముద్రము అపారము, అనంతము, భూమిపైయున్న జలమంతటికి నిలయము అవడం వలన భగవంతుని ఇట్టి గుణాలను మనసుకు స్ఫురింపజేస్తుంది. అంటే దాని దర్శనమువల్లనే మనస్సు అల్పమైన లౌకిక భావాలనుండి మనలను వుద్ధరిస్తుంది. అందుకే దానిని చూస్తూ వుంటే మనస్సు నిరామయమై తన్మయత కల్గుతుంది. **ఆకాశము నిర్గుణ బ్రహ్మాన్ని గురించి జ్ఞాపకముచేస్తే, సముద్రము సగుణబ్రహ్మ అయిన సద్గురువును స్ఫురింపజేస్తుంది.** అట్టి భావంతో స్నానం చేస్తే సద్గురు గుణభావ పారవశ్యం కల్గుతుంది. సద్గురువుని ఆశ్రయించని వారికి ఈ భావమంత స్పష్టంగాదు. కనుక ఫలితమల్పం. సద్గురువైన శ్రీ సిద్ధారూఢులని గుర్తించలేని ఆ యాత్రికుడందుకే సరియైన సమాధానమివ్వలేకపోయినాడు.

ప్ర :- ***మీరు వ్రాసిన 'సాయిబాబా జీవితచరిత్ర', ' శ్రీసాయి ప్రబోధామృతము' చూస్తే సాయి విధిగా ఎట్టి నియమాలు పాటించలేదని తెలుస్తుంది. అంతేగాదు. భక్తులను పాటించనివ్వలేదని కూడ తెలుస్తుంది. మన పెద్దలు స్నానము, మడి, ఆచారము ఎంతో జాగ్రత్తగా పాటిస్తారు, పాటించమంటారు. మరి సాయి నిషిధాగురువేమోయన్న సందేహం కల్గుతుంది ఏమంటారు?***

***- ఒక పాఠకుడు***

జ :- యోగసారమెరిగినవారు శ్రీ సాయి. అనుభవంలేకనే శాస్త్రాలను నమ్మి ఆశతో, అధిక న్యూనతా భావాలతో నియమాలను, ఆచారాలను పాటించేవారే సమాజంలో పెద్దలనబడే ఎక్కువమంది. యోగ విఘ్నాల గురించి "హఠయోగ ప్రదీపిక" యిలా చెబుతుంది.



శ్లో ॥ అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమగ్రహః।
జన సఙ్గశ్చ లేల్యం చషడ్భిర్యోగో వినశ్యతి ॥

తా॥ అమితంగా తినడము, అలసట గలిగించేంతటి పని, ఎక్కువ మాట్లాడడము, నియమనముగొనడం, జనసంసర్గము, చంచలత్వము అనే యీ ఆరింటివలన యోగం విశేషంగా నశిస్తుంది.

నియమనమంటే ప్రొద్దుటే స్నానము, రాత్రి నియమమైన ఆహారము మొదలైననియమాలను పెట్టుకొనడం వలన అవి సమకూడవనే ఆతురత కల్గుతుంది. దానిని అతిగా మాట్లాడడము, అత్యాహారాలతో సమానంగా పైశ్లోకం పరిగణిస్తుంది. 'లౌల్యం' అను పదానికి బాహ్యాచారంపట్ల అంధమైన పట్టుదల కల్గియుండడమని కూడ చెప్పవచ్చు. సర్వజ్ఞుడైన సాయిబోధ ఎన్నడూ పొల్లుబోదు. కాకుంటే అతిధుల గురించి అడిగిన నానాతో సాయి చెప్పిన సమాధానం కొంత యిక్కడ వర్తిస్తుంది. "**నానా శాస్త్రాలెప్పటికీ అబద్ధంగావు. కాకుంటే పనికిమాలిన అర్థాలను వాటికి నీవే కల్పించుకొని నీవే వాటిని సరిగా అర్థం చేసుకోలేదు**" అన్నారు సాయి.

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥**

---





# భక్తిపరమైనవి

ప్ర :- **దేముడంటే ఎవరు? ఎలా వుంటాడు? సాయిబాబానే ఎందుకు పూజించాలి?**

- బి. హైమావతి, వెంకటగిరి.

జ:- నామరూపాలు లేనిది, సకల సృష్టికీ ఆధారమైనది, అంతటా తానై ఉండే చైతన్య శక్తే భగవంతుడు. ఆశక్తి మనలోనూ ఎరుక (ప్రజ్ఞ)గాకూడా వుంది. కానీ ఆశక్తి స్థూలదేహము, దానికి పరిమితమైన మనస్సే అని భ్రమించినందువల్లఅసలైన భగవతత్త్వాన్ని గుర్తించలేకపోతాము. దీన్నే అజ్ఞానమంటారు. దాన్ని తొలగించి **అసలైనభగవతత్త్వాన్ని గుర్తించేలా నిదర్శనా పూర్వకంగా నిరూపించి దానిని తెలుసుకొనేలా ప్రేరేపించగలవాడే** సద్గురువు.

ఈ సత్యాన్ని ఈ కాలాని కనుగుణంగా బోధించారు గనుకనే సాయిబాబాను పూజించడం శ్రేయస్కరమని నా విశ్వాసం. కాని **తనను మాత్రమే పూజించమని సాయి ఎన్నడూ అనలేదు. సరిగా పూజిస్తే దేన్ని పూజించినా గమ్యం చేరుతారని బాబా చెప్పారు.** మునుపు చెప్పిన భగవతత్వం ఎవరిద్వారా మనకు మనస్సుకు హత్తుకునేట్లు తెలిసి తెలివిగా భక్తిశ్రద్ధలతో మనసు వారిపై నిలుస్తుందో వారినే సరిగా పూజించగలం! **సర్వగతమైన ఆత్మ ఒకటున్నదని తమ లీలల ద్వారా సాయి నిరూపించినంతగా చరిత్రలో మరెవరూ నిరూపించలేదు. అందుకని ఆయన్ను పూజించడం** శ్రేయస్కరమని మా విశ్వాసం.

ప్ర :- **నేనెంత కష్టపడినా సాయి దర్శనం కలుగలేదు. ఆయన వున్నారని మనమెంత వింటూరని నిశ్చయంకోనం వెదికాను. కారణము, కర్తవ్యము తెల్పగోరతాను?**

- నిరంజన్, వరంగల్.

జ :- సాయి రూప దర్శనం ఆధ్యాత్మికతకు అత్యావశ్యకం కాదు. సాయికి వారి గురువు వలన అనుభవమే లేదుకదా? వయస్సుతో పాటు అవగాహన, పరిజ్ఞానం పెరగటంలాంటిది ఆధ్యాత్మిక జ్ఞానం కలగటం. మధ్య అనారోగ్యం, ప్రమాదం సంభవించకుండా చూచుకుంటూ, సరియైన జీవితం గడుపుతున్నా కాలగతి అవసరం ఎదగడానికి, అనుభవాలు అవసరం



పరిపాకానికి. వీటికితోడు ఆధ్యాత్మికంగా అనారోగ్యం, ప్రమాదం లేకుండాలంటే సద్గ్రంధపఠన, యోచన అవసరం. మొదట మనం ప్రచురించిన మహనీయుల చరిత్రలు చదువు. వారి బోధలు చాలా జాగ్రత్తగా చదువు. ఎక్కడ వారు చెప్పిన దానికి నీవు భిన్నంగా వున్నావో చూచుకో. "సాయినాధప్రబోధామృతం" 4, 5 సార్లు నెమ్మదిగా చదువు. తర్వాత "మతం ఎందుకు?" చదువు. ఆ తరువాత గీత రోజూ కొద్ది శ్లోకాలు అర్థంతో చదువు.

ఇన్నీ చేసినా ఋణానుబంధాలు తీరాలి. కొత్త బంధాలు చుట్టుకోని ఆలోచనాశక్తి వుండాలి. కనుక నీకాళ్ళమీద నీవు నిలవాలి. ఇంట్లోవారికి నీ బాధ్యత నీవు నిర్వర్తించాలి. అంతరాత్మలో నీలక్ష్యం కోసరం ఓరిమి విశ్వాసాలతో కూడిన, నిరంతరదీక్ష, లేక నిష్ఠవుండాలి. ఇందుకు 'విజ్ఞాన వీచికలు' "సాయిబాబా" లో వస్తున్న వ్యాసాలు, "ఏది నిజం" జాగ్రత్తగా చదవాలి.

ఈ సృష్టంతా దేనితో చేయబడ్డదో-- ఆలోచనలన్నీ మనస్సుతో చేయబడినట్లు -- అదే దైవం -- అదే సాయి. దీని విషయంలోశంక ఎలావీలు? అదిలేక జగత్తు ఎలా వుండగలదు? "విజ్ఞాన వీచికలు" చూస్తే నీకు తెలుస్తుంది. 'విజ్ఞానవీచికలు' 3, 4, 5 అన్నింటికంటే చివర చదవాలి.

కానీ ఈ కృషితోబాటు భగవంతుడు మనకు విధించిన బాధ్యతలను ఆయనకు తృప్తి కలిగేటంత చక్కగా నిర్వర్తించాలి. సకాలంలో పండు పండినట్లు, పాలు తోడుకున్నట్లు, అన్నీ చేకూరుతాయి. నీ స్వప్నంలో నిన్ను ఒక వాడలో ఉంచిన భావమదే.

సృష్టి తత్త్వత: నిత్యనూతనం. అత్యద్భుతం. ఆ సంగతిని అనుక్షణం గమనించు. అలవాటువలన భావాలు స్మృతులతో ఈ విషయాన్ని మరుగుపరచనివ్వవద్దు. ఈ సృష్టియొక్క నిజతత్త్వం కుండల తత్త్వం మట్టి అయినట్లు "విజ్ఞానవీచికలు", "ఏదినిజం"లో ఇదే తెలుస్తుంది. దానిని ఆ భావంతో గుర్తించు. ఒక కుండయొక్క (మట్టి అనే) తత్త్వమే అన్ని కుండల తత్త్వమున్నూ. అది తద్భిన్నంగా తోచడమే అజ్ఞానం; అనాలోచితమైన గుడ్డి జీవితము. అందులోని వ్యక్తులు, పరిస్థితులు, వస్తువులమీద దృష్టి నిలిస్తే



సత్యం మరుగవుతుంది. రాగము, ద్వేషము మనదృష్టినలా లాగుతాయి. సాయిచరిత్రంతా ఈ భావాన్నే ఘోష చేస్తున్నది. **వ్యక్తులను వ్యక్తులుగా చూడక, అలలన్నింటినీ ఒక నీటి ప్రవాహంగా చూచినట్లు, ప్రకృతి సంతటినీ, జీవితమంతటినీ సమగ్రంగా దాని తత్త్వాన్ని గుర్తిస్తూ చూడు. స్తబ్ధత వుండదు.** స్తబ్ధత మృతి. నిత్యనూత్నమైన ఆనందాశ్చర్యాలు సత్యమైన జీవితం. శాశ్వతమైనది. నా గ్రంధాలలో, ఈ జాబులో, నా హృదయంలో నీకెప్పుడూ సాహచర్యం ఉంటూనే వున్నది. ప్రక్కకుండలోని మట్టికి మరో కుండలోని మట్టికి భిన్నంగా ఎక్కడ, ఎప్పుడున్నది? అలా భిన్నంగా, దూరంగా వున్నదన్నది భ్రాంతే. అపోహ మాత్రమే. అందుకే మనవారందరమూ ఎప్పుడూ కలసి ఒకచోటే ఉన్నాము సాయిలో.

ప్ర :- ***శ్రీ శిరిడీ సాయిబాబా నాకోర్కెలు తీరుస్తే ఆయనే నాగురువుగా ఎంచుతాను. ఒక విద్యాలయము, వేదాంత గ్రంధాలయము, ఆశ్రమము, అనాధశరణాలయము, సాయిబాబా గుడి నాచేతుల మీదుగా కట్టించాలని నా కోరిక. ఇంతకన్నా పుణ్యమార్గం లేదు-***

***- రమణబాబు, విజయవాడ.***

జ :- ఈ రోజులలో యీ పనులేవి చేసినా పుణ్యకార్యాలు కాజాలవు. విద్య కావలసిన పిల్లలకు దొంగ మార్కులు, కాపీలు కొట్టించక చక్కని నైతిక విలువలతో కూడిన చదువు యిప్పించాలని తపించే తల్లిదండ్రులు కూడా కరువైపోతున్నారు. కష్టపడి నిర్మించగానే అది అవిద్యాలయంగానూ, క్రమశిక్షణారాహిత్య శిక్షణ శిబిరంగాను తయారయ్యేది తథ్యం. కారణంఅలా తర్ఫీదైన టీచర్లే ఎవరికైనా దొరకపోయేది. వేదాంత గ్రంధాలు యిళ్ళలోనే చదివేవారు లేక దుమ్ము ,పురుగులు కొట్టుకుంటుంటే గ్రంధాలయా లెందుకు? మనంకోరినది నెరవేరుస్తేనే గురువుగా ఒకరిని అంగీకరించగల యీ తరానికి వేదాంతం అపథ్యం - టైఫాయిడ్ రోగికి పంచభక్ష్య పరమాన్నంలా - ఆశ్రమం కావలసింది సాధకులకు. సాధకులేరీ దానిని ఉపయోగించుకోడానికి? ఆ నిర్వహణ వలన రాజకీయాలు, కార్పణ్యాలు, అసూయలు ఏర్పడతాయి. ఆశ్రమవాసులమధ్య అంతకుమించి ఏమీ ప్రయోజనముండదు. అనాధ



శరణాలయంలోనూ అవే యిబ్బందులొస్తాయి. మీరు చెప్పిన వాటిలో యిదొక్కటే కొంచెము వాంఛనీయమన్పిస్తుంది. కానీ ప్రభుత్వం బాగానే చేస్తుంది. వారితో మనమూ కలిసిజీవిస్తూ స్వయంగా మన బిడ్డలుగా వారిని చూచుకోగలిగితేనే దానిని స్థాపించాలి సుమా! ఇక గుడి, ఇది కత్తి, నిప్పులాగా ఎంత మేలు చేయగలదో అంత చెడూ చేయగలదు. ఎంతో ఆలోచించి చేయాలి. అసలు భగవంతుడు ఆశించేది ప్రతి యిల్లు, ఆలయము, ఆశ్రమము, అనాధ శరణాలయము, ఆధ్యాత్మ గ్రంథాలయమూ, పాఠశాల కావాలని, ప్రతి కుటుంబము ఉత్తమమైన ధర్మక్షేత్రము కావాలని, ఇందుకు సాయి చరిత్ర, గురుచరిత్ర సాయిబోధలకు తోడు యితర సద్గ్రంధ శ్రవణము, నిత్యము ప్రతి మందిరములోను, ప్రతియింట్లోను జరగాలి. ఎన్ని ఆలయాలున్నా అది జరగడం లేదు. **సాయి చెప్పిన జీవిత ధర్మాన్ని అర్థంచేసికొని పాటించే యత్నంచేయక ఉరికే రాయికి మ్రొక్కినట్లు ఆయనకు మ్రొక్కడం ఆయన కోరలేదు. ఆయనవద్దకు లక్షలాది మంది వచ్చారు. అయితేనేమి, "నేనివ్వదలచిన జ్ఞానం అడిగేవాడు, తీసుకునేవాడు ఒక్కడు కూడా నాకు కన్పించలేదు. ప్రతివాడు వలనుగాని గొంతెమ్మ కోర్కెలతో నన్ను వేదించేవాడే" అన్నారు కూడ.**

ధర్మమేమిటో ప్రజల హృదయాలను ఆకర్షించేలా తెల్పి ఆచరింపచేసే పాఠశాలలు దేవాలయాలని మరువడం వలననే అవి కూడా వ్యాపార సంస్థలుగా మారుతున్నాయి. **మేము ప్రచురించిన "శ్రీ గురుచరిత్ర" ఉపోద్ఘాతంలో శ్రీవాసుదేవానంద సరస్వతి స్వామివారు ఆశించినవన్నీ ఎలా సాధించి నిర్వహించారో, మొదట అందుకవసరమైన దైవ సందేశమొచ్చాకనే ఎలా అందుకు పూనుకున్నారో గమనించండి. ఆ పవిత్రకార్యాలెలా ఆచరించాలో ఆయన చూపారు. శ్రీరామకృష్ణ పరమహంస గూడ భగవంతుని నుండి తాను ప్రత్యేకమైన ఆదేశం పొందకముందుఇటువంటి కార్యక్రమాలకు ఉపక్రమించరాదని స్పష్టంగా, గట్టిగా హెచ్చరించారు సుమా! బాగా మరలా అవన్నీ చదివి ఆలోచించి అప్పుడు ముందడుగు వేయండి. లేకుంటే జీవితమంతా**



పరితాపమే. హృదయవేదనేఎదురయ్యే ప్రమాదమున్నది.

*ప్ర :- సాయినాథుని ప్రాతఃకాలం నుంచి రాత్రివరకూ ఎలా పూజ చేయాలి? గురు దక్షిణ, భిక్షలు ఎలా జరపాలి?*

- ఎ. సత్యనారాయణ, సూళ్ళూరుపేట

జ :- **శ్రీసాయి ఎప్పుడు ఎల్లెడలా వుంటారు. కాని ఆ విషయం గుర్తుపెట్టుకున్నవారికి గుర్తుపెట్టుకున్నంత ఫలితం ఉంటుంది.** చంచలమైన మనస్సుగల పామరులకు బాహ్యమైన విషయాల ప్రభావమే ఎక్కువగా వుండి ఆ విషయం గుర్తుండదు. కనుక రోజంతా తమకు సద్గురువు యొక్క సాన్నిధ్యముంటుందన్న సంగతి గుర్తుంచుకోడానికి అలంబనగా మూర్తి పూజ విధించబడినది. ప్రత్యక్షంగా సాయినాథుడు మనతోవుంటే ఉదయం నుండి సాయంత్రము వరకు ఏ సేవలు చేస్తామో, వాటినే మందిరంలోని మూర్తికి అలానే చేయాలి. నిదురలేవగానే ఎంతటి మహనీయుడు మనచెంతనున్నాడో గుర్తురావాలి. అదే ప్రాతఃస్మరణయైన ధ్యానము. తర్వాత సర్వమూ సిద్ధంచేసి నిత్య కృత్యానికి నిదురలెమ్మని ప్రార్థించాలి. మనం నిత్యకృత్యాలు తీర్చుకుని బాహ్యాంతరాలను శుద్ధి చేసుకొని వారిసేవకుపక్రమించాలి. అప్పుడు చేసే సేవనే 16 ఉపచారాలుగా పూజా విధానం రూపొందించింది. గృహస్థ ధర్మాలను నిర్వర్తించుకోవలసిన అవసరంవలన రోజుకు రెండుమూడుసార్లు మాత్రమే పరిమిత సమయాలలో పూజ చేస్తాము. కానీ పూజయే తన విధిగా కల అర్చకుడుగాని, లేక అవకాశం కలిగినపుడు మనంగాని ఉదయంనుండి సాయంత్రము వరకు మనం చేసుకునే ఉపచారాలన్నింటిని వారికి ఆయా సమయాలలోనే చేయాలి. మన స్నానమయ్యాక అంత వివరంగానూ వారికి స్నానం చేయించాలి. మన భోజనానికి ముందు అంత వివరంగానూ వారికీ నైవేద్యమివ్వాలి. భోజనమయ్యాక నిజమైన సత్పురుషుడు పగలు నిద్రించడు. అందువలన భోజనమయ్యాక మనముగూడ ఆయన సన్నిధిలో, సద్గ్రంథ పఠనమో, శ్రవణమో చేయాలి. రాత్రి వారిని నిద్రపుచ్చాకనే మనము భగవత్ స్మరణతో నిద్రించాలి. ఇదీ మన శరీరాన్ని వారిసేవకర్పించడమంటే. వారి బోధలు మననం చేసికొని, మన ప్రవర్తనను, మనోభావాలను సంస్క



రించుకోవడమే, వారిని ధ్యానించడమే, మనస్సు నర్పించడమనే మంత్రపుష్పం. వారి లీలలను, బోధలను ప్రక్కవారికి తెల్పి లోకకళ్యాణానికి తోడ్పడడము, మహాత్ములను చక్కగా ప్రశ్నించి సద్విషయము తెలుసుకొనడము, సద్భావంతో సాటివారితో మాట్లాడడము వాచికమైన సేవలౌతాయి. యిట్టి శ్రద్ధతో జీవితమంతా గడపడమే మానసికమైన దక్షిణ. మనమార్జించిన ధనాన్ని, ఆయన బోధించి ఆచరించిచూపిన ఈ ధర్మంతో సాటివారిని ప్రభావితులను చేయడానికి, నిరుపేదలకు, పరమేశ్వరార్పణ బుద్ధితో అన్నవస్త్రాలివ్వడానికి వినియోగించడమే దక్షిణ సమర్పణ, మరియు భిక్ష. జీవితంలో అనివార్యంగా కల్గే కష్టనష్టాలనడుమ ఈ జీవిత విధానాన్ని మరువకుండడమే నిష్ఠ, సబూరీలతో జీవించడమంటే. యిలా జీవిస్తే అవాంఛనీయ మనోభావాలకు తావుండదు. క్రమంగా యింద్రియ మనోజయం దానికై అదే సిద్ధిస్తుంది. ఇలా చేయగల్గాలంటే, తరచుగా వారి చరిత్ర పారాయణ, బోధల మననము చేస్తుండాలి. యిలాగాని పూజ వ్యర్థము. క్రమంగా లౌకిక విషయాల ప్రాబల్యం ఎక్కువై పూజ యాంత్రికము నిర్వీర్యము అవుతుంది! నిరంతరము 'పూజ చేయువాడు' అవడంమాని పూజకు 'అరి' లేక 'శత్రువు' అవుతాడు.

ప్ర :- ***సాయిచిత్రము ప్రతిదాని మీద ముద్రిస్తుంటే ఆకాగితాలు చెత్తలో పడతాయి అది తప్పుగదా?***

***- జి. పిచ్చయ్య,(ఖమ్మం)***

జ :- సాయి ఎప్పుడూ సర్వగతుడే -ఆలయాలు, జీవులు ధూళి రేణువుల దగ్గరనుండీ ఆయనే - ఆసంగతి గుర్తుంచుకునే సాధనయే మనం ముద్రించుకొనే బొమ్మలు. చెత్తలో కూడా ఆయనే వున్నాడన్న ఎరుక కల్గించడానికి అదీ పనికివస్తుంది. ఆ దృష్టి కలిగియుంటేచాలు అది మరవడమే నిజానికి సాయిని చెత్తకుప్పలో పడవేయడం వంటిది.

నామదేవుడికి -- ఒక శివాలయంలో విరోభాకేశుడనే పండు ముసలి శివలింగంపై కాళ్ళు పెట్టుకు పడుకొని దర్శనమిచ్చాడు. నామదేవుడు అభ్యంతరం చెబుతే శివుడు లేనిచోట తమ పాదాలుంచమని కోరాడు. నామదేవుడతని పాదుకలు ఎక్కడ పెడితే అక్కడ శివలింగం ప్రకటమై



నామదేవునికి జ్ఞానోదయమైంది. ఆ దృష్టి కలిగేలోగా యివన్నీ తప్పవు. ముద్రిస్తే కొన్ని నష్టాలు, ముద్రించకుంటే కొన్నినష్టాలువున్నాయి. ప్రతిదానిని సాధనంగా మల్చుకుంటూపోవాలి.

ప్ర :- ***నాకు ప్రశాంతమైన ఆశ్రమ జీవితమూ, భగవంతుని సేవ కావాలన్పిస్తున్నది. నేనేమి చేయాలి?***

**- పి. నీలవేణి, 10వ తరగతి, మైలవరండామ్**

జ :- చక్కని ఆశ్రమ జీవితం అంటే ఉద్యోగంచేసి, రిటైరు అయి ఫించను తీసుకోవటం ప్రశాంతంగా జీవించటంలాంటిది. అది హాయిగానే వుంటుంది. కానీ అలా ఫించను రావాలంటే అంతకుముందు చక్కగా ఉద్యోగం కష్టపడి చేయాలి. అందుకు అంతకుముందు చక్కగా చదువుకోవాలి. అలా చేయనివారికి జీవితాంతమూ కష్టము చేసికొని చాలీచాలని బ్రతుకు తప్పదు. అలానే మనం ఈ చదువులు చక్కగా చూచుకుంటూనే మిగిలిన నా రచనలు చదివి ధర్మం తప్పక 'సాయిప్రబోధామృతంలో'' చెప్పినట్లు ఈ ప్రపంచంలోని కష్టసుఖాలు ఎదుర్కొంటూ జీవించాలి. ఇది కష్టమన్పించినా బలాన్ని పెంచుకునే వ్యాయామం వంటిది. చివరకు కష్టాలరూపంలో వెనుకటి పాపాలు కడిగేసుకున్నాక, మనమాచరించిన ధర్మం పేరున పుణ్యం పేరుకొని ఫించనులాగ ఆశ్రమ జీవితాన్ని తగిన సమయంలో యిస్తుంది. అపుడు పరిస్థితులు వాటికవే సాయి దయవలన అనుకూలిస్తాయి. ఈలోగా అందుకోసం ప్రయత్నిస్తే పాపం పెరుగుతుంది -- వాడని కత్తి తుప్పు పట్టినట్లు. వ్యాయామం లేని శరీరం బలహీనమై, రోగాలువచ్చి ముసలితనంలో బాధపడవలసి వచ్చినట్లు. కనుక జీవిత కష్టసుఖాలలో ఉంటూనే వాటిని న్యాయంగా ఉపయోగించుకొని, ఆత్మబలాన్ని ఆరోగ్యాన్ని పెంచుకోవాలి. అదెలాగో నా రచనలలో వున్నది.

ప్ర :- ***దేవతలను అనన్యంగా ఉపాసిస్తే ఉద్ధరించగల సద్గురువును చూపుతారని ఎందరి అనుభవాలో తెల్పుతున్నాయి. దైవమే కరుణించినపుడు సద్గురువుయొక్క ఆవశ్యకత ఏమిటి?***

జ :- మన పూర్వపుణ్యాన్ని, ప్రస్తుత శ్రద్ధనూ అనుసరించి లౌకికమైన కష్టాలు తీర్చడము, ధర్మం తప్పినపుడు మనను దండించడము దేవతల



కర్తవ్యము. కారణం సృష్టి అనే క్రియ కొనసాగించడానికి ప్రకటమయిన భగవంతుని శక్తులు పరిమితంగా ప్రకటమైన తత్వాలే దేవతలు. ముక్తిని ప్రసాదించడానికి అవతరించిన భగవంతుని కరుణా స్వరూపాలే సద్గురువులు. తమనుపాసించినవారికి దేవతలు తెల్పేదికూడా యిదే.

*జః- భగవంతుడు అంటే ఏమిటి?*

**- ఆర్.వి. సత్యనారాయణ, నల్గొండ.**

సముద్రంలో అలలు, మనసులో ఆలోచనలు ఉద్భవించి, కొనసాగి లయించినట్లే - విశ్వంలోని రూపాలన్నీ దేనిలో ఉత్పన్నమై కొనసాగి లయిస్తున్నాయో అట్టి విశ్వచైతన్యమే భగవంతుడు. తలంపులన్నిటి రూపాలలోనూ మనస్సు, అన్ని అలలలోనూ నీరువున్నట్లే ఆయన అన్ని రూపాలలోనూ వున్నాడు. కలలోని రూపాలన్నీ మన మనస్సే అయినా మనకాసంగతి తెలియక భయము, సంతోషము మొ॥స భావాలు పొందినట్టే, మనం మోహితులమవడం వలన మనకా విషయం తెలియదు. భగవంతుడు, సృష్టిపట్లమన అజ్ఞానంగూడ అలాంటిదే. ఇంతకుమించి **పరిమితమైన మనబుద్ధికి పరిమితమైన మాటలలో అనంతమైన భగవంతుని గూర్చి వివరించడం సాధ్యముగాదు, ప్రయోజనమూలేదు. సాయి చెప్పినట్లు గురువును సేవించి తెలుసుకోవలసిందే**. ఈలోపల సాయిలీలల నుంచి, శ్రీ గురుచరిత్రలో బోధలనుండి భగవంతుని గురించి తెలుసుకొని, వాళ్ళు చెప్పిన నిర్దుష్టమయిన మార్గాన్ని అనుసరించడమొక్కటే మార్గం.

*ప్ర :- **అన్నిసంస్కారాలలాగే హృదయ పూర్వకమైన భక్తిగూడా పూర్వజన్మ సుకృతమేమో, లేకుంటే మీవంటి వారికి మొదటి దర్శనంలోనే అంతటి అనుభవము, ప్రశాంతత కల్గడము, నావంటివారు నిత్యదర్శనము చేస్తున్నా భక్తి గూడ మిగిలిన భావాల లాగే తాత్కాలికము మాత్రమే అవడమేమి? అలా అయితే సాయి కోరిన నిష్ఠ, సబూరీలను అర్పించడం మనచేతులలో ఏమున్నది.***

**- ఒక పాఠకురాలు - హైదరాబాదు.**

జ :- అన్ని సంస్కారాల వలె భక్తికూడ పూర్వజన్మ సుకృతమే. పూర్వజన్మ సుకృతమంటే వెనుకటి జన్మలలో మనం చేసుకున్న మంచి యొక్క



ఫలితమే. కనుక ఈ జన్మలో మనము శక్తినంతా వినియోగించి కృషిచేసి అట్టి ఫలితాన్ని పొందగలగడం మన చేతులలోనే వుంది. అందుకే **"ఉద్ధరేదాత్మ దాత్మానాం"** - ''తనను తానే ఉద్ధరించుకోవాలి'' అని భగవద్గీత చెప్పింది. కానీ సాయి చెప్పినట్లు ''ఈ మార్గంలో పయనించడం దున్నపోతునెక్కి నాన్నేఘాట్ దాటటంకంటే కష్టం'' మన శక్తినంతా వినియోగించి కష్టపడితేగాని ఫలిత ముండదు. మన యత్నం చాలినంత తీవ్రంగా జరిగితే ఫలితం ఈ జన్మలోనే కల్పించవచ్చుగూడ. ఇది స్వానుభవము. 1955 సం॥లో నా ఉపనయనానికి దైవజ్ఞులు పెట్టినముహూర్తబలం, ఆ క్రతువులోని వేద మంత్రాలు, మా పెద్దన్నగారి పూజలు, ఉపవాసాలు వారి అబ్బాయిని రక్షించలేకపోవడం చూచి తీవ్రమైన నాస్తికభావం, అంతకంటే గూడ అన్వేషణ నాలో మేల్కొన్నాయి. నిరంతరము జీవితపరమార్థి, చావు పుట్టుకల తత్త్వము, ఆత్మ-అనాత్మల గురించి తీవ్రంగా దృఢంగా 1961 వరకూ ఆలోచన కొనసాగింది. రాత్రిళ్ళు 3, 4 గంటలకంటే నిద్రయెరుగను. వ్యక్తిగతమైన అభిమానంతో ఏ గురువుకూ తలతాకట్టు పెట్టుకొనలేదు. గుడ్డిగా ఎవరు చెప్పినదీ అనుసరించలేదు. ఆధునిక విజ్ఞానం అధ్యయనం చేసి చివరకు ఆస్తికభావం కలిగినా, సాధనమార్గం గూడ ఎవరు చెప్పినా అనుసరించలేదు. తెలిసో తెలియక చేసిన ఆకృషి ఫలితమే శిరిడీలో సాయి నిరంతరమూ వర్షిస్తున్న అనుగ్రహానికి పాత్రుణ్ణి చేసింది. అట్టి జిజ్ఞాసలో ఏ ఉద్యోగమూ నన్ను ఆకట్టుకోలేకపోయింది. అయితే అన్నగారి అబ్బాయి చనిపోయినప్పుడే, అందరివలె శోకించి కొద్దికాలానికి బాధ మరచిపోకుండా చేసిందీ సుకృతమే కావచ్చు. సద్గురువుయొక్క అనుగ్రహము ఎప్పుడూ మన సుకృతం వలన - అంటే తీవ్రమయిన కృషివలన సార్థకమవుతుంది. అట్టి కృషి ఫలితంగానే తర్వాత గూడ ఎవరో శ్రమించి వ్రాసిన గ్రంథాలలోని విషయాలను నేర్చుకున్నా ఆ విషయం రచనలో ప్రకటించనిదే మనశ్శాంతి వుండదు.

*ప్ర :- నన్ను నమ్ముకున్న వారిని చివరంటా గమ్యం చేరుస్తానంటారు బాబా. ఆ గమ్యం ఏమిటి? నమ్ముకోనివారంతా గమ్యం చేరనట్లేనా? తనను నమ్ముకోవాలి అని బాబా ఎందుకు కోరుకోవాలి?*

*- ఆర్. వి. సత్యన్నారాయణ, నల్గొండ.*

జ :- ''నన్ను నమ్మి నేనిచ్చే మందును తీసుకుంటే నీరోగం తీరుస్తాను అని డాక్టరు అంటాడు. జబ్బు తగ్గాలనుకున్న వారు అలా చేస్తేనేగదా జబ్బు



తగ్గే అవకాశముండేది? అలాటిదే బాబా అన్నమాట. వైద్యుడు మననుండి కనీసం ఫీజైనా కోరతాడు? సాయి అది కోరరు. ఆయనకు కొబ్బరికాయకొట్టినా తినేది, అగరువత్తి వెల్గించినా మనకు తెలిసినంతలో ఆ సువాసనకు ఆనందించేది మనమే. మన నుంచి చిల్లిగవ్వయైనా ఆశించక మేలుచేసిన వారిపైకల్లే ప్రేమను నమ్మకమంటారు. అది వుంటేనే మన బాగుకోసం ఆయన చెప్పినది మనం చేయగల్గుతాము. అప్పుడు గమ్యం చేరుతాము. ఇక్కడ లక్ష్యమంటే అంతులేని తృప్తి, శాంతి; అదే భగవంతుడు. వైద్యుని నమ్మలేనివారి శరీరానికేది గతో, కేవల ప్రేమ స్వరూపమైన సద్గురుని నమ్మలేని వారి ఆత్మలకూ గతి అదే. **"సంశయాత్మ వినశ్యతి"** అన్నారు ఋషులు. పై వాక్యాలు చెప్పి సాయి అంటే శిరిడీలో నివసించిన ఆ 5 1/2 అడుగుల శరీరమే కాదని ఆయన తెలిపారు. అన్ని జీవుల రూపాలలోనూ, సకల సృష్టి రూపములోనూ ఏ దైవశక్తివున్నదో అదే తామని భక్తులకు అనుభవమిచ్చారు. అన్నీ ఆయనే అయినప్పుడు మన రూపంలో గూడ ఆయనలోని అంశమే -- భాగమే వున్నది. ఆయనను నమ్మలేకపోవడమంటే మనను మనమే నమ్మలేకపోయినట్లు. ఇక అటువంటి మనస్సుకు శాంతి ఎక్కడుంటుంది? పైప్రశ్నలల్లోని చివరి వాక్యం -- సాయి అంటే ఆశరీరమేనని పొరపడడం వలన వస్తుంది. అలానే తలచినా, ఎందరి మహనీయుల చరిత్ర చూసినా సాయిచరిత్ర తలమానికంగా సాటిలేనిదిగా నిలుస్తుంది. చరిత్ర చదివితే ఆ ప్రశ్న రాదేమో.

*ప్ర :- సన్యసించనిదే మోక్షము లేదని కొన్ని గ్రంథాలు, మహాత్ములు చెప్పారు. నిజమేనా?*

***- డి. కనకముత్యము, యండగండి.***

జ : సర్వజీవుల శ్రేయస్సు కోసం నిరంతరం పాటుపడుతూ, ధర్మ బద్ధమైన భుక్తి సంపాదించుకొనేవారికి కేవలం దైవస్మరణచాలు. అలాగాక చిలిపిగా బ్రతికే వారి పిల్లలకు వుపనయనము, బ్రహ్మచర్యములనే సంస్కారమివ్వకుంటే వారిలోనూ, వారివల్ల ప్రపంచములోను అధర్మం ప్రబలుతుంది. బ్రహ్మ చర్యంలో నేర్చిన విద్య,అలవర్చుకున్న సదాచారాలతో



మాత్రమే గృహస్థాశ్రమం సక్రమంగా నిర్వర్తించాలి. వారికి మాత్రమే సన్యాసము సార్థకము, అవసరము. బాధ్యతలు తీరాక ఆశ, మమకారము విడిచినవారికే ముక్తి సాధ్యం. అట్టివారికి మాత్రమే సన్యాసమివ్వాలి. ఆశ విడవలేనివారు సన్యసిస్తే అది మిధ్యాచారమై రెంటికీ చెడతారు. మానవులలో ఎక్కువమంది ఈ క్రమంలోనే ముందుకు పోవాలి. చాలా అరుదుగా రామకృష్ణ పరమహంస, రమణమహర్షివంటి ఏకొద్దిమందో పూర్వ సంస్కారబలం వలన మొదటినుండే సర్వసంగ పరిత్యాగులవగలుగుతారు. మిగిలినవారు అలా చేయకూడదని వేదం స్పష్టంగా చెప్పింది. గీతలో కూడ కర్మలన్నీ శాస్త్ర విధి ననుసరించి ఆచరిస్తూ వాటి ఫలంపట్ల ఆసక్తిని మాత్రమే సన్యసించాలని శ్రీకృష్ణుడు గూడ చెప్పాడు. క్రొత్తగా సన్యసించినవారికి తమ ఆశ్రమంపై శ్రద్ధ బలపడటానికి పెద్దలు వ్రాసిన గ్రంధాలు యినాడు ప్రజలు స్వతంత్రించి తమకైతామే చదువుకోవడంవల్ల, కీర్తిని, డబ్బును ఆశించి ధర్మ ప్రచారానికి దిగడంవలన యిట్టి అపోహలు కల్గుతున్నాయి. సన్యాసం బాహ్యమైనది మాత్రమే అయితే మీ ప్రశ్నకు తావున్నది. అంతరంగికమైతే ప్రశ్నేరాదు. వివేక వైరాగ్యాలు సంపాదించి గూడ లౌకిక ధర్మాలు పాటించడం వుత్తమమని శ్రీకృష్ణుడు చెప్పాడు. అందుకే సాయి ఎవరినీ సన్యసించమనలేదు.

ప్ర :- ***ధ్యానానికి రూపమూ, నామమూ అవసరమా? ప్రార్థనకు పటము, విగ్రహము అవసరమా?***

**- అన్వేషి, చింతపల్లి.**

**జ :-** ఏదైనాసరే అవసరమా? అని ప్రశ్నిస్తే 'ఎవరికోచెప్పు, అప్పుడు చెబుతాను' అన్నదే నా సమాధానం. ఒకరికి అవసరమైనది ఇంకొకరికి అవసరము కాకపోవచ్చు. మనసులో రేఖాగణితం చేసుకోగల వాడికి కాగితంమీద బొమ్మగాని, లేక గణితసూత్రం గీచి గుణించుకోనవసరముండదు. అలాటివారికి అవి గీచుకొనడం అనవసరమైన బాదరబందీ అన్పిస్తుంది! అలా గీసుకుంటేనే గణితం సులభమన్పించేవారికి మనస్సులో గుణించుకొనడం వృధా ప్రయాస అన్పిస్తుంది. ఇద్దరూ సాధకులైతే, పరస్పరం తర్క వితర్కాలు



లేకుండా ఎవరికి సులభమన్పించిన సాధన వారు చేసుకుంటారు. దానిగురించి చర్చించి యితరుల వాదం తప్పని ఋజువు చేయజూచేవారికి, సాధన చేయడంకంటే తమకెక్కువ తెలుసునని యితరులనుకొనడం, వాదంలో గెలవడము యిష్టమన్నమాట. సాధకుడు కాకపోయాక యీ ప్రశ్న అప్రస్తుతమవుతుంది. ఏది రైటైతేనేమి - తాను దాని ననుసరించక, దానిని గురించి యితరులతో చర్చించడం మాత్రమే లక్ష్యమయ్యాక ?

అయినా యీ రెంటిలో ఏది ఎక్కువ స్థితి, ఏది తక్కువ ? అంటే, ఆ రెండూ గొప్పస్థితులేగాని, వాటి గురించి ఇది ఎక్కువది, అది తక్కువది, అని వాదించేవారిది మాత్రము అన్నిటికంటే హీనమైన స్థితి.

*ప్ర : "మీరు సాయిని పూజిస్తున్నా ఆయన మీ కష్టాలు తొలగించలేదు గదా? ఆయననువిడచి గ్రహశాంతులు చేస్తే కష్టాలు తొలగుతాయి." అంటున్నారు కొందరు, ఇది ఎంతవరకు నిజం ?*

*- ఒక పాఠకుడు.*

జ : కష్టసుఖాలు పూర్వపుణ్య పాపాల ఫలితాలే. గడియారం ప్రొద్దును సూచించినట్లు, జాతకంలోని గ్రహాలు మన పూర్వపుణ్య పాపాల పాళ్ళు, క్రమము కొంతవరకే సూచించగలవు. గడియారంలో ముల్లు త్రిప్పేస్తే పొద్దుకూడ తిరిగిపోతుందా ? కనుకనే యితర మతాలలో గ్రహశాంతులన్నవిలేవు. నేరం చేసినవాడు శిక్ష అనుభవించడం ధర్మంగాని అతడు పోలీసులను, న్యాయమూర్తులనూ తృప్తి పరచి శిక్ష తప్పుకోవడం న్యాయమా ? ఈ గ్రహాలన్నీ ఆ దేవుని బంట్లే పోలీసులు, న్యాయమూర్తులు ప్రభుత్వం యొక్క సేవకులైనట్లు కర్మననుసరించి ఫలితాన్ని సూచించేలా దైవం వాటిని శాసించాడు. మనం చేసిన పూజల వలన దైవశాసనాన్ని కాదనగలమా ? కాకుంటే ప్రభుత్వమే ఒక నేరస్తునిలో కలిగిన పరితాపానికి, పరివర్తనకూ మెచ్చి శిక్ష కొంత తగ్గించవచ్చు; అలానే సృష్టియంతటికీ ప్రభువైన భగవంతుడు గూడ ! మనం మన పూర్వ పాపాలకు ఆయన న్యాయంగా - అంటే సర్వజీవులపైన సమానమైన ప్రేమతో మనకు విధించిన



శిక్షను హృదయ పూర్వకముగా స్వీకరించి ఓరిమితో, ఆయన ధర్మపరతపట్ల, కరుణ పట్ల పూర్ణ విశ్వాసంతో అనుభవిస్తూ, మన పూర్వకర్మ దోషాన్ని అలా అనుభవం ద్వారా కడిగి వేసుకొనే అవకాశమిచ్చినందుకు ఆయనకు కృతజ్ఞత తెల్పుకుంటూ, విడవక ఆయనను ప్రార్థిస్తూంటే, మనలో కల్గిన పరివర్తన వలన మన ధర్మబుద్ధికి మెచ్చి జాలిచెందిన ఆ ప్రేమమయుడు తనకై తానే ఆ శిక్షను తగ్గిస్తాడు; పూర్తిగా రద్దు చేయడు. కారణం, అలా చేస్తే యిక జీవులన్నీ పాపాలే చేసి, శిక్ష అనుభవించబోయేముందు దైవాన్ని ప్రార్థిస్తారు ! ఇక న్యాయమెవ్వరూ పాటించక, సాటి జీవులందర్నీ హింసిస్తుంటారు. కనుక ఆయన కర్మఫలాన్ని రద్దుచేయనందుకు ఆయనకు కృతజ్ఞతలే తెల్పుకోవాలి. ఆ భగవంతుడే సద్గురువు సాయి కనుక నీ విశ్వాసమే సరియైనది. సాయి చెప్పినట్లు ఓరిమి -- నిష్టలతో, అవగాహనతో సాయిని ప్రార్థించాలి. గ్రహశాంతులే నిజమయితే పాండవులు, రాముడు, హరిశ్చంద్రుడు ఎందుకు కష్టాలు పడతారు ? ఇలాంటి అజ్ఞాన పూర్వకమైన కోరికలతో వివిధ దేవతలను ప్రార్థించేవారు అజ్ఞులని, వారి పాత్రతను బట్టే వారికి ఫలితమివ్వవలసినది అద్వయుడు (ఒక్కడే) అయిన భగవంతుడేనని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పాడు. తపస్సుతో కర్మదోషం తొలగించుకోవచ్చు. కాని తపస్సంటే అవగాహన, ఓరిమిలతో కఠినమైన కష్ట జీవితాన్ని అంగీకరించి, భగవంతుణ్ణి ప్రార్థించడమే ! అట్టి నిశ్చలభక్తితో సాయిని ప్రార్థిస్తుంటే సాయి చాలా వరకూ కష్టం తగ్గిస్తారని వారి చరిత్ర నిరూపిస్తున్నది. నీకు సలహా యిచ్చినవారు సాయిని మించిన జ్ఞాని కాదుకదా ? "శ్రీ సాయి ప్రబోధామృతము" చదివి మననం చేస్తే నీ మనస్సు స్థిరమవుతుంది.

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా!**
**ఉపదేక్ష్యన్ని తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః!!**

---



# ధర్మపరమైనవి

*ప్ర : నిత్యకృత్య విధి నిర్వహణలో బాబా సూక్తులను **అమలుపరచ** యత్నిస్తూ, మానవత్వంతో ప్రతివారిలోను బాబా వున్నాడని, ధర్మబద్ధంగా వుండయత్నిస్తే వ్యాపారంలో నష్టపడటం జరుగుతుంది. వీటికి సమన్వయం ఎలా ?*

**-- డీ. కృష్ణమూర్తి, ఒంగోలు.**

జ : రోగులకు మందు పథ్యము ఎలా యివ్వాలో అలానే మానవతా విలువలు నెరుగని వారితో మనం వ్యవహరించేటప్పుడు వారిని సాధ్యమైనంతవరకు క్రమశిక్షణతో మనతో వ్యవహరించేలా, చేయడానికి అవసరమైన యుక్తిని ఉపయోగించాలి. అయితే అది మనలో స్వార్థాన్ని కప్పిపుచ్చుకొనే యత్నంగా మారకుండా సత్సంగము, స్వాధ్యాయ మననాలతో జాగ్రత్త తీసుకోవాలి. అందరిలో బాబాను చూసుకోడానికి, ఈ రీతిన వ్యవహరించడానికి అప్పుడు వైరుధ్యముండదు. ఈ విషయాన్ని **"మతం ఎందుకు", "శ్రీసాయి ప్రబోధామృతము"** అనే గ్రంథాలలో కూలంకషంగా చర్చించాను. వాటిలోని జీవితతత్వం గూర్చిన అవగాహనను పొందనిదే ఈ రీతిన వ్యవహరించటం సాధ్యంకాదు. అట్టి వ్యవహారమే ధర్మం. **అందరిలోను బాబా వున్నారన్న భావం యిద్దరి మధ్య స్నేహంలాంటిదైతే, వారు చదరంగం ఆడడంలాంటిది వ్యవహారం.** వ్యవహారం లౌకికంగా యితరులు స్వార్థబుద్ధితో మనతో అధర్మంగా వ్యవహరించి, మనకు నష్టం కలిగించకుండా చూచుకోవడము మాత్రమే మన లక్ష్యమైనంతసేపు మనలోని ఆధ్యాత్మభావం దెబ్బతినదు. భగవద్గీత సారాంశమంతా యిదే.

*ప్ర : బ్రాహ్మణులు భూసురులా ? కార్తీక పురాణంలో బ్రాహ్మణుని గూర్చి భూసురుడని, దేవత అని వ్రాశారు. మరి బ్రహ్మజ్ఞునే బ్రాహ్మణుడని కొందరు చెపుతారు, ఏది నిజం ?*

*— రాజమ్మ, వల్లంపేట*

జ : ఆదిలో వర్ణవ్యవస్థ ఆయా వ్యక్తుల గుణకర్మల ననుసరించి వారి స్వభావాలకు తగిన వృత్తుల నేర్పరచడానికి ఉద్భవించిందని మనస్మృతి,



పురాణాలలోని సృష్టి రచనాక్రమాన్ని చూస్తే తెలుస్తుంది. ఇందులో బ్రహ్మజ్ఞానం పొందినవారే బ్రాహ్మణులు. కాని మిగిలిన మూడు వర్ణాలవారు ద్విజులేసుమా ! ఇందులో సహజమైన ప్రీతితో అర్థయుక్తంగా వేదాలను అధ్యయనం చేసి, లోకహితం కొరకు యజ్ఞయాగాదులను, తపస్సులను చేసే ప్రవృత్తి కలవారిని భూసురులు, విప్రులు అన్నారు. అట్టివారికి విధించబడిన జీవిత విధానం చూస్తే, తక్కిన సామాన్యమానవులవలె లౌకిక సంపదలకోసం ఆశించరాదని తెలుస్తుంది. వారి తృప్తి, సంతోషము పరమాధికంగా వుంటాయి. కనుక మానసికంగా దేవతల స్థాయిలో జీవిస్తూ, శారీరకంగా మాత్రమే ప్రకృతి సిద్ధమయిన అవసరాలను తీర్చుకుంటారు. అంతేకాక దేవతలు సృష్టియొక్క హితంకోసమే పనిచేసినట్లు వీరుకూడా చేస్తారు. కనుకనే వారిని భూసురులని అన్నారు. అట్టి గుణాలు లేనివారికి, అట్టి జీవిత విధానాలకు కట్టుబడనివారికి ఆ పేరు వర్తించదని ధర్మశాస్త్ర గ్రంథాలు చూస్తే తెలుస్తుంది. బ్రహ్మజ్ఞానం పొందినవారు విప్రులకంటే అధికులు కనుక వారు జన్మతః ఏ వర్ణానికి చెందినా, బ్రాహ్మణులే అవుతారని ఈ పత్రికలో వెలువడుతున్న ప్రామాణిక శ్లోకాలలో మీరు చూచేవుంటారు. అట్టివారెవరైనా గురుతుల్యులేనని శ్రీ ఆదిశంకరులు కూడా మానిషాపంచకంలో అంటారు.

***ప్ర : శ్రీ శిరిడీ సాయిబాబాగారు రూపాయల కట్టలు క్రుమ్మరించినపుడు (సాయిబాబా పత్రిక అక్టోబర్ 16, 1983) తత్పత్రికాధిపతులు పోషకుల కొఱకు ప్రాకులాడుట ఎందుకు ? ముందు తెలుగుదేశపు సత్యాన్వేషకులందరూ శాంత్యన్వేషణ సాగించవలసి యున్నది. మహాశయా ?***

***— కె.పి. రావు, మల్కాజిగిరి.***

జ : పత్రికలను గాని, సాహిత్యమును గాని చదివి ఆనందించ గలగాలంటే, ముందు సహృదయత కావాలి. ఒక వాక్యంలో నవరసాలు పోషించబడినప్పుడు, ఏదో ఒక రూపము అందులో వున్నదని భ్రమించటం సహృదయతకాదు. అలాగే "సాయిబాబా" పత్రికలోని యితర శీర్షికలతోపాటే, పైన మీరు తెల్పిన సాయిలీల కూడ ఉన్నదని మీరు గుర్తించాలి. మా సంపాదకీయములు, ఇతర వ్యాసములు, మాగ్రంథములు, యీ



సంచికలోని (జనవరి 16, 84) గ్రంథసమీక్ష చూచిన మీ ప్రశ్నలోని లోపము మీకర్థమవగలదు. జీవితంలో ఎప్పుడైనా అత్యవసరమైనపుడు ఎవరైనా సహృదయులు, ఒక వ్యక్తికి సహకరించారంటే అర్థం, వారు జీవితాంతం పాడుగునా, కూర్చోపెట్టి మేపుతారని అర్థం గాదు. అలానే జీవితాంతం మేపారంటే అత్యవసరమైనప్పుడు సహకరించరనిగాదు. ఇందులో ఏ ఒక్క మాటను మాత్రమే అంటిపెట్టుకోడం విజ్ఞత కాదు. ఆకారణంగా రెండవ దానిని నిరాకరించడము మానవత్వము కాదు. భక్తులకత్యవసరమైనప్పుడు సాయి సహకరించేమాట వాస్తవమన్నదానికి లక్షలాది నిదర్శనాలున్నాయి. ఆయన లీలలన్నీ మన విజ్ఞత అనే కత్తిపీటకు లోకువ అనుకోడంకూడా విజ్ఞతగాదు. తల్లి అప్పుడప్పుడు బిడ్డను ముద్దాడినంతమాత్రాన జీవితాంతం, తిండి, తిప్పలకు యత్నించని అప్రయోజకుడిగా అతడిని ముద్దులతో ముంచెత్తుతుంటుందా అనడం విజ్ఞతా ? మన అభిప్రాయాలకు, కొలత బద్దలకు బందీలమై ఒక మూల భక్తులు చేస్తున్న కృషికి మెచ్చి ప్రోత్సాహంగా ఆ శ్రీగురుడు ప్రదర్శించిన లీలను విచారణ బోనెక్కించడంలో మన దురహంకారమే బోనెక్కుతుంది. ఎంతటి మేధావికైనా, ఎవరి ప్రత్యక్షానుభవాన్ని, ఏమెట్ట వేదాంతపు సూత్రాలత్రాసులోను తూచే హక్కు, జీవితము సృష్టి యివ్వవు. ఆ లీలలను ప్రదర్శించినంత మాత్రాన తక్కిన సద్ధర్మాన్వేషణాత్మకమైన వ్యాసాలను ప్రచురిస్తున్న సంగతి మరచివేసిన ప్రశ్న యిది.

దేవుని గూర్చిన సత్యశోధనము ప్రతి జీవి తనకు చేతనైన స్థాయిలో చేసి, తమ కవసరమైన, అందిన సమాధానాలను పొందుతుంది. వారు పొందే సమాధానాలు వారికి సమాధానాలైతే చాలు మనకు కానవసరంలేదు. ప్రతి ఒక్కరి అన్వేషణా మనకు నచ్చిన రీతినే సాగాలని, ప్రతిఒక్కరికి లభించే సమాధానము మనకంగీకారయోగ్యంగా వుండాలనడానికి మనమేమన్నా మానవజాతి యంతటికి భగవంతుని తరపున వకాల్తా పుచ్చుకున్నామా ? ఇది ఆధునిక అహంకారం గాదా ? మానవులందరమూ మన అన్వేషణా రీతులను, ఫలితాలను సాటివారితో పంచుకోడం మానవత్వం. అదే యీ పత్రికద్వారా ఆ భక్తులు గూడ చేస్తున్నారని గుర్తించాలి.



ఈ పత్రిక వ్యవస్థాపన వెనుక నుండే మా దృక్పథమేమో **"శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర", "శ్రీసాయి ప్రబోధామృతము", "మతం ఎందుకు",పురుషసూక్తరహస్యము.** వంటి మా ప్రచురణలు చూస్తే తెలుస్తుంది. అవి చూస్తే మీరీ ప్రశ్నవేయరు. ఏ సంస్థ ప్రచురించే ఏ విషయమైనా దాని మూలసిద్ధాంత పరిధిలోంచి చూస్తేగాని సరిగా బోధపడే అవకాశంలేదు. లేకుంటే ఏ ఒక్క ప్రశ్నకు సంబంధించిన వివరమంతా, ఒక వ్యాసంలోనో, సంచికలోనో, సమాధా నంలోనో, లభ్యమవ్వజాలదని, కొంచెం యోచిస్తే గాని తెలియదు. ఒక వ్యక్తి పల్కిన ఏ మాటగాని, చేసిన ఏ పనిగాని, ఆ వ్యక్తి యొక్క తత్వం మొత్తాన్ని, వారితో మనకు గల యావత్ పరిచయం దృష్ట్యా చూస్తేగాని సరిగా అర్థం కాదుగదా ! అలాగే యిదీను -

అయినా అడిగారు గనుక ఒక్కమాట ! వాస్తవానికి మాకంవరికీ ఎప్పుడు క్లిష్టమైన పరిస్థితి ఏర్పడినా, శ్రీ సాయి అలానే సహకరిస్తున్నారు. జీవితంలో ఆత్మీయులులాగా !. మిగిలినప్పుడు మా శక్తి సామర్ధ్యాల మీద నడవనిస్తున్నారు - మరలా జీవితంలో మన ఆత్మీయులు చేసినట్లే. కొందరు కోరకనే పత్రికకు సహకార మందించబట్టే, ఆరంభించగల్గాము. అందుకర్హులమవడానికి మా శాయశక్తులా కృషి చేస్తున్నాము. కేవలం సాయి ఒక్కరే అవసరమైన సహాయమల్లా మాకందిస్తుంటే, పత్రిక ద్వారా అమూల్య విషయాలందుకొనే చదువరులు మాతో సహకరించాలని, అసమర్థులుగా వుండిపోరాదని, సాయి సంకల్పం గనుక, వారి సహకారాన్ని కూడా కోరి, వారి ప్రాథమిక కర్తవ్యాన్ని వారికి గుర్తు చేయవలసిన మా బాధ్యతను నిర్వర్తించడానికే, మేము అలా సహకారం కోరుతున్నామని గుర్తించండి. చదువరులలో "శాంత్యాన్వేషణ" ను పురికొల్పి, సహకరించడానికి, మేము చేస్తున్న కృషికి, మీరు చేయవలసిన కర్తవ్యాన్ని గూడ గుర్తిస్తే సంతోషము.

*ప్ర : మాకొక **అర్థంత్రైన ధర్మసందేహ మొచ్చింది. నేనూ నా స్నేహితులూ** సాయి సుప్రభాత్ క్యాసెట్లు **తెప్పించుకొన్నాము.** మా దగ్గరకెందరో వచ్చి **"మేము ఖాళీ** క్యాసెట్లు **తెచ్చుకొని** మీ వద్ద నున్న సుప్రభాతమ్ రికార్డు **వేసుకొంటాము" అంటున్నారు.** 'అది కూడ ఒక సేవే గదా ! **చేసుకోవచ్చంటారు వారు. నాకెందుకో***



అది అధర్మమనిపిస్తుంది గాని ఎందుకనో వివరించలేకున్నాను. మాకు వెంటనే పత్రిక ద్వారా సమాధానమివ్వగోరుతున్నాము'.

-- చక్రపాణి, మద్రాసు.

జ : 'ఎవరి సేవనూ ఉచితంగా తీసుకోకూడదు' అన్నది సాయిచెప్పిన ముఖ్యధర్మసూత్రం. చెట్టుకు నీరు, ఎరువు, కంచెవేసి కాయలు తీసుకొంటున్నాము. పశువుకు మేత వేసి సంరక్షించి పాలు తీసుకుంటాము. వ్యవసాయం చేసి పంట తీసుకుంటాము. అలానే సుప్రభాతాన్ని కూర్చి 'మాస్టర్ క్యాసెట్లు' తయారు చేయడానికే ప్రచారసంస్థకెంతో వ్యయప్రయాసలయ్యాయి. దీనిని తీసుకొని వినియోగించుకోగోరేవారందరూ ఆ కృషికి తగిన విలువ చెల్లించి దానిని పొందడం ధర్మం. సాయి చెప్పిన యీ దివ్యదృష్టి సూత్రమైన ధర్మాన్ని ఉల్లంఘించాక యిక అర్థకామాలు గాని, మోక్షంగాని సిద్ధించే ప్రసక్తేలేదు. కనుక ఉచితంగా క్యాసెట్లు రికార్డు చేసుకొనడం దొంగతనమవుతుంది. సాయి భక్తికి దొంగతనంగా వ్యక్తమవడం చాలా హేయం. సమాజానికి ధర్మ ప్రచార సాధనంగా ఎన్నో సంవత్సరాల కృషితో, ఎందరో భక్తుల త్యాగపూరితమైన సహకారంతో మరింతగా ధర్మ ప్రచారానికి దోహదమివ్వాలని రూపొందించబడిన క్యాసెట్టును కేవలం 10 లేక 20 రూపాయలకోసం కక్కుర్తిపడి ఉచితంగా రికార్డు చేసుకోవడమంత అధర్మం మరొకటి ఉండదేమో. ప్రతి భక్తుడూ కనీసం క్యాసెట్టు విలువనైనా ప్రచార సంస్థకు విరాళంగా చెల్లించి తీసుకుంటే అంతటి వ్యయ ప్రయాసలతో గూడిన ధర్మ కార్యానికి పూనుకొన్న సంస్థకు దెబ్బతగులకుండా చూచినవారమవుతాము. అలాగాక ఆ కొద్దికీ లోభించి ఉచితంగా రికార్డింగ్ చేసుకొంటే అది చౌర్యమే అవుతుంది. అది నిత్యమూ వింటున్నా మనలోని అధర్మ సంస్కారాలే బలపడుతాయి. సాయి చెప్పిన ధర్మసూత్రాన్ని ఉల్లంఘించే దుష్ట సంస్కారాలే బలపడుతాయి. ఇక సాయిభక్తుల మయివుండి చౌర్యంతో మనభక్తి పరాకాష్ట చెందకూడదు. ఉచితంగా సాటివారికి సుప్రభాతాన్ని లభించేలా చేయాలన్నది ధర్మమే కావచ్చు. గాని దానికైనా వ్యయ ప్రయాసలు యింకొకరివై, వారు నష్టపోయేదిగా వుండేది



దానమవదు. మనింట్లో బియ్యం యింకొకరు దానం చేస్తే దానిని మనం హర్షిస్తామా ? మనం శక్తి కొలది బియ్యం కొని దానం చేయాలి. ఆ కొనే ధనంకూడ ధర్మబద్ధమైనది కావాలి. అది కూడ అలా యింకొకరి జబు కొట్టినదిగాగూడదు. అధర్మ ప్రవృత్తి గల వారి వద్ద దక్షిణ తీసుకోడానికి సాయి ఎలా నిరాకరించారో చదివాము గదా ? మన మందరమూ బాధగా విమర్శించుకొన్నట్లు మనం గూడ సాయిభక్తి విద్రోహకరమైన చర్యగా, చౌర్యంగా మార్చడం వాంఛనీయంగాదు. ఇంత ఆలోచించాక యిదివరకే ఈ పొరపాటు చేసిన వారు తాము పొరపాటును దిద్దుకోవచ్చు. వివిధ దేవతలకు మొక్కుకొని, చెల్లించవలసినది చెల్లించనివారి వద్ద ఎంత కాలానికైనా సాయి అడిగి తీసుకొనేవారు. అలా చెల్లించకుండా వుండకూడదన్నారు. అదే మన ధర్మ సూత్రం. ఒక వంక భిక్షువులకు భిక్ష వేస్తూ, శిరిడీ యాత్రతోపాటు నిత్య జీవితంలో మోసాలకు, సినిమా, కాఫీ, టీల వంటి వాటికీ, టేపురికార్డరుకు వంటి వాటికి ఖర్చుచేస్తూ ఒక్క యిలాంటి ధార్మికమైన విషయంలో యిలాటి కృపణత్వం (కక్కుర్తి) మన సాయి భక్తి, ధర్మచింతన, మన సద్వర్తన, సద్భావమూ ఎంతటివో తెల్పుతాయి.

ప్ర : *మీరు స్త్రీలకు పతి తరువాతనే దైవమన్నారు. మీరన్నది సాధువర్తనులైన భర్తల విషయంలో నిజంగా వచ్చుగాని మానవత్వమే లేక వర్తించేవారి విషయంలో అదెలా సమంజసము ?*

*- ఒక సోదరి, విశాఖపట్నం.*

జ : పురుషుల విషయంలో గూడ ఒకసారి గురువని తలచి ఆశ్రయించిన తర్వాత ఆ గురువును ఎట్టి పరిస్థితిలోనూ త్రిమూర్త్యాత్మకుడుగాను, పరబ్రహ్మగానూ విశ్వసించి సేవించాలని ఆర్షాచారము. ఉపనిషత్తులలో ఎందరో గురువులు ఎంతో అమానుషంగా శిష్యులను బాధపెట్టినట్లు, అయినా ధైర్యాన్ని ('ధీ' అంటే బుద్ధి) విడువక వారిని నిశ్చల విశ్వాసంతో సేవించి కృతార్థులైనవారెందరి గురించో వర్ణించబడ్డది. అలాగాక ఆ గురువును విడిచిన వాడి ముఖం చూడగూడదన్న విషయం 'శ్రీ గురుచరిత్రలో' చూడవచ్చు. అలానే దీపకుడనే శిష్యుణ్ణి కాశిలో కుష్టువ్యాధితో బాధపడుతున్న గురువు



ఎంతో క్రూరంగా చిత్రహింసలు పెట్టినా చలించక సేవించి కృతార్థులైనట్లు చెప్పబడ్డది. అసలు జరిగేదేమంటే 'భాగవతం' లోని 'భిక్షుగీత'లో చెప్పినట్లు మనకెవరివల్ల ఏ కష్టం కల్గినా అది పూర్వ పాపకర్మ ఫలితమే. ఆ కష్ట మనుభవించవలసిన పాపకాల మొచ్చినపుడు ఏ విధంగానైనా అది తప్పదు. మంచి గురువు నాశ్రయించినా శిష్యుడి పాపకర్మ క్షయంగావడానికి మనను వారే అంతగానూ కష్టపెడతారు. వారు ఆ కర్మల ప్రాప్తికి నిమిత్త మాత్రులవుతారు. ఈ వివరం "యోగి మిలారేపా" చరిత్రలో చూడవచ్చు. ఆ స్థితిలో శిష్యుడు అచంచల విశ్వాసంతో సేవ చేయాలి. అలాటి వారే కృతార్థులయ్యారు.

అలాగాక ప్రారబ్ధవశాన అజ్ఞుడైన కపట గురువు నాశ్రయించినా ఆ పాపకర్మఫలమే వారివలన కల్గే బాధరూపంలో అనుభవమవుతుంది. అపుడు కృత్రిమంగాగాక సహజమూ, అమాయకమూ అయిన విశ్వాసంతో సేవించ గల్గిన వాడికి కొత్తదోషం సంక్రమించదుగానీ కర్మ క్షయమవుతుంది.

మీరు చెప్పినటువంటి దుష్టుడైన భర్త విషయమూ అంతే. అటు కపట గురువు దాపురించిన పురుషుడు గానీ, ఇటు దుష్టుడైన భర్త దాపురించిన స్త్రీ గానీ వారి పూర్వకర్మ ఫలంగానే అలాటివారి పాలిట పడతారు. సర్వకర్మ ఫలప్రదాతయైన భగవంతుడు సర్వగతుడు. వారి కర్మననుసరించి వారికా రూపంలో తారసిల్లి వారి కర్మఫలాన్ని వారికి అందచేస్తాడు. ఆ స్థితిలోనూ అచంచలమైన పాతివ్రత్యంతో (పతియే దైవమని) విశ్వసించి సేవించగల్గిన స్త్రీలు బ్రహ్మజ్ఞానాన్ని పొందారు. ఇందుకు చివటంఅమ్మగారొక చక్కని ఉదాహరణ. ఇలా సేవించలేని వారైనా కనీసం నిర్లిప్తంగానైనా సహనంతో ఉండాలి గాని ద్వేషాన్ని వహిస్తే ఆ కర్మబంధం వలన మరుజన్మలో ప్రతీకారానికై మరలా ఆ వ్యక్తితోనే ఋణంచేత బాధపడుతారు. ఈ విధంగా 'చెన్నబసప్ప - వీరభద్రప్ప' కథవలెనే అవుతుంది వారిగతి. అందుకే సాయి సూక్తులలో ఇతరులు మనను బాధిస్తే మనము ఎలా వుండాలో చెప్పినవాటిని చూస్తే తెలుస్తుంది. పురాణాలలోని దుష్టులైన భర్తలను సేవించిన పతివ్రతలు కూడ ఉన్నతికొచ్చిన ఉపాఖ్యానాలీ విషయాన్నే వివరిస్తాయి. భగవద్గీత



యుద్ధంవంటిది గూడ రాగద్వేషాది ద్వంద్వరహితంగా, స్వధర్మంగా యుద్ధం చేయాలని చెబుతుంది.

ఈ విషయంలో ఎన్నో లేఖల్లోనైనా వివరించలేనంతటి ఇతర అంశాలెన్నో వున్నాయి. ఎప్పుడైనా అవకాశమొస్తే ముఖతః వివరంగా చర్చించవలసిందే. భార్య ఎంత గయ్యాళియైనా శ్రీ రామానుజాచార్యులెంత ఓర్పుతో ఉన్నారో చూడండి. ఆమెకై ఆమే వెళ్లిపోయినపుడు అది భగవత్సందేశంగా తలచి ఆయన సన్యసించారు.

ఇంకొంత వివరాన్ని **"శ్రీ సాయినాథ ప్రబోధామృతము"** లోను, **'శ్రీగురుచరిత్ర'లోని అనుబంధంలోను** చూడండి. అలా విశ్వాన్ని భగవంతుడుగా దర్శించగల్గాడు -- భాగవతం (ఉద్ధవగీత)లో వర్ణించబడిన అవధూత. అలా దర్శించలేని మనకది మాయా స్వరూపంగానే అనుభవమై మనలను సంసారంలో బంధిస్తున్నది. **కష్టాలలోను, సుఖాలలోను సములై సర్వత్రా భగవంతుణ్ణే చూడగల్గాలనే గీతాది గ్రంథాలన్నీ చెప్పేది.**

*ప్ర: నన్ను చిన్నప్పటినుంచి మా బావకిచ్చి వివాహం **చెయ్యాలనుకున్నారు. అతడే నాభర్త అన్న భావం నాలో నాటుకుపోయింది. కాని కట్నానికాశించి మా అత్త అతడికి మరో అమ్మాయినిచ్చి వివాహం చేసింది. ఎన్నిరోజులు గడిచినా నాభావం మారటంలేదు. ఆత్మహత్యకు ప్రయత్నించి విఫలమయ్యాను. నేను వివాహం చేసుకోకుండా జీవితాన్ని మాధవసేవకు అంకితం చేయాలనుకుంటున్నాను. మీ సలహా కావాలి.***

***— ఒక సోదరి, రాజమండ్రి.***

**జ :** పెద్దలు అవివేకంతో పిల్లల మనసులలో ఆశలు కల్పించడం, తర్వాత పరిస్థితులు అనుకూలించక పిల్లల జీవితాలు భగ్నమవడం చాలా దారుణం. నీ పరిస్థితి అర్థమైంది. నీ నిర్ణయం చాలా మంచిది. ధర్మమంతటికీ మూలం హృదయం. అది లోపించిన ధర్మం వంచన. భగవంతుడు ధర్మానికి నిలబడే ఆత్మస్థైర్యం నీకిచ్చాడు, ఇస్తాడు.

అయితే నీవుకూడా ఆలోచించవలసిన సూక్ష్మమొకటున్నది. నీకీ భావం కల్గడం పెద్దలు ముందుచూపులేకుండా తొందరపడి ఆశలేర్పరచుకొని,



నీకు కల్పించడం, అది వారి అజ్ఞానమే గాని కుట్రగాదు గదా. కాకుంటే మీ బావకు పూర్వజన్మ ఋణానుబంధం వలన మరొక అమ్మాయితో వివాహమైంది. దానికి వారు కర్తలు కారు. మీ అత్తయినా ఆ కర్మ సూత్రానికి పనిముట్టుమాత్రమే. అతడిని ఆమె గర్భాన జన్మింపచేసినది ఋణానుబంధమే; ఆమె వైపు నుంచీ చూస్తే ప్రతి తల్లి లాగే తన కొడుకుకు అంత ఆర్థిక వున్నతిని కోరిందేగాని మరేమున్నది ? అలాగాక మీ మీది అయిష్టంతో కూడా అలా చేసిందనుకుందాము. అలాంటి అయిష్టం గూడ పూర్వ ఋణానునంబంధం వలననే కలుగుతుంది. కనుక **మానవులెవరూ కర్తలని భ్రమించి వారిపై మనస్సులో ద్వేషం పెట్టుకోవద్దు.** అందువలన మన మనస్సు మలినమై వారిపై పగ తీర్చుకోడానికి మరలా జన్మించేలా చేస్తాయి. దాని పర్యవసానంగా ఆ పై జన్మలో నిష్కారణంగా మనం వారిచేత హింసించబడాలి. ఆ వలయానికి అంతం లేదు. ఇంకా ఇంకా దుఃఖవలయాల సుడిగుండంలోకి జీవులు లాగబడతాయి. దానినే మాయ అంటారు. ద్వేషమొక మాయా బంధమయితే మమకారం మరొక బంధం. ఒకే అజ్ఞానమనే కాసు యొక్క బొమ్మ బొరుసు ఇవి.

పోనీ నీ బాధకు భగవంతుడు కారణం అందామా అంటే ఆయనకు మనపై పగ ఎందుకు ? అపారమైన ప్రేమ వుంటుంది. అందుకే ఆయన మనకు యోచనాశక్తి, వివేకమూ యిచ్చారు. మనకు తెలియనివి తెల్పే శ్రీసాయిబాబా, రామకృష్ణపరమహంస, మహమ్మద్, బుద్ధుడు వంటి మహాత్ములను పంపాడు. వారి ద్వారా భగవద్గీత, బైబిల్, ఖరాను వంటి గ్రంథాలనిచ్చాడు. వీటిని లెక్కచేయక మన యిష్టాలలో తగుల్కొని కల్పించుకొన్న ఋణానుబంధానికి ఆయనేమి చేస్తాడు ? పోనీ విడిపించకూడదా అంటే ముందుగా టీచర్ ఎంతైనా మనపట్ల అధిక శ్రద్ధగా చదివించగలడు గానీ, మార్కులు అన్యాయంగా వేసి మనను కృతార్థులను చేయగూడదు కదా ? అలా కొందరికే చేస్తే తక్కిన అందరి పట్ల ద్రోహి అవుతాడు ఆయన. అందరిపట్ల ఆయన అలానే చేస్తే ఇక పిల్లలు చదివి బుద్ధి వికాసం చెందేదెప్పుడు ? ఎలా ? పిల్లల మనస్సులు హింసించి వారు



స్వతంత్రులు, ఉత్తములు గావాలన్నది ఆయన సృష్టియొక్క ఇతివృత్తం. ఋణానుబంధంగా అనివార్యంగా వచ్చే అనుభవాలను ఆశ నిరాశలు లేకుండా అంగీకరించి, వాటిని సాధ్యమైనంత సమర్థవంతంగా మలచుకొంటూండడం, జీవిత సమాప్తి లోగా మన జ్ఞానాన్ని పెంపొందించు కొంటూండడం, పూర్ణమైన దుఃఖరాహిత్యాన్ని అంటే భగవదనుగ్రహాన్ని పొందడం - ఇదే మన కర్తవ్యం.

ఆత్మహత్య సమస్యను తీర్చదు. "శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర", శ్రీ స్వామి సమర్థ చరిత్రలకు తోడు అవధూత చివటంఅమ్మ చరిత్ర చదువు. ఎందరెందరి జీవితానుభవాలనో చూస్తే మనకెన్నో తెలుస్తాయి. అసలైన విద్య అది. ఆత్మహత్యతో సమస్యను తప్పుకోజూస్తే పరీక్ష వ్రాయలేక ప్రశ్నపత్రంతో పారిపోజూచిన విద్యార్థిలా, న్యాయబద్ధంగా విధించబడిన శిక్షను తప్పించుకోజూచిన నేరస్తునిలా - మరలా జన్మించి ఈ బాధను అనుభవించే తీరాలి. సరిగదా ఆత్మహత్య దోషానికి అదనంగా శిక్ష అనుభవించాలని ఆ మహనీయులు స్పష్టంగా చెప్పారు.

నిజానికి మన శరీర మనస్సులు మనకు చెందవు. మనం సృష్టించలేదు. వాటి వయః పరిమాణాన్ని ఆపలేము. ఒక నాటికి మృతి చెందకుండా కాపాడలేము. అవి ఒక స్థాయిలో ఋణానుబంధానికి చెందినవి. ప్రవాహంచేత అలల వలె ఋణానుబంధంచేత ఆయా అనుభవాలను పొందేతీరాలి. మరొకలా చూస్తే దైవం మనకిచ్చిన తెప్ప, తెడ్లులాంటివి. ఈ అజ్ఞాన సముద్రాన్ని దాటి శాశ్వతమైన ఈ ఆనందరూపుడైన ఆయనను చేరడానికివ్వబడ్డాయి. ఆ పనిచేయక మనం వాటితో ఆడుకోవడం మొదలు పెడతాము. మన అవివేక పర్యవసానాలే మనను దండిస్తాయి. కనుక ఆలోచిస్తే గత సంఘటనలకు భావాలుగా, స్మృతులుగా తప్ప వాస్తవికత లేదు. ఇకనైనా జ్ఞానంతో ఆలోచించి, జ్ఞానాన్ని పెంపొందించుకో, కొంతకాలమయ్యాక ఆలోచించుకోవచ్చు. స్థిమితం చిక్కాక మరలా వ్రాయి.



ప్ర : **పితృకర్మలాచరించకుంటే పితృదేవతలు శపిస్తారంటారు. జన్మ పరంపరలలో జీవి పరిభ్రమించేటప్పుడు యిదెలా సాధ్యం ?**

**— శ్రీమతి కమలారామచందర్, హైదరాబాద్.**

జ : పితృదేవతలంటే చనిపోయిన మన పెద్దలని మాత్రమే గాదు. సృష్టిలోని నానాత్వంలో లోకాలు అంతర్భాగమే. అవుడు లోకాధిపతులు గూడ యిప్పటి జనులెంత వాస్తవమైన వారో అంతే వాస్తవం. పితృలోకానికి అధిదేవతలు పితృదేవతలు. సృష్టిమొత్తం ప్రతిజీవి, దేవత తక్కిన జీవులన్నింటికీ ఏదో ఒక రీతిన ఉపయోగపడతారని, సహకరిస్తారనీ 'యజ్ఞము' అనే భావం సూచిస్తుంది. అవుడు మన పూర్వీకుల ఆత్మలూ మరణానంతరం చేరే లోకాలలో ఒకటి పితృలోకం. అక్కడ మన కర్మఫలాలు కొన్ని అనుభవమవుతాయి.అందుకు సహకరించే దేవతలకు మనం ఋణపడియుంటాము. వారికి కృతజ్ఞతాపూర్వకంగా మనం చేసే పూజలే పితృకర్మలు. సృష్టిలోని వివిధ ప్రకృతిశక్తుల రూపులైన దేవతలపట్ల మనం కృతజ్ఞులంగా వుండడం ధర్మమే. లేనిది కృతఘ్నతే. దానికి ఫలం వుంటుంది. దానినే శపించడమంటారు. నిప్పుతో అలక్ష్యంగా వ్యవహరిస్తే చేయి కాలినట్లు. అయితే భావమెరిగి నిజమైన ప్రీతితో చేసిన ఆరాధనే అంగీకారమౌతుంది. మన మీ రోజులలో చేసేవి పితృకర్మలే కావు. వాటి ప్రయోజన మొక్కటే ? ఏనాటికైనా మనకు వాటి విషయమై జిజ్ఞాస కల్గేందుకుపకరిస్తాయి. మన విధులను నిర్వర్తించాలన్న సత్యాన్ని ఏదో ఒక స్థాయిలో అవి మేల్కొల్పుతాయి.

ప్ర : **మహనీయులు నిర్యాణం చెందిన తర్వాత వారి శరీరం పవిత్రమైనదేనా ?**

**— ఆర్. భారతీదేవి, చీరాల.**

జ : మహనీయులు 'మరణించాక' గూడ వారి దేహాలు పరమ పవిత్రమైనవే. అందుకే జీవన్ముక్తుల దేహాలను దహనం చేయక సమాధిచేసి, దానిని పరమపవిత్రంగా పూజించడమన్నది అన్ని మతాల ఆచారంగా వున్నది. ఇది కేవలమొక విశ్వాసం మాత్రమే గాదు. ఆ సన్నిధిలో మానవుని ప్రార్థనలు భగవంతుని నుండి అనుగ్రహాన్ని త్వరగా పొందుతామన్నది నిస్సందేహం,



అన్ని మతాలకు చెందిన వేలాది ప్రజల అనుభవం గూడ. కొన్ని శతాబ్దాల క్రింద పరమపదించిన మహనీయుల సమాధుల వద్ద -- శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి, మంత్రాలయ రాఘవేంద్రుల సమాధి, నాగూర్‌వల్లి సమాధి యిలా యెన్నో వివిధ ఆధ్యాత్మిక సాంప్రదాయాలలో ఆ సన్నిధిలో సాధకులు తీవ్ర సాధనలు ప్రత్యేక భగవదాదేశం పొంది దాని సహాయంతో వారు గూడ పూర్ణ పురుషులుగా రూపొందిన విషయం చరిత్రలో చూడవచ్చు. ఏదో ఒక శుభసమయంలో ప్రాణ ప్రతిష్ఠ, యంత్ర ప్రతిష్టలతో మానవులు మలచిన విగ్రహాలు శక్తివంతాలవుతాయని శాస్త్రం చెబుతుంటే జీవితాంతమూ భగవధ్యానంతో అణువణువూ పవిత్రమై, వారనుభవించిన భగవదైక్యంలో పరమపావనమైన మహనీయుల సమాధులు, చిరకాలం శక్తివంతాలవడంలో ఆశ్చర్యమేమున్నది? ఎందరో అవిశ్వాసులకు గూడ పరివర్తన కల్గించగల్గిన ప్రభావం అక్కడ ప్రకటమైన వుదాంతాలెన్నో !

***ప్ర : బాబాకు అన్నముడుకుతున్న గంగాళంలో చేయి పెట్టినపుడు బాధ కల్గనిది. ఒక కమ్మరి వాని బిడ్డను కొలిమి నుండి రక్షించడానికి ధునిలో చేయి పెట్టినపుడెందుకు కాలింది ?***

***— జి.వి. మురళీమోహనరావు, అనంతపురం.***

**జ** : చేయి కాలకపోవడం సాయిబాబా యొక్క సహజస్థితి కొలిమిలోబడిన బిడ్డ అనుభవించి తీరవలసి ప్రారబ్ధాన్ని అతనిబదులు బాబా అనుభవిస్తేనే అతడికి తొలుగుతుంది. గనుక వారే తమ చేయి కాలనిచ్చారు. అంతటి రక్షణ వారినుండి పొందగలగడానికి తగినట్లు ఉత్తమంగా అతడు గత జన్మలలో బాబాను సేవించి వుంటాడు. అలా సేవించిన వారి ప్రారబ్ధాన్ని కూడా తాము తొలగించగలమని మనకు తెలియడానికిగూడ బాబా అలా జరుగనిచ్చారు. కాకుంటే ఎక్కడో నాగపూర్‌లోని తాజుద్దీన్ బాబాగారి కుటీరానికంటుకున్న నిప్పును సంకల్ప మాత్రంతో ఆర్పగలిగిన బాబాకు మరొక గ్రామంలో కొలిమిని ఆర్పడం పెద్దపనిగాదు. తల్లిదగ్గర ప్రేమతో పాలు



త్రాగేబదులు రొమ్ముకొరికి నెత్తురుజూచే నేటి మానవులకు - తమను శ్రద్ధగా సేవిస్తే మన మనుభవించి తీరవలసిన బాధలను తాననుభవించైనా మనకు విడుదల నివ్వడానికి, తాము సంసిద్ధులమని చెప్పడానికే బాబా అలా చేసారు.

**ప్ర : క్రైస్తవంలో పునర్జన్మలేదు ? ఆ మతంలో క్రీస్తు పునరుద్ధానం మరియు తీర్పుదినము ప్రధానాంశాలు. హిందూమతంలోగాని, బాబా బోధలోగాని పాపక్షాళనం చేసుకోవాలన్న భావం అంత స్పష్టంగా చెప్పబడలేదు. అన్ని మతాలు ఒకటే ఎలా అవుతాయి ?**

**- యం. వి. అప్పారావు, బసంత్‌నగర్**

జ : మత గ్రంథాలేగాక మతాల చరిత్ర గూడ ఎంతో నిశితంగా విస్తారంగా ఎవరూ చదవకపోవడంవలననే ఇలాంటి సందేహాలు కల్గుతాయి. అవి సరిగా చదవని నకిలీ పండితులు ధనము, కీర్తులను మాత్రమే ఆశించి ఆధ్యాత్మ ప్రచారానికి పూనుకుంటున్న నకిలీ గురువులు, స్వాముల వలన ఇట్టి అపోహలు బలపడుతున్నాయి.

ఏసు మరణించిన ఎంతోకాలానికి ఆయనగురించి వ్యాపించిన కథల, స్మృతులనుండి కొన్నింటిని కూర్చి నేటి బైబిల్‌లోని క్రొత్త నిబంధన రూపొందించబడింది. ఆ స్మృతులలో ఏసు పునర్జన్మల గురించి చెప్పిన సందర్భాలెన్నో ఉన్నాయి. అంతేకాదు. యూదుమతంలో వర్ణ వ్యవస్థ వుండేది. అగ్రవర్ణస్తులైన యూదులకు మాత్రమే బోధించబడిన ఆర్ష ధర్మాలలో పునర్జన్మకూడ ఒకటని ఇటీవల కనుగొన్నారు. కాని క్రొత్త నిబంధనలను కూర్చిన పండితులు పునర్జన్మ గురించిన బోధలను తొలగించుకున్నారు. నేడు పాశ్చాత్య దేశాలలో గూడ కొందరికి పూర్వ జన్మ స్మృతులు కలగడం వలన ఆదేశాలలోని యువతరానికి క్రైస్తవంపై విశ్వాసం తొలగి హిందూధర్మంపై మక్కువ కల్గుతున్నది. హరే కృష్ణ ఉద్యమం వంటివి పెరిగిపోతున్నాయి.

హిందూ, బౌద్ధ, జైన, ఇస్లాం మొదలైన మతాలన్నింటికీ ధర్మం ప్రధానం. ధర్మంలో ప్రాయశ్చిత్తం ప్రధానం. ఈ జన్మలోచేసిన పాపాలకు



ప్రాయశ్చిత్తం చెంది తన తప్పు పండిత సభలో ఒప్పుకొని ప్రాయశ్చిత్తం చేసుకోవడం ప్రతివారికి తప్పనిసరి. గత జన్మలలో చేసుకొన్న వాటిని కొంతవరకూ దానము, ప్రాయశ్చిత్తము, తపస్సులతో తొలగించుకోవచ్చును. కొంత అనివార్యంగా అనుభవించితీరాలి. ఇదంతా పాపక్షాళనమే గదా ! పాపపు తలంపులు ముందు కల్గకుండా చూచుకోవడం కోసం సంస్కారము, ధర్మాచరణ, సత్సాంగత్యము చెప్పారు. ఒక విధంగా చెప్పాలంటే పాపక్షాళనం గురించి ఈ మతాలలో చెప్పినంతగా క్రైస్తవంలో చెప్పలేదు.

ఆదిమానవులు చేసిన అతిక్రమణవలన మానవజాతి అంతటికి పాపము, దుఃఖము, మరణము సంక్రమించాయని, వాటినుండి తన ఆత్మ బలిదానము వలన మానవజాతిని ఏసు రక్షించాడని క్రైస్తవమతం చెబుతుంది. కాని ఈ నాటికీ మానవులకు అవితప్పడం లేదంటే, ఆయనను విశ్వసించిన వారికి మాత్రమే ఆయన రక్షణ లభిస్తుందంటారు. ఆయనను విశ్వసించని వారందరూ పాపులని క్రైస్తవ ప్రచారకులు చెబుతున్నారు. అప్పుడు వారినే గదా ఆయన రక్షించాల్సింది ? అసలు క్రీస్తు వచ్చింది వీటిని అతిక్రమించటము ఎలాగో మానవులకు తెల్పడానికే. తాము చెప్పినవి అనుసరించిన వారు మాత్రమే రక్షింపబడతారని మత్తయి సువార్తలోని కొండమీది ప్రవచనంలో ఆయన చెప్పారు. ఆయన చెప్పిన సూత్రాలు అన్ని మతాలలోనూ వున్నవే. మన మతంలో వలెనే ఏమీ చదవకనే, అర్థం చేసుకోనకొనే డబ్బు, ఉద్యోగము, రాజకీయ బలము కోసము గుడ్డిగా మత ప్రచారము చేసేవారి వలన ఈ వ్యాఖ్యానాలు మరుగుబడ్డాయి. "శాస్త్రాలు ఎన్నటికీ అబద్ధంకావు. వాటికి పనికి మాలిన అర్థం తీసుకొని తికమక పడేదినీవే" అని నానా చందోర్కరునితో సాయిబాబా చెప్పిన వాక్యం అన్ని మతాలవారికి నిత్యసత్యం. సాయి వంటి మహనీయులవల్ల మాత్రమే సర్వమతాలకూ మూలమైన వాస్తవాలు తెలుసుకోవడం సాధ్యం. ఏసు అట్టివాడే గనుక తమ ద్వారా తెలుసుకొమ్మని ఆయన చెప్పిన మాటకు తమ మౌఢ్యము, స్వార్థమూ జోడించి ఆర్థిక రాజకీయ ప్రయోజనాల కోసం మత మౌఢ్యం ఇలా ప్రచారం



చేస్తుంది. బైబిల్ కూలంకషంగా తెలిసిన వారిలో ప్రముఖుడని ప్రఖ్యాతి పొందిన అమెరికన్ 'పాల్‌రెప్స్' (Pall Reps) నేను వ్రాసిన ఆంగ్ల సాయిబాబా జీవిత చరిత్ర (Sai Baba the Master) చదివి, "మీరు వ్రాసిన బాబా చరిత్ర చదివితేతప్ప నాకుగాని, మరెవ్వరికీ గాని ఏసు జీవితంలోని బోధ అర్థంగాదు'' అని వ్రాశాడు.

ప్ర : ***కొందరు సాయి, అక్కల్‌కోట స్వామి వంటి వారు చెప్పేది ప్రామాణికం కాదని, శృతులే ప్రమాణమనీ అంటున్నారు, మీ సమాధానమేమిటి ?***

**-- వి.వి.రామారావు, రాజమండ్రి.**

జ : నీ మిత్రులకు శృతులే ప్రమాణమన్నావు. అది నిజమైతే భగవద్గీతలో కృష్ణుడు పరమ భక్తునికీ, తనకూ బేధం లేదన్నాడు ; జ్ఞాని సాక్షాత్తు తానేనన్నాడు. అపుడు పూర్ణజ్ఞాని ; పూర్ణభక్తుడూ భగవత్స్వరూపులేనని శ్రీ కృష్ణుడు చెప్పినట్లే. అట్టివారిని సేవించి పరిప్రశ్న చేసి శరణుపొంది జ్ఞానాన్ని పొందమన్నాడు. కృష్ణుడు ప్రమాణమైతే ఆయన చెప్పినదీ ప్రమాణమే. ఆ భావాన్నే గురువు త్రిమూర్తి స్వరూపియని, పరబ్రహ్మస్వరూపియని శాస్త్రాలు చెప్పాయి. అందుకే శ్రీ కృష్ణుడు సాందీపని మహర్షిని ఆశ్రయించేటప్పుడు ఆయనపేరు వేదాలలో వున్నదా లేదా అని గాని ఆయన గురించి పురాణమున్నదా అని గాని అడుగలేదు. రాముడు గూడ వశిష్ట విశ్వామిత్రుల గురించి అట్టి విచికిత్స చేయకనే ఆశ్రయించాడు. మరే మహర్షులు తమ గురువుల గురించి అట్టి విచికిత్స చేసినట్లు చూడము. అప్పుడీ మీ మాంస మన యిష్టాయిష్టాలకు సంబంధించినదేగానీ ప్రమాణికముగాదు. ధర్మానికీ ఆధ్యాత్మికతకూ మన యిష్టాయిష్టాలు ప్రమాణాలు కాజాలవు. శాస్త్రవిధిని విడచి నడచుకొన్నవాడికి సిద్ధి కల్గదని శ్రీ కృష్ణుని శాసనము.

ఇక శృతియైన తైత్తిరియోపనిషత్తులోని నారాయణ ప్రశ్నలోని 80 అనువాకం జీవన్ముక్తుని దేహము, చేష్టలే మహాయజ్ఞమని ఘంటాపథంగా ఇలా చెబుతున్నది - (మూలం "తస్యైవం విదుషో'') మొదలు "ఎతద్వై'' అనే నాలుగవ మంత్రం వరకూ) "అతని ఆత్మయే యజమానుడు ; శ్రద్ధయే అతని పత్ని ; శరీరము ఇధ్మము, ఉరస్సువేది ; రోమములు దర్భలు;



శిఖవేదము, హృదయము రూపము, కామము ఆజ్యము, కోపము పశువు, తపస్సే అగ్ని ; దమమే దక్షిణ ; వాక్కే హూత ; ప్రాణమే ఉద్గాత ; నేత్రమే అధ్వర్యుడు, శ్రోత్రము అగ్నీధ్రుడు ; అతడు భుజించని సమయమే దీక్ష ; భుజించుటహ విస్సు ; జలపానమే సోమపానము ; క్రీడ ఉపసదిష్టలు: తిరగడం, కూర్చొనడం, నిలుచొనడం ప్రపర్యము ; ముఖము అవహనీయాగ్ని; మాట్లాడుట ఆహుతి, విజ్ఞానమే హెూమము ; సాయం పాతఃకాల భోజనం సమిధులు.''

శృతి వేరొకచోట ఈ యజ్ఞాంగాలను పరమాత్మరూపంగా వర్ణించింది. అలాంటి జీవన్ముక్తుడు భగవంతుడన్నమాట. యజ్ఞవరాహమూర్తిని యజ్ఞ స్వరూపంగా వర్ణించిన పురాణ వచనాలు గూడ దీనినే సూచిస్తున్నాయి. 'యజ్ఞోవైవిష్ణుః' అని మంత్రము. అందుకే విష్ణు సహస్రనామంలో పరమాత్మ యజ్ఞముగా వర్ణించబడటం గమనార్హం. ఇదంతా ప్రమాణం కాదనుకొంటే అసలు ప్రమాణమేలేదు.

శ్రీ శంకర భగవత్పాదులు మొదలైన ప్రాచీన సాంప్రదాయ ప్రవర్తకులు గూడ గురు ప్రార్థనతో తమ గ్రంధాలు ఆరంభించడం గమనించాలి. అంతేగాదు ఆత్మజ్ఞానముబొందిన వారెవరైనా తమకు గురుతుల్యులేనని గూడ శంకరులన్నారు. అలానే యితర సాంప్రదాయ ప్రవర్తకులందరూ గురుభక్తి ప్రధానులు. ఇక దానిని కాదనడానికి మనమెంతవారమూ ?

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥**

---





# మాష్టరు గారు మెచ్చిన ప్రశ్నలు

ప్ర : మృత్యువు తప్పదని కూడ మృతుంజయ జపం చేయాలని, చేస్తే మృత్యువును జయించవచ్చునని చెప్పడమేమిటి ? ఎంతవారైనా విధికి తలవంచవలసినదేగదా ?

-- ఒక జిజ్ఞాసువు.

జ : చాలా మంచి ప్రశ్న ! మృత్యువును జయించవచ్చని ఋషులు చెప్పిన భావ మొకటైతే యీనాటి 'పెద్దలు' చెప్పే భావం వేరొకటి ! అసలు పండితుల, జ్ఞానుల లక్షణం వేరు. " గతాసూన గతాసూంశ్చ నాను శోచంతి పండితా :" అన్నాడు కృష్ణుడు (భగవద్గీత). జ్ఞానులు చనిపోవడం గురించి చనిపోకపోవడం గురించి చింతించరు అని గీత చెప్పినది. కనుక చనిపోతామని భయపడేవారే దానినిలా తప్పుకునే యత్నం చేసి విఫలులవుతారు. చనిపోయేది దేహమే. పుట్టిన ప్రతీది ఏనాటికైనా చావవలసినదే (గీత) - ఈ ప్రకృతి మాత్రమే భగవంతుని శాసనం - అదే విధి. దానికి రాముడు, కృష్ణుడు, పామరుడూ - అందరూ తలవగ్గ వలసినదే.

అయితే నశించేది దేహమే. దానికి జన్మ ఉన్నది గనుక మృత్యువు వుండవలసినదే. అయితే జీవుడు కేవల చైతన్య స్వరూపి గనుక అతడికి మరణమూ లేదు, జననమూ లేదు. అంటే ఎన్నిసార్లు జన్మించి మరణించినా, జరిగేది అతడా దేహాలను నిర్మించుకోడం, శిథిలం కాగానే విడిచివేయడమూ మాత్రమే. ఇది ఆ జీవి అజ్ఞానంలో వున్నంతవరకూ జరగవలసినదే. నిరంతర సాధనవలన తాను నిజానికి సర్వగతమైన బ్రహ్మమేనన్న జ్ఞానం కల్గిననాడు తాను పరిమితుడు, అల్పజ్ఞుడూ అన్న భ్రాంతి వీడుతుంది. అంతటితో జననం నుండీ, మరణంనుండీ - అంటే ఒక శరీరాన్ని నిర్మించుకోడం, దానిని నశింపచేసుకోవడమనే అవసరం నుండి విడివడుతాడు. జ్ఞానమూ, సాధన జీవించి యుండగానే సాధ్యం గనుక, జ్ఞానం కల్గితే గాని దుఃఖ రాహిత్యం కల్గదు గనుక, అది కలిగేవరకూ జీవుడు దేహాలను ధరిస్తూ, విడుస్తూ వుండ వలసినదే.



అనేక జన్మల సాధనవలన క్రమంగా జ్ఞానం పక్వమవుతూవచ్చి, అది పూర్తి పక్వస్థితినందినవుడు ఇక జన్మించవలసిన అగత్యం నుండి విడివడుతాడు. అంటే తిరిగి, తిరిగి మరణించవలసిన దుస్థితి నుండి విడువడుతాడు. పరీక్ష పాసవడంతో మరలామరలా పరీక్షకు హాజరుకావలసిన, మరల చదువవలసిన, అగత్యం నుండి విడివడుతాడు విద్యార్థి.

పూర్ణమైన ఆత్మజ్ఞానం వలన ఇలా మృత్యువునుండి విడివడుతాడనీ, అట్టి పక్వజ్ఞానం త్రయంబకుడైన పరమేశ్వరుణ్ణి 'యజనం' చేసినందువలన కలుగుతుందనీ చెబుతుంది మృత్యుంజయమంత్రం. 'యజన' మంటే సర్వవిధములా సర్వకాల సర్వావస్థలయందూ ఆరాధించడం. అంటే శరీరంతో ఆయనకు ప్రదక్షిణ, పూజ, నమస్కారాదులు ; నోటితో ఆయనను స్తుతించడం నామం జపించడం, ఆయన గూర్చి వినడం సకల జీవులనూ యథాశక్తి సేవించడం, శరీరాన్ని అధర్మకార్యాలలో నియోగించకపోవడం, శారీరకయజనం. మనస్సును సదాధర్మబద్ధంగా వుంచుతూ వివేకంతో యోచించి వ్యర్థ వ్యామోహాలపట్ల వైరాగ్యం చెందటం, భగవన్నియతమైన సుఖదుఃఖాలను, మరణాదులనూ గూర్చివ్యర్థంగా చింతించకపోవడం, సచ్చింతన, ధ్యానము--ఇవి మానసిక 'యజనం'. భగవద్గీత యీ రెంటినీ ద్రవ్యయజ్ఞాలు, తపోయజ్ఞాలు అన్నది. దేహమానసాదులతో సద్గురువును సేవించి, పరిప్రశ్న చేసి యీ విధానాన్ని తెలుసుకొని ఆచరించాలి. ఇలాచేస్తే జ్ఞానపరిపాకం కల్గి మృత్యువు నుండి విడివడతాము–పండిన దోసకాయ చెట్టుతో దానికి గల బంధం (తొడమ) నుండి దానికై అదే విడివడ్డట్లు. అనన్యమైన ఈశ్వరధ్యానం చేయమని యీ మంత్రార్థం. ఆ మంత్రం చెప్పినట్లు చేయకుండా దానిని ఉచ్ఛరిస్తే సరిపోతుందా ? వైద్యుడు వ్రాసిచ్చిన మందులు సంపాదించి సేవించిన ఫలితం ఆయనిచ్చిన చీటీని వల్లిస్తే వస్తుందా ? పైన వివరించినటువంటి సదాచారంతో గూడి మంత్ర జపాదులు చేస్తేనే మృత్యురహితస్థితి కల్గుతుందని భగవద్గీత (శ్రద్ధాత్రయ విభాగయోగం) ప్రమాణం.



ప్ర :       ?

— అ. ఉమమహేశ్వరరావు

జ : ఈ రోజే నీకు వచ్చిన ఘోరవిపత్తు గురించివిని నిజంగా ఎంతగానో బాధకల్గింది. ఇంతవిపత్తు నీకు రాకుండా సాయి కాపాడి వుంటే ఎంతబాగుండేదోనన్పించింది. ఎలానీకు ధైర్యము, నిబ్బరము చెప్పాలో తెలియడం లేదు. కారణం ఎవరం చెప్పినా యిది పరోక్షంగాచెప్పే మాటలు నీ పరిస్థితి ప్రత్యక్షానుభవమూ, రెండూ ఒకటెలా అవుతాయి ?

అయితే మరొక విషయం కూడా వ్రాయాలి. అలా వ్రాస్తే లోకం నన్ను సభ్యత తెలియని కటిక వాడంటుందేమో తెలియదు. కారణం హృదయంలేనివి, సత్యహరములూ అయిన సభ్యతలతో నా ప్రాణం విసిగిపోయింది. కనుక వ్రాయకుండా వుండలేను.

జాబు చూడగానే మొదట నా జీవితము గుర్తొచ్చింది. మా అమ్మను నేను 2వ యేట పోగొట్టుకొని మాతృప్రేమ అంటే ఏమో తెలియకుండా పెరిగాను. అమ్మ ఎత్తుకొనడమేమిటో, నీరుపోసి, గుడ్డలేసి లాలించడంఏమిటో ఎన్నడూ ఎరుగను. అలాంటి ఆపత్సమయంలో మమ్మల్ని పలుకరిస్తే మా బాధ్యత ఎక్కడ మోయవలసివస్తుందోనని ఒక్క బంధువు కూడా మమ్ములను దగ్గరకు తీయలేదు. నాన్న గార్కి 45 సం॥లు ఉంటాయి. మేము నల్గురన్నదమ్ములము ; చివరివాణ్ణి నేను. నా తర్వాత 3 మాసాల ఒక చెల్లెలు. ఇక నాన్నగారే విశ్వరూపందాల్చారు. ఆయనే అమ్మ, నాన్న, వైద్యుడు, గురువు అయి పెంచారు. ఆయన అనేవారు - "మిమ్మల్ని మీ అమ్మ నాచేతులలో ఉంచి, ఎవరికీ పెంపకమివ్వవద్దని చెప్పి మరీ కన్నుమూసింది. తర్వాత బంధువులెవరూ సహకరించకపోవడంతో "ఏమైనా సరే సమర్థవంతంగా మనకర్తవ్యం నిర్వహించాలిగాని కృంగి ప్రయోజనంలేదు" అని నిర్ణయించుకొని ధైర్యోత్సాహాలకోసం 'భగవద్గీత' చదివేవారటరోజూ, పాండవులెన్ని కష్టాలుపడినా చలించక కృష్ణుని, స్వధర్మాన్ని అంటిపెట్టుకొనడం వలన అర్జునుడికి గీతోపదేశము, విశ్వరూప సాక్షాత్కారమూ ఆ భగవంతుని నుండి పొందే అర్హత ఎలా కల్గిందో గుర్తు తెచ్చుకునేవారట. అనతికాలంలో గుర్తించారట - అసలైన



జీవితం నాటి నుండి ఆరంభమైందని. అంతకుముందు గాని. ఆ విషాదఘట్టం జరగకుంటే అందరివలెనే జీవితంలో సుఖదుఃఖాల లోతు యింతవుంటుందని గాని, మొలకెత్తనివ్వాలేగాని మనహృదయంలో యింతటి ప్రేమా ఉండటం సాధ్యమనీ తెలిసేదేగాదుట. అదొక వరమనేవారు. అలా జాగృతమైన తమ హృదయంలోనే మాతృత్వంగా మా అమ్మ వారిలోంచి బిడ్డలను చూచుకొన్నది - అనేవారు. అలాంటి అవకాశం తమకు రాకుంటే జీవితం అవాస్తవికంగానే, ఉండిపోయేదనే వారు. అప్పటినుండి అంటుండేవారు. "కష్టంలేని బ్రతుకు బ్రతుకేగాదు. దుఃఖమెరుగని మనిషి మనిషేకాలేదు!"అని.

అలానే అన్నగారిబిడ్డ చనిపోవడం నా జీవితంలో నేను మేల్కొనడానికి ఉపకరించింది.

కనుక ఒక వంక తాత్కాలికంగా చూస్తే ఇలాంటిది నాలా హృదయ విదారకమయిన ఘట్టమే అయినా, నిజానికి అదొకవరంగా పరిణమించగల మహావకాశం గూడా. నీలోని సంపూర్ణ మానవత్వము, ఆత్మ బలము మేల్కొని నీవుగూడ తలమోటించి పరిస్థితుల నెదుర్కొని నిలబడగల్గితే నీ హృదయం ఇలా తల్లిదండ్రులను కోల్పోయిన ఎందరు అభాగ్యులకు ఆ వెలలేని ప్రేమను పంచియివ్వగలవు.

విత్తనం నశిస్తే గాని మొక్క కాజాలదుగదా? అలానే ఏసును శిలువవేస్తే గాని క్రీస్తుగా రూపొందటమూ జరుగదు. కొలిమిలో ఉంచితే గాని బంగారం మేలిమిగాదు, ఆభరణం కనుక. సూర్యోదయం సూర్యాస్తమయంలాగా అనివార్యంగా ప్రతివారికీ ఏదో ఒకసమయంలో ఏదో ఒక రీతిన ఎదురై తీరవలసిన మృత్యువును గూడ అమృతత్వాన్ని సాధించి సాటివారి కందించేలా మనకుపకరించగల అగ్ని పరీక్షలా యీ ఘటనను తీసుకో. కృంగవద్దు! 'బిడ్డ భవిష్యత్తేమిటి అనవద్దు' ప్రపంచంలో పసితనంలో తల్లులను పోగొట్టుకున్న నాలాంటి వారెందరులేరు? వారి వారి పూర్వపుణ్యాన్ని బట్టి వారి జీవితాలను వారే తెచ్చుకుంటారు. అన్నీ యధాప్రకారం జరుగుతాయి. ఆనాడు మేమంతా ఇలా మనగల్గుతామని మానాన్నగార్కిగాని, మా బంధుకోటికిగాని తోచివుంటుందా? బంధువుల సహకారం లేకపోతే



ఏమైనా ఆగిందా? అంతటినీ సక్రమంగా నడిపించి పిపీలికాది బ్రహ్మపర్యంతమూ తన బిడ్డలుగా చూచుకొనే ఆ భగవంతుడు సర్వమూ చూచుకుంటాడు. 'అల్లామాలిక్' అన్న సాయిమాటల లోతెంతో ప్రత్యక్షంగా చవిచూపించనున్న ఈ దివ్యసందేశాన్ని సందేశంగా తీసుకో! మృతిచెందిన వారిగూర్చి ఎటూ ఎప్పుడూ ఆలోచించనక్కరలేదు. ఈ విషయం "సాయి చనిపోవడమంటే ఏముంది? భూమిలోకిపోవడమేగదా? అంతమాత్రానికి దుఃఖిస్తూ కూర్చోవాలా? అని. తప్పక జీవుడు మరలా జన్మించితీరుతాడనీ చెప్పారు. కృష్ణుడు గీతలోను అదే చెప్పాడు. "ప్రాణాలుపోవటం, పోకపోవటం గురించి పండితుడు (యోచించగలవాడు) శోకించడు " అని చెప్పి, "నీవు శోకింపతగనిదాని గురించి శోకిస్తున్నావు" అని అర్జునుణ్ణి మందలిస్తాడు. అందరికీ అదంతా 'వేదాంతంగా వుంటుంది. భగవంతుడను, గురువను - ఆయనను నిజంగా ప్రేమించినవాళ్ళ యీ సత్యం చక్కగా అనుభవంతో తెలుసుకొనేలా చేస్తాడు. మొదట ఆ అనుభవం అగ్నిపరీక్షలా వుండవచ్చు. కాని కొంచెం నిబ్బరంతో, నిష్ఠ, 'ఓరిమిలతో' నిలబడి ఆయనకు శిరస్సువంచితే యిక ఏ దుఃఖమూ మనను స్పృశించలేని స్థితికి మనం సిద్ధం చేయటంతో అది మొదటిపాఠం - ఎంట్రన్స్ ఎగ్జామ్. అందులో ఫెయిల్ అయినవారంతా ఏమీ పొందకుండా పోయేవారే వారి ఆధ్యాత్మికత పై రంగుమాత్రమే.

ఇందులో దుఃఖించేందుకేమీలేదు. మేమంతా వేరువేరు రూపాలలో ఆ ఎంట్రన్స్ టెస్టులో పాసయినవారమే. కొత్త Candidate వైన నీవు బాధపడుతుంటే మా గతము గుర్తుకొస్తుందిగాని దాని అంతరార్థం తెలుసు. దీనిని సార్థకం చేసుకొనడమో, నిరర్థకం చేసికొనడమో తేలిపోయే విషమఘట్టం గనుక మాకు చేతనైనంత నిన్ను హెచ్చరిస్తున్నాము. నీకు ఆత్మస్థైర్యమిమ్మని సాయిని ప్రార్థిస్తున్నాము.

తొందరపడి, ఆవేశపడి, బెంబేలుపడి, "దేవుడు, సాయి-ఏమీ లేదు' " అన్న భ్రమకు రాకు. అలా అన్నందువల్ల గతించిన వారు తిరిగి వచ్చి పరిస్థితి అంతా యథాపూర్వమయ్యేటట్లయితే తప్పక అలానే అను. అలా అన్నందు వలన వారికేదేమీలేదు, సరికదా పైనా వివరించినంత చక్కని



హృదయ పరిపాకము, వికాసము, ప్రేమ మేల్కొనకుండా మూసేసే జీవన్మృతి ఆ వాదం. బాగా యోచించు.

ప్ర :- *శ్రీ గురుచరిత్రలో ఒక ముఖ్యమైన ప్రశ్న ఉదయిస్తుంది. ఒకసారి వేదధర్మునికి ప్రారబ్ధవశాన మతి స్థిమితము తప్పినదని, వేరొకచోట ఆయనకు ప్రారబ్ధమేలేదని, కాశీ ప్రభావాన్ని తెలపడానికి మాత్రమే ఆ ఋషి ఆ బాధలు కల్పించుకున్నారని వ్రాయబడింది. దీని సమన్వయమేమి?*

జ :- ప్రారబ్ధమున్నంతవరకే దేహం నిలుస్తుందనీ, కనుక జీవించియుండగానే ముక్తి ఎన్నటికీ సాధ్యంగాదని ఒక సిద్ధాంతమున్నది. దానికి సమాధానం శ్రీ రమణమహర్షి చెప్పారు: ఒకడు మరణిస్తే అతడి ముగ్గురు భార్యలు విధవలైనట్లు, జీవాభావం నశిస్తే అట్టి జ్ఞానికి సంకచితము, ఆగామి, ప్రారబ్ధములను అనుభవించే జీవుడే వుండడు; కనుక జీవన్ముక్తి సంభవము. లోకుల దృష్టిలో మాత్రమే అతడికి దేహము, ప్రారబ్ధమువున్నవని చెప్పవలసి వుంటుంది. ప్రారబ్ధవశాన వేదధర్మునికి మతి స్థిమితం తప్పినదని లోకుల దృష్టినుండి మొదట చెప్పడం జరిగింది. బ్రహ్మజ్ఞాని అయిన ఆ మహర్షిదృష్టిలో మాత్రం అది వాస్తవం కాదని రెండవ వాక్యానికి అర్థం.

ప్ర :- *మా అమ్మ ఎంతో భక్తితో దైవాన్ని పూజిస్తున్నా మానాన్న చనిపోయారు; ఎన్నో కష్టాలు సమస్యలు ఆమె ఎదుర్కోవలసివస్తున్నది. ఎందువలన?*

*— వి. వైదేహి, 10వ తరగతి, మైలవరం.*

జ :- భగవంతుడు సృష్టిమొదట్లో అందరిని సుఖసంతోషాలతో సృష్టించాడు. అలానే ఎన్ని జన్మలైనా కొనసాగటానికిగాని, యిష్టముంటే భగవంతునిలో ఐక్యమవడానికిగాని, ఎలా ధర్మంగా మంచిగా బ్రతకాలో తెల్పగల ఋషులద్వారా వేదాలు, శాస్త్రాలు ఇచ్చాడు.దానిని ఆచరించకపోతే వచ్చే ప్రమాదాలు గురించి తెల్పే గ్రంధాలు వారి ద్వారా ప్రసాదించాడు. దానిని అర్థంచేసుకొని మనం ఆచరించి బాగుపడడానికి, లేక వాటిని ఉల్లంఘించి పాపము, దాని ఫలితమైన దుఃఖమూ కొనితెచ్చుకునేందుకుగాని స్వేచ్ఛనిచ్చాడు. ఆ స్వేచ్ఛ లేకుంటే మనిషి యంత్రంలా అవుతాడు. ఇక జ్ఞానమూ, ముక్తి,



దైవత్వమూ వాటికి వీలవవు. స్వేచ్ఛవుండి దానిని దుర్వినియోగం చేసుకొనకుండడం నేర్చుకోగల్గాలనే జీవులను సృష్టించాడు. అన్నీ తెలుసుకొని బిడ్డలు తమకు తామే స్వతంత్రంగా, మంచిగా జీవించే వ్యక్తులవ్వాలనేగదా ఏ తల్లిదండ్రులైనా కోరేది? అందరికీ తల్లీ, తండ్రి, గురువు అయినా దైవమూ అలానే కోరుతాడు. కాని మనిషి యీ స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకొని ఇంద్రియ సుఖాలకు, స్వార్థానికి బానిసయై రాగ ద్వేషాలవలన పాపాలు ఎన్నో జన్మలుగా చేస్తూ దుఃఖాన్ని పెంచుకొని బాధలు పడుతున్నారు. ఎన్నో తప్పులు చేశాక భగవంతుణ్ణి ప్రార్థించి నంతమాత్రాన ఆ పాపఫలితంనుండి రక్షిస్తే ఇక జీవులన్నీ ఆశతో పాపాలు చేసి శిక్ష అనుభవించవలసినపుడు మాత్రం దైవాన్ని ప్రార్థించరా? ఇక ధర్మం ఆచరించి దైవాన్ని చేరుకుంటారా? కష్టపడి ధర్మం ఆచరించేవారికి, ఆచరించనివారికి ఒకే ఫలితం ఉండటం న్యాయమా? నీవు కష్టపడితే వచ్చినన్ని మార్కులు ఏమీ చదవకుండా సలాము మాత్రం కొట్టినవాళ్ళకుకూడా నీతో సమానంగా మార్కులువస్తే నీకెలా వుంటుంది? అందువలన అమ్మకుగాని ఇతరులకు గాని కొంతైనా దుఃఖం, జీవితంలో తప్పడంలేదు. అయితే దేవుణ్ణి ప్రార్థించడం ఎందుకు? అనకూడదు. ఇదంతా అర్థం చేసుకొని ప్రార్థిస్తుంటే ఇకముందైనా ఎన్ని కష్టాలు వచ్చినా రాముడు, హరిశ్చంద్రుడువలే మనం కూడా ధర్మాన్ని అనుసరిస్తూ వెనుక చేసిన వాటిని ఓర్పుతో, పశ్చాత్తాపంతో, నిజాయితీతో అనుభవించి పాపాన్ని కడిగేసుకో గల్గుతాము. అప్పుడు దైవాన్ని చేరుకుంటాము. ఇవన్నీ నేను వ్రాసిన గ్రంథములో వున్నాయి. కనుక మీ చదువులు చెడకుండా చూచుకొంటూ, నా రచనలన్నీ చదివాక వాటిలో మీకు తీరనిసందేహాలుంటే నాకు వ్రాయాలి. లేకుంటే నేనింకా క్రొత్త గ్రంథాలు వ్రాసేందుకు తీరిక వుండదుగదా? శలవులలో "మతం ఎందుకు"?" మొదలయిన గ్రంథాలు అనేకసార్లు చదివేసి ఆలోచించాక సందేహాలు అడగండి. శ్రీ సాయి మీకు చక్కని బుద్ధి శక్తిని ప్రసాదింతురుగాక!

---

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా!**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః**

---



# సమాజపరమైనవి

ప్ర :- **త్రైలింగస్వామి వంటి మహనీయులు ఈ దేశంలో గుర్తింపులేక కాశీ వెళ్ళిపోయారని వ్రాశారు. అటువంటి మహనీయులకు మనదేశంనుండి విదేశాలకు వెళ్ళిపోతున్న నేటి శాస్త్రజ్ఞులకు భేదం ఏమిటి?**

**-- విద్యానగరు, మా పాఠకురాలు.**

జ :- ఇటు పూర్ణుడైన సద్గురువును, అటు విశ్వకర్త, భర్త అయిన పరమాత్మనూ సక్రమంగా సేవించి పరమార్థం సాధించుకొనే వారి నుద్ధరించడానికే శ్రీదత్తాత్రేయస్వామి మహనీయుల రూపాలలో అవతరిస్తాడు. ఎక్కడ ఈ సత్సాంప్రదాయం తెలియక మహనీయుల సాన్నిధ్యాన్ని సార్థకం చేసుకునేవారుండరో ఆ ప్రాంతం విడిచి, యీ సత్సాంప్రదాయం తెలిసి వినియోగించుకునే వారుండే ఆ ప్రాంతాలకు వెళతారు. **ఈ సాంప్రదాయాన్ని వారే తెల్పుకుంటే మందబుద్ధులు అది ఆత్మస్తుతిగా తలుస్తారుగాని అర్థంచేసుకోరు.** ఈ కారణంగానే మన రాష్ట్రంలో అవతరించిన శ్రీపాద శ్రీవల్లభులు గూడా యీ ప్రాంతాన్ని విడిచి ఆ సాంప్రదాయం అమలులోనున్న మహారాష్ట్రానికి వెళ్ళారు. మహనీయులు ఎక్కువ లోకహితం చేయగలందులకు వెడతారు. వైజ్ఞానిక శాస్త్రవేత్తలలో ఎక్కువమంది స్వలాభంకోసం వెడుతున్నారు. అదీ తేడా!

ప్ర :- **మానవుడే దేవుడని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఇక మానవుడికి దైవాన్వేషణ ఎందుకు?**

**-- చి॥ లత, ఉదయగిరి.**

జ :- శాస్త్రాలు ఘోషించినది మానవుడు దైవమనిగాదు, ఆత్మ దైవమని, దీనిని వివరిస్తాను.

నీరు దైవమనుకుంటే అందులోని అలలు జీవులు. అనంతకోటి జీవులలో మానవులొక వర్గమే. ఇపుడు అల తన గురించి తాను రెండు



భావాలు కల్గియుండవచ్చు. ఒకటి తాను అలను మాత్రమేనని, రెండు తాను నీరని. అలగా చూస్తే ప్రతి అల తక్కిన అలలకంటే భిన్నమే. నీరుగా చూస్తే అన్నీ ఒక్కటే. అల అనేది నీరు ధరించే రూపమే. దానికి ఉత్పత్తి, వృద్ధి, స్థితి, లయము అనే మార్పులుంటాయి. అది అశాశ్వతము, పరిమితము. నీరు శాశ్వతము, సర్వగతము, ఆకార రహితము మరియూ ఎన్ని ఆకారాలైనా ధరించగలది గూడ. అలల పుట్టుకతో అది ఉద్భవించదు. అలల నాశంతో అదినాశనమవదు. అల మనిషి, నీరు దైవము. నేను మానవుణ్ణి అనుకోవడం నేను అలను అనుకోవటం లాంటిది. ఇదే అజ్ఞానం. నేను 'నీరు' అని గుర్తించడంలాంటిది 'నేను పరమాత్మను' అన్న జ్ఞానం. నేను మానవుణ్ణి అన్న స్థాయిలో మనముంటే అదే బంధము. అజ్ఞానము, మాయ. దానినే ధ్యానాదుల ద్వారా, సద్గురుకృపద్వారా అతిక్రమించి జ్ఞానంపొందడమే పరమావధి.

**ప్ర :- మా వూరిలో ఒకవ్యక్తి బాబా పటమునుంచి, చేతుల నుంచి విభూతి తీస్తున్నారు. మీ వ్యాఖ్యానం ?**

**— చిలకల చంద్రశేఖర్, తెనాలి.**

జ :- ఆధ్యాత్మికతలో ప్రయోజనకారి కానిదేదైనా అవాంఛనీయమే. అన్నమైన అరగకుంటే విషతుల్యమౌతుందిగదా! ఇలా విభూతి తీయడం వలన ప్రయోజనం? అది మహిమగలదనడం సమంజసముగాదు. సాయిని స్మరించి మట్టినొసట పెట్టినా రోగాలు తగ్గిన సందర్భాలు చరిత్రలో వున్నాయి. అపుడు ప్రత్యేకించి యిలా విభూతి తీయడంవలన దానికి వచ్చిన పవిత్రత ఏదీలేదు.

అన్నిటికంటే ముఖ్యమయిన విషయం - కుశాభావు అలాచేస్తే సాయి అతనిని దండించి మాన్పించడమేగాక దానిని తీసుకున్నవారు అపవిత్రులవుతున్నారని, అది పాపమని చెప్పి ఆ దోష నివారణకోసం 'గురుచరిత్ర' అతనిచేత 108 పర్యాయాలు పారాయణ చేయించడమే గాక ఆ విద్యను పరిత్యజించ



మని నిర్భందించారు. శ్రీసాయిబాబాకు మించిన ప్రమాణమింకొకటి లేదు.

'అలా విభూతి తీసే బదులు బహుమతులు గెల్చే లాటరీ టిక్కెట్లు తీయగల్గితే మంచిది గదా!' అని జోక్ చేసి ఆ ఛాయలకు వెళ్ళకండి. అలా వచ్చిన విభూతే మహిమ కలదని శాస్త్రంలో ఎక్కడా చెప్పబడలేదు. పిడకలు కాల్చి చేసినదైనా భావయుక్తంగా వాడుకుంటే ప్రయోజనకారియని దైవ గ్రంధాలన్నీ ఘంటాపథంగా చెప్పాయి.

ప్ర :- ***మన దేశంలో తప్పక దర్శించ తగిన సిద్ధ పురుషుల గురించి ప్రతి సంచికలోను మీరు వ్రాస్తూంటే బాగుంటుంది.***

**— సుధామయి, విజయవాడ.**

జ :- ఆ విషయాలు మాకు ఎంతో ఆసక్తికరమైనవే. కాని భగవద్గీత కాలంలోనే శ్రీ కృష్ణుడు వేలాదిమంది మానవులలో ఆత్మ జ్ఞానంకోసం యత్నించేవారు ఏ ఒక్కరో వుంటాడు. అలాంటివారెందరిలోనో ఎక్కడో ఒక్కడు సిద్ధిపొందుతాడు'' అన్నాడు. ఇక యీ కలికాలం సంగతి చెప్పవలసినదే మున్నది? 'నిజమైన "ఫకీరు" చాలా అరుదు' అన్నారు శ్రీ శిరిడీ సాయిబాబా గూడ. అందుకని యీ విషయంలో మనమెంతో జాగ్రత్తగా వుండాలి. మనకేమీ తెలియకపోవడాన్నే సదవకాశంగా తీసుకుని వారి స్వార్థంకోసం ప్రజలను ప్రక్క దారి పట్టించేవారే ఎక్కువ. "శ్రీ గురుచరిత్ర" అను 'సంహితాయన గురు ద్విసాహస్రి'' ఉపోద్ఘాతంలో గమనిస్తే పూర్ణ పురుషులను ఆశ్రయించడమెలాగో తెలుస్తుంది. "శ్రీ సాయిబాబా జీవితచరిత్ర ", "శ్రీ సంహితాయన గురు ద్విసాహస్రి'' శ్రద్ధగా పారాయణచేస్తూ మోక్షోపాయం తెల్పమని ఆర్తితో ప్రార్థిస్తుంటే వారి ఆదేశం స్పష్టంగా వస్తుంది. మహనీయుని దర్శించడం మన కవసరమైనపుడు ఆయనే మనను అచటకు పంపుతారు. ఈవిషయంలో మన అభిప్రాయాలూ, యిష్టాయిష్టాలూ ఏమీ పనికిరావు. పుణ్యక్షేత్ర దర్శనం గూడ మహనీయుడాదేశిస్తే సంపూర్ణ ఫలితమిస్తుందని " శ్రీ గురుచరిత్ర", "శ్రీ సాయిబాబా జీవితచరిత్ర" తెల్పుతున్నాయి. శ్రీ గురుడాదేశించినపుడు



శ్రీశైలం దర్శించినపుడే వారి శిష్యునికి సంపూర్ణ ఫలితం కల్గింది. మిగిలినవారు శ్రీగురుని గుర్తించక పోవడమే జరుగుతుంది. అలానే త్రివేణీ సంగమానికి బయలుదేరదలచిన దాసగణుకు సాయి చెప్పినది గుర్తుంచుకోవాలి.

పూర్ణులైనవారు మంత్రోపదేశమివ్వరు. చమత్కారాలు చేయరు; ప్రశ్నలు చెప్పరు. శ్రీ సాయిబాబా, అక్కల్‌కోటస్వామి, రమణమహర్షి మొదలయినవారు యిందుకు ఉదాహరణలు. శ్రీ రామకృష్ణ పరమహంస కూడా ప్రత్యేకించి జగన్మాత ఆదేశిస్తే తప్ప ఎవరికీ ఉపదేశం చేసేవారు కాదు. పూర్ణ పురుషులెవరికి సంస్థలుండవు. వారేమీ వ్రాయరు, చదవరు. వారి ఆత్మజ్ఞానం సంపూర్ణము; అందుకని వారిని మనంగా గుర్తించడం అసంభవము.

నేడు మనకెదురవుతున్న సాధువులు సహితము ఒకే ఉత్తమ పంథాలో జీవితము గడపక నలుగురు జనం చేరగానే వెర్రితలలు వేస్తున్నారు. అందుచేత దర్శించదగిన సిద్ధపురుషులు అంటే ఎవరని చెప్పగలము? సాయి చరిత్ర, శ్రీ గురుచరిత్ర శ్రద్ధతో పారాయణ చేసుకుంటే ఏ మహనీయుని దర్శనమైనా అయితే అవుతుంది లేకపోతే మన సాయి మనకే వున్నారు.

ప్ర :- ***వేరు వేరు భక్తులు, సాయిభక్త సమాజాలు ప్రచురించిన సాయి అష్టోత్తర శతనామాలు విభిన్నంగా వుంటాయి. విష్ణు సహస్రంలాగా సాయి అష్టోత్తర శతనామావళి వుంటే బాగుంటుందేమో!***

***— బి.జి.కె. గాంధీ, హైదరాబాదు.***

జ :- భీష్ముడు ఋషితుల్యుడు, దైవాంశసంభూతుడు, శ్రీ కృష్ణుని పూర్ణతత్వం తెలిసినవాడు కనుకనే ఆయన చేసిన స్తుతులను రెండింటినీ - భీష్మ స్తవరాజము, విష్ణు సహస్రనామము -- వ్యాసుడు మహాభారతంలో యధాతధంగా గ్రంధస్తం చేశాడు. అందుకే దానిని ప్రామాణికంగా తీసుకొని శ్రీ శంకర భగవత్పాదులు దానినే వ్యాఖ్యానించారు. ఆకారణంగా అది ప్రామాణికంగా దేశమంతటికీ ఒక్కటిగా నిలచింది. చివరకు



శ్రీ సాయి గూడా దాని పారాయణే ఆదేశించారు. కనుక ఏవిధంగా చూచినా సాయి భక్తులందరూ నిత్యపూజలో దానినే చదవడం--అదిగూడా ఆయన చెప్పినట్లు ఒక్కొక్క నామానికి అర్థం స్పష్టంగా తెలుసుకొని -- దానినే మననంచేయడం అత్యుత్తమము.

అయితే ఈనాటి పరిస్థితులను బట్టి ప్రతివారికి దానిని పూజలో చదువుకొనేంత సమయముండదు. అటువంటప్పుడు చక్కగా అర్థమై హృదయాన్ని ఏ నామాలు పులకింప చేస్తాయో ఆ నామాలు 108 విష్ణు సహస్రంలో నుంచి ఎవరికివారే ఏరుకొని అదే నిత్యం చదువుకోవడం మంచిది. అవి యాంత్రికంగా కూడా అప్పుడప్పుడు అంత వరకు చదివే కొన్ని నామాలస్థానే విష్ణుసహస్రంనుండి మరికొన్నింటిని చేర్చుకొనిచదువుకోవడం మంచిది. అర్థచింతనమే వాటి పరమప్రయోజనమని సాయి చెప్పింది మరుస్తే సర్వం దండుగే.చిన్నపిల్లలు వారికర్థంగాని భాషలో ప్రేమ గీతాలు ఆలపించినట్లుంటుది. అందుకే శంకరులు వాటి అర్థం వివరించారు.

**అష్టోత్తరం చదవడంలోని ఆంతర్యము మనస్సు ఆ దైవం యొక్క గుణాలను స్మరించి హృదయముప్పొంగడమే.** కనుక రెండవ పద్ధతి శ్రీ సాయిలో ఆ సమయంలో వారి లీలలలో ప్రకటమయ్యే గుణాలు వారికేవి హృదయాన్ని కదిలిస్తాయెూ వాటిని స్మరించటం ఉత్తమం. ఇవి సంస్కృతములోనే వుండనక్కరలేదు. మన ఎదుట తమ లీలల రూపంలో, పటం రూపంలోనున్న సాయి గుణాలను మాతృభాషలోనే స్మరించడం ఉత్తమోత్తమం. ఈ దృష్ట్యా చూస్తే ఒక అష్టోత్తరం అందరికీ ఉపయోగపడే అవకాశంలేదు.

ప్ర :- ***గుండమెందుకు వేస్తారు. అందులో నడచిన వారి ప్రాముఖ్యత ఏమి?***

**-- హేమలత, నెల్లూరు.**

**జ** : గుండంలో నడవగల్గడమొక యుక్తి. నిప్పుమీద నుసి పేరుకోకుండా చూచుకొని, త్వరగా అడుగులు వేస్తూ పోతే ఎవరికైనా కాలదు. ఈ



సంసార దుఃఖాన్ని గుండమని, అశ్రద్ధ - అవివేకాలనే మసి చేర కుండా చూచుకొంటేగాని దుఃఖమనే వేడి సోకకుండా వుండదని దాని భావం. అలా అయినా జీవితమే, మమకారాలు, ఆస్తి పాస్తులూ శాశ్వతమని తలిచి వాటినే వ్యామోహంతో అంటి పెట్టుకోవడంలాంటిది గుండంలో నెమ్మదిగా నడవజూడడం. అలాగాక యివి అశాశ్వతమని తలచి వాటిపై తగుమాత్రమే నిలచి త్వరత్వరగా జనన మరణ రూపమైన గుండం దాటిపోవడమే శ్రేయోమార్గమని దాని భావం. ఆ భావం మరవడం వలన యిదొక వినోదంగా, గారడీగా మారింది. గుండంలో నడవడం భగవంతుడున్నాడన్న నిదర్శనంగా పామరులు తలచారు; అదే నిజమైన భావంగా తలచి అంతకంటే పామరంగా హేతు నాస్తిక వాదులు వాటిని సవాలు చేసారు. ఒక వేళ గుండంలో నడవడము అద్భుతమే అయినా, అలా నడచినవాడి సామర్థ్యాన్నది తెల్పుతుంది గాని దేముడున్నాడని అదెలా నిరూపిస్తుంది? ఈ విషయమెవరూ ఆలోచించలేదు.

ప్ర :- **స్వార్థమూ, ఆత్మవంచనగల ఆస్తికుని కంటే నాస్తికుడే మేలుగదా?**

**— శ్రీ వెంకట రమణారావు, ప్రొద్దుటూరు.**

జ :- నిస్వార్థమూ, చిత్తశుద్ధి కల్గిన నాస్తికుడు మాత్రమే అవిలేని ఆస్థికునికంటేమేలు. నాస్తికునిలో అవి లోపించినపుడు ఆస్తికుడే మేలు. కారణం ఏ మహాత్ముని సంపర్కము వల్లనైనా అతడికివి కల్గే అవకాశం ఎక్కువుంటుంది. చిత్తశుద్ధిలేనపుడు ఆయిద్దరూ పిడివాదంతో తమను తాము సమర్థించుకోజూస్తారు. చిత్తశుద్ధి కలవాడు అన్వేషకుడౌతాడు. అన్వేషణ తప్పక ఆస్తికానికి దారితీస్తుంది- అన్వేషణలో చిత్తశుద్ధి లోపిస్తేతప్ప అన్వేషణ పుట్టాలంటే ఎక్కువమందికి "ఏది నిజం"? మతమెందుకు శ్రీ సాయినాధ ప్రబోధామృతము ఉపకరిస్తాయి.



**ప్ర :- అసూయా ద్వేషాలతో నిండిన ఈ సంఘములో మానవుడు ఆధ్యాత్మికపథంలో పురోగమించుట సాధ్యమా? జీవనవిధి నిర్వహించుచు పయనించడమెలా?**

**— ఎమ్.ఎస్. రెడ్డి, కడప.**

1-4-87 సంచికలో శ్రీరామనవమి ప్రత్యేక సందేశము వ్యాసంలో కొంత వివరించాను. పైన చెప్పినరీతిన యుక్తితో యథాశక్తి ఆధ్యాత్మభావంతో జీవించడానికి యత్నిస్తూ, అట్టి గ్రంథాలను అధ్యయన మననాదులు చేస్తూ, అవగాహనను సాటివారితో ప్రయత్న పూర్వకంగా పంచుకుంటూ,అట్టి యత్నాన్నే వారిలోనూ మేల్కొల్పడానికి తీవ్రయత్నం చేయాలి. అట్టి మనోవికాసం ప్రస్తుత పరిస్థితులలో వ్యక్తి నుండి వ్యక్తికి సంక్రమించవలసినదే. దీనినే "స్వాధ్యాయ ప్రవచనేచ నప్రమదితవ్యం" అన్న శృతి చెబుతుంది. ఈ జాగ్రత్తను మన వెనుకటి తరాలవారు తీసుకోకపోవడం వల్లనే ఈనాడీ దుస్థితి కలిగింది. ఉగ్గుపాలతో ఇట్టి అవగాహనను మనకి ప్రాచీనులందిస్తూ వచ్చారు. గనుకనే ప్రపంచంలో ప్రాచీన సంస్కృతులన్నీ నశించిపోయిన తర్వాత గూడా మన సంస్కృతి ఈనాటికి ఇంతమాత్రమైనా నిలిచివున్నది. ఆ సంస్కృతీ వృక్ష మీనాటికీ మహనీయులనబడే పండ్లను మనకందించగలుగుతున్నది.

ఈనాడు మన సమాజం నైతికంగా పతనంగావటానికి కారణం మొక్కటే, పునర్జన్మ స్వర్గాదిలోకాలు, దైవాన్ని గూర్చి నమ్మలేని వారికి సహితం వ్యక్తి నైతికంగా ప్రవర్తించడం ఎందుకు సరియైనదో వివరించేవారు లేకపోవడమే. బలమైన ప్రాణి బలహీనమైన వాటిని హింసించి స్వలాభాన్ని చేకూర్చుకునే ఈ అనంత జీవసృష్టిలో మానవజాతి మాత్రమే ఈ నైతిక సూత్రాన్ని ఎందుకవలంభించ యత్నించాలి? వాటికిలేని తమకుగల ఈ బుద్ధి శక్తే యిందుకు కారణమంటే, మరీ ఎక్కువమంది అలా ఆచరించలేకున్నారు గదా! కాని మరొక వంక శుద్ధమైన అవగాహన కల్గి నచ్చాక ఎట్టి ఆదర్శం కోసమైనా ప్రాణాలొడ్డి కొందరు కృషి చేయడం గూడ చూస్తున్నాము. కనుక



నైతికత ఏమిటో, ఎందుకావశ్యకమో క్షుణ్ణంగా తెలిసినపుడు మానవులెక్కువ మంది దాని నాచరించకుండా వుండలేరు. కనుక మనలో ప్రతి ఒక్కరు అట్టి అవగాహనను సాధించము. దానిని సాటివారితో పంచుకోవడము బుద్ధిశక్తిగల మానవజాతికి పరమధర్మం. అందుకే సుముఖతే సత్వగుణమని, దైవీసంపదనీ అవిలేని యజ్ఞ, దాన, తపః కర్మలు నిష్ఫలములవుతాయని భగవద్గీత గూడ చెబుతుంది. "ఇదంతా అనావశ్యకము. ఒకరి సంగతి మనకనవసరము; మనవరకు ముక్కు మూసుకుంటేచాలు" అన్న నేటి "ఆస్తికు"ల సాధన వ్యర్థమవుతున్నది. ఇట్టి అవగాహనను సాధించి ఆచరించడం ద్వారా శాస్త్రాలలో చెప్పిన చిత్తశుద్ధిని పూర్ణంగా యిదివరకే సాధించిన యీనాటి మహనీయులకి ఏకాంత ప్రయత్నాన్ని, కేవలఅంతర్ముఖత్వాన్ని చూచి అట్టి శుద్ధిని సాధించని మనమూ అనుకరించ ప్రయత్నిస్తే ఒకవంక మనం సాధనలో పురోగమించలేమని, మరొకవంక సమాజం నైతికంగా దిగజారడానికి మన నిష్క్రియత్వం కారణమై మనపట్ల దోషంగా పరిణమిస్తుంది." ధర్మాన్ని రక్షించినవారిని ధర్మం రక్షిస్తుంది." అన్న ఆర్యోక్తికర్థమిదే. అధర్మము పెరుగుతుంటే పట్టనట్లు వూరుకున్న వారుగూడా అధర్మం చేసినవారే అవుతారని ధర్మసూత్రం. పతనావస్థలో నున్న సమాజంలో యిట్టి శుభయత్నం ఆరంభంలో కష్టతరమే. కాని ప్రాణాపాయ స్థితిలోనున్న సోదరునికి సేవ చేయడం కష్టతరమని అతనిని మరణించనిస్తామా? ఎంతటి కష్టాన్నైనా ఓర్చి బ్రతికించుకుంటాముగదా? అలానే ధర్మం విషయంలోనూ.

ప్ర :- ***అవతారాలు, చిల్లర దేవుళ్ళు మన ధర్మంలో ఉన్నారేమి? క్రైస్తవ, మహమ్మదీయ ధర్మాలలో ఒక్కొక్కరే ఉన్నారు కదా?***

***— సి.యస్. రెడ్డి, తాడేపల్లిగూడెం.***

జ :- అవతారాలు అన్ని మతాలలోను వున్నారు. కాకుంటే దైవం గురించిన వారి వారి భావన ననుసరించి వారిని అవతారాలనక ప్రవక్తలు అన్నారు. నామ రూపరహితము, సర్వశక్తిమంతము అయినదే దైవమని అదే



పూజనీయమని తలచి, దానివలన, దానినుండి ఉత్పన్నమయిన రూపాలన్నింటిని దాని సృష్టిగా మాత్రమే తలచి వాటిని వారు బాహ్యంగా పూజించరు. వారు చెప్పినది శిరసావహించడమే నిజమైన గౌరవము. విశ్వాసము, పూజ అన్న భావంలో వుండి వారందరూ దేనిని ప్రార్థించారో దానినే ప్రార్థించాలని వారు చెప్పారు. ఇది ఇస్లాంలో బాగా కన్పిస్తుంది. మన ఉపనిషత్తులు కూడా అట్టి తత్వాన్నే తెల్పుతాయి. కాని క్రైస్తవంలో దైవమొక్కడే అని వారెంత చెప్పినా "పరలోకంలోని తండ్రి, అతని కుమారుడు, పవిత్రాత్మ" అని ముగ్గురు దైవాలేర్పడ్డాయంటారు. దానికి తోడు ఏసుప్రభువుకు తల్లి అయింది గనుక మరియమ్మకు కూడా దైవత్వమిచ్చారు! శిలువకు పవిత్రత నీయడంవలన అది మరొక దైవమయింది. రోమన్ కాథలిక్కులు మహనీయులను గూడా ఆరాధించడంతో నానా దేవతలు వారికీ ఏర్పడ్డాయి.

ఇస్లాము ఆవిర్భవించకముందే వారికీ అనేక దేవతలూ వుండే వారు. ఒకే దైవంయొక్క వివిధ రూపాలని తెలియక వేరని తలచి వివిధ అరబ్బు జాతులు మతకలహాలలో నశిస్తుంటే మహమ్మద్ అవతరించి అనేక దేవతలను నిరసించి, వారంతా ఒక్కడే అయిన దైవం యొక్క సేవకులని చెప్పి వారిని సమైక్యపరచారు. మన ధర్మానికి గూడ యిట్టి సంస్కరణ అవసరమవుతున్నది. శివకేశవ బేధమే ఒక తార్కాణము. అందుకే సాయినాథుడు సద్గురు భక్తిని మాత్రమే ప్రతిపాదించారు. అదే వైదిక మార్గమని 'లీలామృతం' ఉపోద్ఘాతము చదివినా 'సంహితాయన గురుద్విసాహస్రి' చదివినా తెలుస్తుంది.

ప్ర :- ***సాయిబాబా గత నంచికలో ప్రచురించిన దేవాలయాలెందుకు? అన్న వ్యాసం చదివాను. దేవాలయాలు అవసరం లేదనా మీ అభిప్రాయము? తెలుపవలసినది.***

***-- ఒక పాఠకుడు.***

జ :- ఏదైనా సద్వినియోగమైతే ఉపయోగము. లేకుంటే నిరుపయోగమేగాక, సామాన్యంగా అవాంఛనీయమౌతాయి గూడ. ప్రకృతిలో



ఉపయోగంలేనిది విడిచివేయబడుతుంది- మల మూత్రములవలె. అలా జరుగనప్పుడు స్వస్థత చెడుతుంది. అలానే ఆహారం అరిగితే మంచిది; లేకుంటే అది వాంతిగాగానీ లేక మలంగాగాని వెడలిపోవాలి. లేకుంటే హాని చేస్తుంది. ఎక్కువ విలువైన వస్తువులలో యీద్వయీభావం మరీ తీవ్రంగా వుంటుంది. ఉదాహరణకు తక్కువ ఆవశ్యకతయైన చర్మము మీద వ్యాధికంటే అతి విలువైన గుండె, నరాలు, ఊపిరితిత్తులు వంటి భాగాలలోని వ్యాధులు అత్యంత ప్రమాదకరములు. అనావశ్యకమైన పదార్థాలను విసర్జించే మూత్రపిండాలు అవని సరిగా చేయకున్నా ప్రాణ ప్రమాదం సత్వర మేర్పడుతుంది. అవసరమయిన ప్రాణవాయువు, పోషకములను స్వీకరించడము - బొగ్గుపులుసు వాయువు, మాలిన్యాల విసర్జనము--యిదే జీవ లక్షణము. ఆధ్యాత్మికతలో గూడ భక్తి--వివేకముల క్రియ యిదే-- దుఃఖ నివృత్తికి ఆవశ్యకమైన జ్ఞానము, భక్తులను పొందడము, దుఃఖకరములైన అవివేకము, రాగద్వేషాదులు మొ॥నవి విసర్జించడమూ అవసరము. సామాన్యులు యీ అవాంఛితాలను వీడరు గనుకనే అప్రశస్తమైన విత్తనాలు మననట్లు, మొలకెత్తనట్లు సరిగా భక్తిజ్ఞానాలు నాటుకోవు, వృద్ధిచెందవు. అట్టివారి పరిస్థితి త్రిశంకుస్వర్గమే- వ్యాధికి మందు తీసుకొని పత్యం చేయనట్లే. ఒక్కొక్కప్పుడు నిరుపయోగమే గాక ప్రమాదకరం గూడ.

దేవాలయాల ఆవశ్యకతను గూడ దీనిని బట్టే నిర్ణయించాలి. నిధులు పోగుచేసుకొనడము, శైవవైష్ణవ తగాదాలు, తిరుణాళ్ళప్పుడు రికార్డుడాన్సులు, ఆలయం పై ఆధిపత్యంకోసం కార్యకర్తలలో తగవులూ మాత్రమే అవి చేసే కార్యక్రమమైతే లాంఛనంగా భగవంతుడు ఏడ్చిపోతాడేమోనన్నట్లు - ఖైదీకిలాగ నిత్య ధూప దీపాలు మాత్రం భక్తిశ్రద్ధలు లేని అర్చకులు చేయడం భగవంతునికి, సమాజానికి గూడ అవసరమే గాదు. తగవులు, తన్నులాటలు, ఆలయదోపిడీలు, ఘరానా స్వాహాలు యివి మాత్రమే పర్యవసానాలవుతాయి. ప్రజల దృష్టిలో, మతం పరువు మంటగలవటానికే పనికివస్తాయి.



మన సంస్కృతికే లజ్జాకరమైన పుక్కిటి పురాణాలను, శైవ వైష్ణవ ద్వేషాలను ప్రకటించి ప్రజలను రెచ్చగొట్టే ప్రక్షిప్తాలతోనిండిన పురాణాల శ్రవణమే చేయిస్తూ యితర మత ప్రచారకులు, నాస్తిక హేతువాదులు భయంకరంగా విమర్శించే అవకాశము కల్పించే కార్యక్రమాలనే చేపట్టేట్లయితే మందిరాలుండరాదు. ఎవరూ వేలెత్తి చూపలేని, తలవంచక తప్పని శిరిడీ సాయిబాబా, రమణమహర్షి, రామకృష్ణ పరమహంస మొ॥న వారి చరిత్రలు, వారి బోధలు, వాటి సహాయంతో మాత్రమే భగవద్గీతాదుల శ్రవణం చేయించేట్లయితే; నేటి విద్యావంతులైన యువకులకు, ఆధునిక విజ్ఞానంతో సమన్వయం చేసిన ఆస్తిక బోధ, అట్టి అంశాలమీద వారికి వ్యక్తృత్వము, వ్యాసరచన పోటీలు నిర్వహించినట్లయితే మందిరాలు కావాలి. ఆలయ నిధులన్నీ యిట్టి కార్యక్రమాలకు వినియోగించాలి. అలా భావితరాలలో ఆస్తికదృష్టి, భక్తి శ్రద్ధలూ పెంపొందించకనే, ఆలయాలు కట్టడం ముందుముందు భక్తి శ్రద్ధలు లోపించడం దైవాన్ని కించపరచడమే అవుతుంది; మన సంస్కృతిని అపహాస్యం చేయడమే అవుతుంది. ఇందులో చురుకుగా పని చేసి ప్రతిభను చూపే విద్యార్థులకు విద్యా ఉచిత పారితోషికాలూ ఏర్పాటు చేయాలి. ఉపాధ్యాయులకు అట్టి శిక్షణ శిబిరాలు నిర్వహించడానికి నిధులు వినియోగపడాలి. తమనిధులిలా వినియోగించడం వల్లనే అటు యితర మత ధర్మాలు గాని, నాస్తిక-హేతు భౌతిక వాదాలు గాని నేడు విజృంభిస్తున్నాయని గుర్తించి తగురీతిన నిర్వహించగల్గితే దేవాలయాలు కావాలి. కారణం అవి సార్థక నామధేయాలు.

ప్ర :- *'ఆపద్బాంధవా,' 'శరణాగతవత్సలా' అనే నామాలను మననం చేసికొని, వ్రాసినంతమాత్రాన ఏమౌతుంది. లోకమంతా దీనివల్లనే మారిపోతుందని తమరి భావమా?*

— ఎమ్.జనార్ధన శెట్టి, శ్రీ వెంగయ్యా, సూళ్లూరు పేట.

జ :- ఫలితం పొందాలంటే యత్నం కావాలి. యత్నం సరిగా



జరగాలంటే సంకల్పం దృఢంగానూ, పరిశుద్ధంగానూ వుండాలి. కాని అంత మాత్రమే చూచుకుంటే మనమే కర్తలమన్న అహంకారము వస్తుంది. ఇది భక్తిని, సాధననూ చెడగొట్టి, రాగ, ద్వేష, అసూయాదులను పెంచి మనసు కర్మబంధంలో చిక్కిస్తుంది. కనుక సత్సంకల్పాన్ని ఓరిమితోనూ, నిష్ఠతోనూ భగవంతునికి, ఆయన రూపమైన సద్గురువుకు నివేదించాలి. అపుడు శ్రేయస్కరమైనది తగినసమయంలో సర్వజ్ఞుడు, సర్వసమర్థుడూ అయిన సద్గురువే నెరవేర్చేవారు అన్న ఎరుక మిగులుతుంది. అహంకారము, కర్మఫలంపట్ల అతి వ్యామోహము మొ॥న వికారాలు కల్గవు. అంతేగాక ఆయనకు నివేదించిన వంటకం లాగనే సంకల్పం గూడ పవిత్రము శక్తివంతము అవుతుంది. పారాయణ ప్రార్థనలవలన ఎందరికో కష్టాలూ, కోరికలూ వారిశ్రేయస్సుననుసరించి సాయి నెరవేర్చడంచూస్తున్నాము కదా? ఏనాడు దేశ శ్రేయస్సుకోసం మనమందరమూ కలసి చేసే సంకల్పము, ప్రార్థన చాలినంత బలీయమౌతాయొ అపుడు పరిస్థితులలోనూ, మానవడి భావాలలోను చిత్రమైన మార్పు వస్తుంది. కారణం భగవంతుడు, సద్గురువు అందరిహృదయాలలోను వ్యాపించియుంటాడు కదా ?

అయితే మనం మోక్షాన్ని మనసా, వాచా కోరడమేగాక దానికి తగిన క్రియంగూడ వివేకము, పట్టుదలలతో చేయాలి.డబ్బు, విద్య ఆర్జించ, యత్నించినట్లే. అలానేపారాయణ, సాయిబోధల మననం వలన మనం తెలిసికొనినదానిని ప్రక్కవారితో పంచుకోవాలి. దీనికితోడు మన సంస్కృతిని అర్థం చేసుకొని నేటి ప్రజలకు తెల్పి వారికి దానిపై భక్తి కల్గించాలి, నేటి సమాజంలోని అవాంఛనీయమైన రీతులకు దేశ భక్తి లోపించడము, సాటి భారతీయునిపట్ల ఆదరణ లేకుండడము, అందుకు అవివేకంతో పాశ్చాత్య నాగరికతను అనుకరించడము కారణాలు అవి తొలగించే అంశాలను తెల్సుకొని వీరికి తెల్పాలి. ఇవన్నీ చేసే ఓపిక, పట్టుదల రావాలంటే సంకల్పము దృఢము పరిశుద్ధము కావాలి. ఒకే సంకల్పాన్ని మళ్ళీ మళ్ళీ అవగాహనతో



పటిష్ఠం చేసుకుంటే బలపడుతుందన్నది నిత్యానుభవము అందుకే అట్టి సంకల్పంతో అందరమూ ప్రార్థనా పూర్వకంగా '**ఆపద్బాంధవా, శరణాగతవత్సలా**' అన్న నామ లేఖనగా ఏకాగ్రతతో చేయడమెంతో ప్రధానము. మనం సమిష్టిగా చేసిన ఈ ప్రార్థన వలన భగవంతుడు ఆ సత్సంకల్పం నెరవేర్చగల మహనీయులను, కార్యదక్షులను అవతరింప చేస్తాడు. అందుకనే మన ప్రాచీన ప్రార్థన "**సర్వేజనా స్సుఖినోభవంతు**" అని ముగుస్తుంది. అలాంటి నిస్వార్థమైన సంకల్పంచేసి ప్రార్థించడం వలన మనలో నిస్వార్థము, సర్వభూత హిత కాంక్షలనే సత్వగుణాన్ని పెంచి మన సాధనను గూఢశక్తివంతము చేస్తుంది. పారాయణ, పైన చెప్పిన నామ లేఖనాలవలన తప్పక ప్రయోజనముంటుంది.

ప్ర :- **ధర్మము, దానములు మనమీ కాలములో ఉత్తమంగా ఆచరించగల పద్ధతి సూచించండి ?**

**— ఎమ్.జనార్ధన శెట్టి, సూళ్లూరు పేట.**

జ :- అన్ని జీవుల రూపాలలోనూ ఆ సద్గురువే ఉన్నాడన్న అవగాహనతో జీవించడమొక్కటే ధర్మాచరణకు మూలం. అది ఉత్తమం. మనలోని ఆత్మయే సర్వులలోని ఆత్మయని,మన కష్టసుఖముల వంటివే వారివిగూడ అని గుర్తించి నడచుకొనడం మధ్యమం. అంటే మనకితరులేది చేయాలనుకుంటామో అదే యితరులకు మనం చేస్తూ యితరులు మనకేది చేయకూడదనుకుంటామో మనం అది యితరులకు చేయకుండడం మధ్యమం. కారణం మొదటిది పారమార్థికదృష్టి. రెండవది కేవలం మానవతా దృష్టి. స్వర్గం కోసం, మంచి జన్మల కోసం ఆశించి మాత్రమే ధర్మం చేయడమూ, నరకము మరియు దుఃఖపూరితమైన జన్మలకు వెరచి మాత్రమే, పాపం చేయకుండడము అధమపక్షం. అయినప్పటికీ ధర్మమాచరించకపోవడం అధమాధమం.

సాటివారు కూడా ధర్మమాచరించనిదే, మనమొక్కరమే ధర్మ



మాచరించడం ఎంతో కష్టంతో కూడిన పని. ఆ కారణంగా మాత్రమే సాటివారికి కూడ ధర్మప్రబోధం చేయడం మధ్యమపక్షం. సృష్టిలో ప్రతిజీవి సాటి జీవులకు హితం చేస్తూ మాత్రమే జీవిస్తుండడం వలన మనం జీవించగల్గుతున్నాము. చెట్లు కాయలను, పశువులు పాలు యిస్తూంటేనే మనం జీవిస్తున్నాం, కనీసం వాటి మాత్రమైనా సాటి జీవులకు హితం చేయడం మన ప్రధాన కర్తవ్య భావనతో సాటివారికి ధర్మప్రబోధం చేయడం అంతకంటే మేలైనది. సర్వజీవులకు ఆత్మోద్ధరణ కవకాశమివ్వడమే భగవంతుని సంకల్పమన్న విశ్వాసంతో ధర్మ ప్రబోధం ఆయన సేవగా చేయడం అత్యుత్తమం. ఇందువలన నర్వులకూ ఉత్తమ జీవిత విధానం తెలిసి, వారి జన్మ పరంపరలన్నీ ఉత్తమములయ్యే అవకాశం వారికి కలుగుతుంది. అట్టి ధర్మాన్నాశ్రయించుకొని అర్థము, కామము మోక్షము సాధించుకొనటమే సత్యయుగమంటే. మార్క్సిజం మానవతావాదం మొదలైన నాస్తికోద్యమాలు కూడా చివరకు ధర్మ ప్రబోధమే చేయడం చూడవచ్చు. అందుకే మతాలన్నీ ధర్మప్రచారానికి అంత ప్రాముఖ్యమిచ్చాయి --స్వార్థం, నంకుచిత్వము మొదలైన కారణాలుగా గూడ కొందరు ధర్మ ప్రచారానికి పూనుకొనడం వల్లనే ఎంతో అరిష్టం జరుగుతుంది. కృతజ్ఞతతో మంచిని ఆచరించలేనివారు చేసే ప్రబోధమెంత బాగున్నట్లనిపించినా, అది మురికిగుంటలో పడ్డ గంగాజలం వలె స్వీకరించదగదని ఋషులందుకే చెప్పారు.

అన్ని దానాలకంటే అన్నదానం గొప్పదన్నారు. కాని విద్యాదానం వల్ల ముల్లోకాలూ దానమిచ్చినంత ఫలితమని మహాభారతం చెబుతుంది అందుకు వినియోగించిన ధనమే వుత్తమమైన దానం అందుకే 'శ్రీ సాయిబాబా జీవితచరిత్ర', 'శ్రీ గురుచరిత్ర', 'శ్రీ సాయి ప్రబోధామృతము' మొ॥నవి ప్రచురించడానికే మనమంతగా ప్రయత్నించేది. నత్సంగాలద్వారా ప్రోత్సహించేదిన్నూ. భగవంతుడు స్తోమత ప్రసాదించిన ప్రతివారూ తమ ఆర్జనలో విధిగా కొంతభాగమిలా భగవదర్పితమన్న బుద్ధితో దానం చేయడమే

